# యిప్పుడు చేయాల్సింది

యిప్పటిదాకా వూహించిన
ప్రేమగీతాల్ని వున్న పళంగా చెరిపేసి
కొత్త విధ్వంస కవి సమయాల్ని కనుగొందాం
ఎవరికీ అర్థం కాని దేవనాగరి వేద వాక్యాన్ని మార్చేసి
మాండలికంతో చరమ వాక్యం రాద్దాం
విశ్వాసాల్ని నేలమట్టం చేయడమే
ప్రపంచ దృశ్యమైన చోట
మనిషిపై విశ్వాసాన్ని వీరోచితంగా నిలబెడదాం
త్రిశూలమూ కాషాయమూ
విషనాగులై వెంటాడిన చోట
రాజ్యమైన యజ్ఞోపవీత కౌటిల్యాన్ని శిరచ్ఛేదం చేద్దాం—
ఒకే గుండె పదే పదే చితికిపోయి
పచ్చి పచ్చిగా వుంటోంది
ఒక కన్ను ఎప్పుడూ నీటితో నిండి
మసకబారి పోతోంది / నిన్నటిదాకా మన నమ్మకాలు
యిప్పుడు / బీభత్స విషాదాంత నాటకంలో
రాజుగారికీ సామంతులకూ
పదవుల విలువలు—
యుద్ధంలో పదే పదే తెగి పడినవి మన తలలే!
విజయానికి ఎప్పుడూ సోపానమైనవి మన శవాలే!!
ఒకే అబద్ధాన్ని వేయిసార్లు కూసి నమ్మిస్తున్నప్పుడు
దిక్కు తెలీని చీకట్లోనూ
నిర్నిద్ర నిజాలను నిరంతరం నినదిద్దాం
అంధ వున్మాదాలని దూసే విశ్వాసాలను పాతిపెట్టి
మతాతీత శ్రమ విలువలు మాట్లాడుదాం
నిట్టూర్పు అవుతాడనుకున్న సియావర్ రాముడు
మన కలల గూటికి నిప్పు పెట్టినప్పుడు
'దేవుడు చచ్చిపోయాడని' ప్రకటించి
శవ దహనం చేద్దాం / మతమే అధికారమయ్యే
పదవీ కాంక్ష కుతంత్రాన్ని / నిరస్త్రమై సరే
నిక్కచ్చిగా తెగేసి చెబుదాం

నారాయణస్వామి

# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక

సంపుటి : 16 సంచిక : 6

ఏప్రిల్ 1993



రచనలు పంపవలసిన చిరునామా :

నిర్మలానంద,

వర్కింగ్ ఎడిటర్,

29-28-67, దాసరివారివీధి,

సూర్యారావుపేట,

విజయవాడ - 520 002.


★ ★ ★★ ★


ఏజంట్లు, చందాదారులు

వ్రాయవలసిన అడ్రస్,

ఇతర వివరాలకు :

కొత్తపల్లి రవిబాబు,

ప్రధాన కార్యదర్శి

జనసాహితి, నగరం-522 268

తెనాలి తాలూకా





యువత కోసమే నేను
కలం పట్టాను. వారిమీద
నా కెంతో ఆశ వుంది.
ఈ సమాజాన్ని మార్చ
గల దిట్టలు వాళ్ళే.

—రాహుల్జీ

★ ★


వెల : రూ. 5 సం॥ చందా రూ. 50

ప్రత్యేక సం॥ చందా రు. 100

# ఈ సంచికలో

# సంపాదకీయం పరిణామ మనుడు-రాహుల్జీ

"Ever let the fancy roam
Pleasure is never at home"
(ఊహని విశాలంగా విహరించనీ
ఇంటి వద్ద ఆనందం లేదు ఏనాటికీ-కీట్స్)

చూపులో నిశిత పరిశీలన, మనసులో తీరని జ్ఞాన తృష్ణ, పాదాలలో ప్రపంచమంతా పర్యటించమని వత్తిడి చేసే సంచారతత్వం, ఒక్క రోజైనా విశ్రాంతి నెరుగని జేబులో, లేదు లేదు వేళ్ళమధ్య కలం, ఉద్యమాలలో కురకటానికి ఉవ్విళ్ళూరే ఉత్సాహము—ఇవన్నీ కలగలిపితే ఒక రాహుల్జీ సమగ్ర చిత్రం.

రష్యా విప్లవమూ, సోషలిస్టు నిర్మాణం యొక్క ప్రభావం భారత మేధావులలో చాలామంది పైన పడింది. దోపిడీ పీడనలకు తావులేని సమ సమాజ నిర్మాణమే మానవజాతికీ, భారత ప్రజలకీ అవశ్యకమని అంతరాంతరాల్లో అస్పష్టంగా భావించే వారందరికీ, అది ప్రత్యక్ష, సత్యమై, కర్తవ్య పరాయణులుగా రూపుదిద్దుకోడానికీ ప్రేరణమయింది. అది రాహుల్జీ లాంటి వారి మీద ప్రగాఢమైన ముద్రవేసి ఎంతో విస్తారమైన సమాచారాన్ని, విశ్లేషణనూ ఆయన ద్వారా మన కందేటట్టు చేసింది.

'చారిత్రక విభాత సంధ్యల మానవ కథా వికాసానికి' కారణమయిన భౌతిక, సాంస్కృతిక జీవన క్రమాన్ని అర్థం చేసుకోడానికి పుంఖాను పుంఖంగా నవలల రూపంలో, తాత్విక గ్రంథాలుగా, జీవిత చరిత్రలుగా, పరిశోధనా విశ్లేషణలుగా అనువాదాలుగా, చరిత్రలుగా, భాషాధ్యయనాలుగా, యాత్రా విశేషాలుగా—రాహుల్జీ యొక్క విరాట్ రూపంగా —మనకు సాక్షాత్కరించాయి.

తల్లి కడుపులోనే మనిషి జీవ పరిణామ దశలన్నీ గడిపినట్టుగా-భారతీయ విభిన్న తాత్విక పరిణామాల క్రమమంతా ఒక్క రాహుల్జీలో మనకు ద్యోతకమవుతాయి. హిందూ సాధువుగా—వేదాంతిగా,-బౌద్ధ భిక్షువుగ -త్రిపిటకాచార్యునిగా; గాంధీవాదిగా-సహాయ నిరాకరణోద్యమ కాంగ్రెసు కార్యకర్తగా; మార్క్సిస్టుగా-రైతాంగ పోరాట యోధునిగా ఆయన పరిణామక్రమం చాలా విలక్షణమైనదీ, ఉత్కృష్టమైనదీను!

చరిత్ర రచన పట్ల భారతీయులు చూపించినంతటి నిర్లక్ష్యం ప్రపంచంలో మరెవరూ చూపలేదేమో! పురాతన సంస్కృతీ, నాగరికతలకు మన దేశం కూడా ఒక ప్రత్యేకతనూ, విశిష్టతనూ సంతరించుకుని వున్నా, దాన్ని చరిత్రగా గ్రంథస్తం

చేసినది అతిస్వల్పం. కనుక భారత చరిత్ర రచనకు మూడు స్తంభాల ఆధారంగా రూపొందించుకోవలసి వుంటుంది. 1) పురాతత్వపు పరిశోధనలు 2) వేదాలు, ఉపనిషత్తులు, బౌద్ధుల రచనలు, పురాణేతిహాసాల నుండి మౌళిక సాహిత్య వాంగ్మయ సర్వస్వం 3) విభిన్నతె గల, కులాల, ప్రాంతాల, జాతుల, మతాల వైవిధ్య పూరిత అవిచ్ఛిన్న సాంస్కృతిక జీవనం. ఇంత సామాగ్రి వున్నా మానవ నాగరికతలోని సంక్లిష్ట దీర్ఘయాత్ర ప్రగతికి చోదక శక్తులను పట్టుకోలేక పోతే సాధారణ జ్ఞానంతో భూమి బల్లపరుపుగా వుందనీ, భూమి చుట్టూ సూర్యుడు తిరుగుతున్నాడని భావించినట్టు పూర్తి విరుద్ధ నిర్ణయాలకు కూడా రావచ్చు.

అందుకు శాస్త్రీయ దృక్పథం అవసరం. డి.డి. కోశాంబి అన్నట్టు "మనిషి తిండికోసమే జీవించడనేది వాస్తవమే కానీ, తిండి లేకుండా జీవించగల మానవ వంగడాన్ని యిప్పటిదాకా ఎవ్వరూ ఉత్పత్తి చేయలేదు". మానవుల భౌతికావసరాలను తీర్చుకోడానికి సాగించిన ఉత్పత్తి సాధనాలూ, పద్ధతులూ- మిగులుని పంపిణీ చేసుకోడానికి ఏర్పాటు- వాటి మధ్య ఐక్యతా- ఘర్షణా యివే చరిత్ర నడకకు రహదారులు.

వంకర టింకరలు, ఎగుడు దిగుళ్ళు, ముళ్ళబాటలూ, కందకాలూ, పూల బాటలూ, తారురోడ్డులూ- ఎన్ని వున్నా చారిత్రక వేగాన్ని పెంచేవో తగ్గించేవో తప్ప మొత్తంగా వెనక్కి తిప్పగలిగేవి కావు అడ్డదారులూ లేవు.

ఈ చారిత్రక నడకల్ని మనం తెలుసుకోవటానికి కావాల్సిన విస్తృత సమాచారాన్ని, సాహిత్యాన్ని అందించిన మహనీయుడు రాహుల్జీ. గతమంతా రాజుల వీరోచిత యుద్ధాల, ఔదార్యపు దానధర్మాల చరిత్రగా, రాణుల ప్రేమ పురాణాల గాథలుగా ప్రచారమవుతుంటే.... దాన్ని ప్రజా దృక్పథం నుండి అర్థం చేసుకోడానికి ఉపయోగపడే ఎన్నో పరిశోధనలూ, రచనలు మనకు అందించాడాయన. భారతీయ తాత్విక చింతనలో పరంపరాను గతంగా దోపిడీ వర్గాల భావజాలాన్ని ఎదుర్కొంటూ వస్తున్న ప్రజాస్వామిక, తాత్విక వారసత్వపు మూలాల్ని ఆయన మనకు పరిచయం చేశాడు. అగ్రవర్ణ ఆధిపత్య సంస్కృతి యొక్క క్రౌర్యాన్ని, రాచరికం యొక్క దౌష్ట్యాల్ని ద్వేషించి ప్రజాస్వామిక సంస్కృతీ నిర్మాణానికి కావాల్సిన చైతన్యాన్ని పాఠకుల కాయన కలిగించాడు.

తన 50 ఏళ్ళ చురుకైన సాహిత్య, పరిశోధనా కాలంలో 50,000 పేజీల రచనల్ని చేశాడు. పుస్తకాల పురుగులా కాక విశాల ప్రపంచాన్ని చుట్టి వచ్చాడు. నాగరికతల్ని స్వయంగా పరిశీలించాడు. ఏ విద్యాలయాల్లో చదువుకోకుండా ప్రధానంగా స్వయంకృషితో అనేక భాషల్ని ఆకళింపు చేసుకున్నాడు. ఉపన్యాసాలకే పరిమితమయిన కొందరు మేధావుల్లా కాకుండా, ప్రజా పోరాటాల్లో ప్రత్యక్షంగా

(తరువాయి 86 వ పేజీలో)

# పాణ్యంలో ప్రజాస్వామ్యం

1991 నవంబరులో దేశ ప్రధాని నంద్యాల పార్లమెంటును గెలుచుకున్నప్పుడు అందులోని పాణ్యం అసెంబ్లీ భాగంలో ఆయనకు లక్ష వోట్లకు పైగా మెజారిటీ వచ్చిందట! అనాడు పి. వి. నరసింహారావుని గెలిపించటానికి ఎంతో కృషి చేసిన కోట్ల విజయభాస్కరరెడ్డి, ప్రస్తుతం తానే స్వయంగా రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉంటూ పాణ్యంలో పోటీ చేసి కేవలం 31 వేల మెజారిటీ మాత్రమే పొందగలిగారు... అంటే ఆయన నిజంగా గెలిచినట్టా? ఓడినట్టా? కిందటిసారి లాగా బహిరంగంగా భారీ రిగ్గింగు చేసుకోడానికి ఈసారి సాధ్యపడక పోవటం వల్లే "గత 45 సంవత్సరాల రాజకీయ జీవితంలో ఎన్నడూ పడనంతటి మనోవేదనని" ఆయన అనుభవించాడు.

"వోటు హక్కును స్వేచ్ఛగా వినియోగించుకోండి"; "మీ వోటు మీరే వేయండి"- లాంటి కొత్త నినాదాలు మారు మూల గ్రామాలకు కూడా వెళ్ళటం ఆయనకీ ఆయన 'అసుర గణా'నికీ కొత్త రకపు ఇబ్బందులే కలిగించి వుంటాయి. అందుకే ఈసారి ఎత్తులు మార్చాల్సి వచ్చింది.

కాంగ్రెసేతర అభ్యర్థులకు ఎన్నికల ఆఫీసుల కొరకు ఎవరూ అద్దెకివ్వరాదు. వారికి అన్నం, నీళ్ళు యివ్వకూడదు. (తాగటానికీ, సాగు చేసుకోడానికీ నీళ్ళు లేని గ్రామాలు చాలా వున్నాయి.) ఎటువంటి ఆదరణా చూపకూడదు. అన్నిటికన్నా ముఖ్యంగా ఎన్నికల రోజున పోలింగు ఏజెంట్లుగా ఎవరూ కూర్చోకూడదు. వీటిని అతిక్రమిస్తే ఎన్నికల తర్వాత 'రాం కీర్తన' వుంటుంది. కాళ్ళూ చేతులూ విరిచెయ్యవచ్చు. గత చేదు అనుభవాలు ప్రజలకు నిత్యం ఉలికిపాటు కలిగిస్తుంటాయి.

ఈ వాతావరణంలో తమ ఓటు తాము వేయటం సాధ్యం కాదని ప్రజలు భయ విహ్వలులై వుండగా ముఖ్యమంత్రికి లక్ష ఓట్ల మెజారిటీ తెప్పిస్తామనీ, 70 వేలనీ, 60 వేలనీ - ఇలా ఆయన అనుచర మంత్రులూ, 'అసుర గణాలు' ప్రకటించాయి. ఎంత విచిత్రమైన పరిస్థితి....ప్రజలకు తమ ఓటుని వినియోగించుకోగలుగుతామనే ఆత్మ విశ్వాసం లేదు గానీ, ముఖ్యమంత్రికి మాత్రం వేలాది ఓట్ల మెజారిటీని సాధించి పెడతామని ధైర్యంగా చెప్పగలగటం....ఎంత హాస్యాస్పదం! భయంకర చేదు నిజం!! కరడు గట్టిన నిరంకుశ పద్ధతుల పట్ల గల పరిపూర్ణ విశ్వాసం!!!

ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ (OPDR) ఆంధ్రప్రదేశ్ పౌర హక్కుల సంఘం (APCLC) నియమించిన 'ఎన్నికల పరిశీలన కమిటీ'లో 'ప్రజాసాహితి' కూడా పాల్గొని ఎన్నికలు జరిగిన తీరుని ప్రత్యక్షంగా పర్యవేక్షించింది.

ఓట్లు వేయటానికి ట్రాక్టర్లూ, జీపుల మీద 'జనం' ఉత్సాహంగా వెడుతూనే వున్నారు. చాలా సేపు క్యూలలో నిలబడే వున్నారు. అయితే వారిలో నిజమైన ఓటర్లెందరు? తరలించబడ్డ వారెందరు? మనకంటె ఎక్కువగా పోలీసులకే తెలుసు.

ఒక్క పోలింగు బూతులో కూడా కాంగ్రెసేతర అభ్యర్థులకు స్థానికులెవరూ ఎన్నికల ఏజెంటుగా లేరు. ఇతర ప్రాంతాల తెలుగు దేశం పార్టీ ఎం.ఎల్.ఏ.లు దాదాపు 40 మంది పోలింగు బూత్‌లో రేణుకా చౌదరి ఎన్నికల ఏజెంట్లుగా కూర్చోవలసి వచ్చిందంటేనే పరిస్థితి అర్థం కాగలదు. అలా చేయగలగటంలోనే కాంగ్రెసు విజయం దాగి వుంది.

ప్రగతిశీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి) అభ్యర్థి కా॥ సంధ్య తరపున తెలంగాణా, కోస్తా జిల్లాల నుండి కూడా అనేక మంది వచ్చి పోలింగు ఏజెంట్లుగా వుండవలసి వచ్చింది. వారిలో కొందరిని పోలింగు బూతుల్లోకే వెళ్ళనివ్వకుండా దౌర్జన్యం చెయ్యటం, ఇంకొందరిని కిడ్నాప్ చెయ్యటం, రహస్య ఓటింగు పద్ధతిలో ఎన్నికలు జరగాలని పట్టుబట్టిన వారిని మహిళలని కూడా చూడకుండా కొట్టటం - లాంటి అనేక సంఘటనలు పాణ్యం ప్రజాస్వామ్యానికి మచ్చు తునకలు.

వోటర్ల లిస్టులో ఉన్న పేరూ, వోటు వెయ్యటానికి వచ్చిన వారి పేరూ సరిపోల్చుకోడానికి వీలు లేదు. అలా ప్రయత్నిస్తే కాంగ్రెస్ ఏజెంట్లకి కోపం వస్తుంది. 'గౌరవనీయుడయిన' ఓటరుని అవమానించి నట్టవుతుంది. పేరు సరిపోలినా తండ్రి/భర్త పేరో, వయసో కలవదు. ఒకసారి ఓటు వేసిన వ్యక్తి తిరిగి ఓటు వేయకుండా చేయగల సాంకేతిక పరిజ్ఞానమూ లేదు. అలా పరిశీలించే 'సాహసం' ఎన్నికల యంత్రాంగానికే లేదు.

సాధారణ ప్రజల మీదా, కింద స్థాయి పోలీసుల మీదా జులుం చేసే పోలీసు అధికారులు పాణ్యం పెత్తందార్ల గులాములుగా నిస్సిగ్గుగా ప్రవర్తించారు.

వెల్దుర్తిలో నారాయణరెడ్డో, జేతంచర్లలో మురళీధరరెడ్డో, ద్రోణాచలం రవికుమార్ గౌడో, బనగానపల్లె, పాణ్యంలలో ధాంభూపాలరెడ్డో....ఎవరయితేనేం.... ప్రజల్ని అనుక్షణం భయంలోనే వుంచి స్థానిక ఆర్థిక వనరుల్నీ, రాజకీయ పెత్తనాన్నీ గుప్పిట్లో వుంచుకోవాలని చూసే 'ప్రజాస్వామిక' నియంతలు ఫ్యూడల్ పెత్తందారీ వ్యవస్థకు మూల స్తంభాలు.

స్త్రీ విముక్తి కార్యకర్తలూ, విద్యార్థి. రైతు సంఘాల వాలెంటీర్లు పాణ్యం ఎన్నికల సందర్భంగా అక్కడ మారుమూల గ్రామాల్లోకి కూడా వెళ్ళి పెత్తందార్ల దోపిడీ దౌర్జన్యాల్ని నిర్భయంగా బట్టబయలు చేశారు. ప్రజలకు పోరాట సందేశాన్ని అందించారు. అవమానాలకు, దౌర్జన్యాలకు, దాడులకు గురైనా మొక్కవోని

(తరువాయి 83 పేజీ)

# మాయా వాదం నుంచి మార్క్సు వాదానికి

— కాకరాల

ఒక మనిషి జీవితంలో తనని తాను తీర్చి దిద్దుకుందుకు ఎందరో జ్ఞాత అజ్ఞాత వ్యక్తుల సహాయం వుంటుంది. ఈ దృష్టితో చూస్తే నా మీద తమ బలమైన భావముద్ర వేసిన సాహిత్యతత్వవేత్త లెందరో వున్నారు. వారిలో ముఖ్యుడు, ప్రధముడు రాహుల్ సాంకృత్యాయన్.

ఆయన శతజయంతి సంవత్సరమిది. ఈ సందర్భంగా నామీద తన భావ ముద్రని వేసిన ఆయనకి కృతజ్ఞత తెలియజేసుకునే చిన్ని ప్రయత్నమిది. అంచేత అనివార్యంగా యీ ప్రయత్నం నా సొంత గొడవతో మొదలవుతుంది. అందుకు నన్ను క్షమించండి.

నా చిన్నతనమంతా మా అమ్మ పుట్టిల్లు కాకరపర్రులో జరిగింది. అది పండిత గ్రామం. ఆ వూళ్ళో ముసలితనంలో తన కూతురింట్లో వున్న చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్ని చూసిన జ్ఞాపకం నాలో యీ నాటికీ నిలిచిపోయింది. వారి మనవడు పురాణపండ లక్ష్మీ నరసింహం హైస్కూల్లో నాకు క్లాస్‌మేటయ్యారు.

ఇది చెప్పడానికి కారణం వుంది. ఆ పండిత గ్రామంలో పండిత పుత్రుల సజ్జుండేది. తోక తక్కువ గాని ఆ వూళ్ళో వున్న పందు కోతుల్లా అల్లరి చేసేదా సజ్జు. ఆ సజ్జులో వొకడిగానే నా ఊళ్ళో పెరుగుతున్నాను.

నాకు వూహ వచ్చేనాటికి ఆ వూర్లోనగర సంకీర్తనలు, ఏకాహాలు, సప్తాహాలు నవమలు, నవరాత్రులు- ఒకటేమిటి భూస్వామ్యానికి సంబంధించిన సమస్తమైన క్రతువులు, వ్రతాలు, పండుగలు-పబ్బాలు జరుగుతూండేవి.

భూస్వామ్య సంస్కృతి నిండా మాయావాద భావజాలమే. ఈ మాయావాద సంస్కృతిలో భక్తి యెంత వుంటుందో, అంతకు రెట్టించిన మోతాదులో రక్తి వుంటుంది. నాకు వూహ వచ్చీరాని వయస్సుకే ఈ భక్తీ రక్తీ నన్ను బలంగా ఆకట్టుకున్నాయి; వాటి మధ్య వున్న వైరుధ్యం ఆ చిన్న తనంలోనే నాకు అనుభవాని కొచ్చింది.

పదేళ్ళింకా రాకముందే ఆదర్శవంతుడైన భక్తుణ్ని కావాలనే ఆశ, నియమ బద్ధంగా పుజలూ, పునస్కారాలూ, వుపవాసాలూ, గుళ్ళచుట్టూ ప్రదక్షిణాలు. ఇందుకు పూర్తి విరుద్ధమైన "లైంగిక సుఖాను రక్తి" పెద్దల్లోనూ, పశుపక్షుల్లోనూ కంట పడింది. నాకే తెలీని విధంగా అంటువ్యాధిలా అంటుకుంది.

పదేళ్ళ వయస్సు నుంచే నాలో మంచి చెడ్డల "అంతర్మథనం" ఆరంభమైంది.

మహా భక్తుణ్ని కావాలని కఠోర దీక్షగా కృషి చేస్తున్నప్పుడే, నా ఆదర్శ భవనాల్ని పునాదులతో సహా కూల్చేస్తూ "రక్తి" తలెత్తేది. కుమ్మరి పురుగులా దొలి చేస్తూ నా తలనో కల్లోలిత ప్రాంతంగా మార్చేసేది. ఉత్తమోత్తమ మైన ఆ భావనలకి నీచాతి నీచమైన యీ భావనలకి మధ్య- గడియారం పెండ్యులంలా- వూగులాడుతూనే నా బాల్యమంతా గడిచింది. ఆ రోజుల్లో మంచి వాణ్ణనిపించుకోవాలనే స్వార్థం పెద్దవాళ్ళంటే వున్న భయం "రక్తి" వాలుకి పడిపోకుండా నన్ను రక్షించాయి.

ఆ చిన్న తనంలోనే మనుష్యుల మాటలకీ, చేతలకీ మధ్య దూరం కనిపించింది. ముఖ్యంగా నన్ను భయభక్తుల్లో వుంచుతున్న పెద్దల్లోనే ఆ వారమెక్కువ కనిపించింది. వారు చెప్పేదానికి భిన్నంగా రాత్రి యే స్త్రీతో సుఖాన్ని పొందారో ఆ స్త్రీనే పగలు పది మందిలో అవమానకరంగా మాట్లాడం, నీచంగా న్యూనత పర్చడం నాకు కష్టమనిపించేది. మహా భక్తుణ్ని కావాలని ప్రయత్నిస్తున్న నాలో కామ ప్రవృత్తిని ప్రకోపించే ఆలోచనలు వచ్చి నామీద నాకే అసహ్యమనిపించేది. ఒక్క మాటలో నా శరీరం "మెచ్యూర్" కాని వయస్సులోనే, నా మనసు "మెచ్యూర్" కావడం మొదలైంది.

ఇలా యెందుకు జరుగుతుందో కారణం తెలీక, నన్ను నేను తిట్టుకుంటూ తిరుగుతున్నాను. అప్పటికే నాకు పుస్తకాలు చదివే అలవాటుంది. వరసకి బావైన గురువుతో- యీయన నాకు చదువు చెప్పేవాడు- లైబ్రరీకి వెళ్ళేవాణ్ని. ఆయన చదివిన శృంగార కావ్య ప్రబంధాన్ని- పచ్చిబూతు పద్య పుస్తకాల్ని- చదవడంతో ఆరంభమైన నా పఠనాసక్తి, ప్రాచీన తెలుగు సాహిత్య గ్రంథావలోకనంగా మారి పెరిగింది. అలా పుస్తకాల్ని తిరగేస్తున్నప్పుడు నా చేతికో పుస్తకం వచ్చింది. పన్నెండు పదిహేనేళ్ళ మధ్య నా చేతికొచ్చిన ఆ పుస్తకం రాహుల్ సాంకృత్యాయన్ రచించగా అల్లూరి సత్యనారాయణ రాజు అనువదించిన "ఓల్గా సే గంగ".

ఈ పుస్తకం ఆ వయస్సులోనే నా కర్థమైందంటే, అది అబద్ధమవుతుంది. కాని ఆ వయస్సుకే నాకు కష్టమనిపించి, నన్ను పీడిస్తున్న అనేకానేక సమస్యలకు- ముఖ్యంగా స్త్రీని తక్కువ చేసి మాట్లాడ్డానికి కించ పరచడానికి- సమాధానాలు అందులో వున్నాయని మాత్రం అనిపించింది. ఆ తరువాత చేతి కందిన పుస్తకాలు చదువుతూనే రాహుల్జీ రచనల్ని అబగా వెతికి చదివినవే చదవడం వ్యసనమైంది. ఇంచు మించు తెలుగులోకి అనువాదమైన ఆయన రచనలన్నీ చదివాక— గురజాడ నుంచి కొ. కు. శ్రీశ్రీ దాకా తెలుగు రచయితల రచనల్ని అర్థం చేసుకున్నాక- నా ముప్పయ్యో యేట "ఓల్గా సే గంగ" లోని అంతరార్థం నా కర్థమైంది.

(తరువాయి 53 వ

# నేర్చుకోవాలనుకునే వాళ్ళందరం రాహుల్‌జీని అధ్యయనం చేద్దాం

— ఛాయరాజ్

మానవుడు మహోన్నతుడు. పదార్థం యొక్క గుణాత్మక పరిణామం శ్రామికుడైన మానవుని మేధస్సు వద్ద అత్యున్నత శిఖరాల నందుకొని విశ్వాని కొక వెలలేని విహూత్న రూపాన్ని ఆవిష్కరించింది. నిర్విరామ పరిశ్రమలో మెదడు ఏ విధంగా వికసిస్తుందో, వికసించిన మేధస్సు ఎంత విలువైన కానుక లను ప్రజల కందిస్తుందో ఉదాహరించ దలచితే నేటికి ఈ గ్లోబంతటికీ ఒక్క "మార్క్సిజం" అని చెబితే చాలు. బహుముఖ ప్రజ్ఞా సంపత్తులు మార్క్సిజా విర్భావానికి దోహద పడి ఆ తరువాత మార్క్సిజం వెలుగులో మానవుని సర్వ విజ్ఞాన సంపత్తులూ మరింత పదునుదేరి ప్రపంచ మానవాళి పురోగమనానికి ఎంతో సహాయపడ్డాయి. మేధో సంపన్నులెందరో వున్నారు. అందులో రాహుల్‌జీ ఒక ప్రత్యేకత కలవారు. ఆయన తన మేధస్సును అత్యంత శక్తివంతంగా పరి శ్రమకు గురి చేసి, అమూల్యమైన అనుభవ పూర్వకమైన రచనలను భారతప్రజలకు అందజేశా . రాహుల్‌జీ ప్రతిభను అలౌకికమైనదనే అశాస్త్రీయ అభిప్రాయాన్ని ప్రకటించిన వాళ్ళున్నారు. రాహుల్‌జీ శ్రమైక జీవితం నుండి వికసించిన మేధస్సును లౌకికమైనదిగా గుర్తించగలిగే శక్తి గలవారు మాత్రమే ఆయన జీవితం నుండి రచనల నుండి నేర్చుకొని ఎదగ గలరు. మేధోపరమైన వైవిధ్యాల మధ్య నుండి పరిణాత్మకంగా ముందు కొచ్చిన రాహుల్‌జీ రచనల విస్ఫోటనం బహు ముఖంగా విస్తరించి భారత సాహిత్య రంగాన్ని సుసంపన్నం చేసిందనే వాస్తవాన్ని గుర్తించ లేకపోతే మరెన్ని విధాలుగా వర్ణించినా వ్యర్థమే. మార్క్సిజాన్ని అందు కొని కమ్యూనిస్టుగా కన్ను మూసిన రాహుల్‌జీ జీవితాన్ని ఈ దృష్టికోణం నుండి విశ్లేషించాలి.

**బాల్యం :**

తల్లి గర్భం నుండి బయట పడిన మానవుడు కళ్ళుతెరచి పరిసరాలను దర్శిస్తాడు. పెరుగుదల కవసరమైన అంతర్ కారకాలు సహజ సిద్ధంగా కలిగివుండి, బాహ్య కారకాలను తల్లి ద్వారా కుటుంబం నుండి శ్రమ లేకుండా పొందుతాడు. ఈ బాల్యదశలో ప్రకృతినీ, పరిసరాలను పరిశీలించి భ్రమ పొందుతాడే తప్ప పరిసరాలూ సమాజంలోని అంతస్సూత్రాలనూ పరస్పరాశ్రయ సంబంధ బాంధవ్యా లనూ అర్థం చేసుకోలేడు. అనుకరించడం, ఆలోచించడం, ఆవేశపడడం వంటివన్నీ

బాల్య దశకు ప్రాథమికమైన విషయాలయినప్పటికీ, వైవిధ్యాల వల్ల, పరిసర ప్రభావాల వల్ల అన్వేషణాసక్తి ప్రబలమై ముందుకు వస్తుంది. ఈ ఆసక్తిని అందిపుచ్చుకొనే వ్యక్తులూ వారి జీవితాలూ ప్రత్యేకమైనవిగా కనబడతాయి. వీరిని శాస్త్రీయ దృష్టితో చూసినప్పుడు సహజంగానూ, మాయ దృష్టితో చూసినపుడు అలౌకిక అద్భుతాలుగానూ కనబడతాయి.

రాహుల్‌జీ జీవితారంభ సమయాన్నీ, కుటుంబ పరిస్థితినీ, సంస్కృతినీ సామాజిక స్థితినీ గమనంలోనికి తీసుకోకపోతే ఆయన జీవితాన్ని శాస్త్రీయంగా అర్థం చేసుకోలేం. 1893 ఏప్రిల్ 9న జన్మించారు కేదారనాథ్ పాండే (రాహుల్‌జీ). తండ్రి దైవభక్తుడూ సామాన్య రైతూ అయిన గోవర్ధన పాండే బ్రాహ్మణుడు. ఉత్తరప్రదేశ్‌లోని అజంఘడ్ జిల్లాలోని పందహా గ్రామం రాహుల్ జన్మస్థానం. తల్లి కుల్వంతి. రాహుల్ చిన్న వయసులోనే తల్లి చనిపోతే అమ్మమ్మగారింట్లో పెరిగాడు. తన అయిదవ ఏట అక్షరాభ్యాసం చేసిన నాటికి, అంటే 1897లో ఉత్తర ప్రదేశ్‌లో తీవ్ర క్షామ పరిస్థితులు నెలకొని వున్నాయి. ఒకప్రక్క విదేశీ దాస్యం, మరోపక్క తీవ్ర క్షామం, మధ్య సాధారణ బ్రాహ్మణ రైతు కుటుంబంలోని రాహుల్ బాల్యం ఎలాంటి సంక్షోభానికి లోనైందో అర్థమవుతుంది. అందుకే రాహుల్‌జీ గ్రంథస్థం చేసిన మొదటి జ్ఞాపకాలు 1897 లోని తీవ్ర క్షామానికి సంబంధించినవి. ఉర్దూ అక్షరమాలతో అధ్యయనం ఆరంభమై క్రమంగా తన తొమ్మిదవ ఏట పినతండ్రితో కాశీ వెళ్ళినపుడు పెద్దలకు చెప్పకుండా డబ్బు తీసుకుపోయి బజారులో ఒక ఉర్దూ పుస్తకం కొనుక్కోవడం ద్వారా స్వతంత్రంగా ప్రపంచంలోనికి ప్రవేశించి చూడటానికి నాంది పలికారు. ఆ పుస్తకంలో—

"ఓ ప్రమత్తుడా! ప్రపంచ పర్యటన చెయ్యి. జీవితం అల్పమైనది. ఒక వేళ జీవితం వున్నా యవ్వనం వుండదు" అనే వాక్యాలు రాహుల్‌ను బాగా ఆకర్షించాయి. ప్రస్తుత పర్యటనకు ప్రోత్సహించాయి. ఉపయనయనం కోసం రాహుల్‌జీ తన పినతండ్రితో చేసిన వింధ్యాచల యాత్ర లోకసంచారానికి నాంది.

రాహుల్‌జీ చదువు పందహా గ్రామం నుంచి రాణి కి సరాయ్‌కి మారింది. ఉర్దూతో పాటు కొద్దిపాటి హిందీ, ఇంగ్లీషు నేర్చుకున్నారు. నాలుగోతరగతి చదూతున్నప్పుడే నెయ్యి పారబోసినందుకు తాత కోప్పడతాడనే భయంతో ఇంటినుంచి పారిపోయి, కలకత్తాచేరి కార్మికులతో కలిసి బాలకార్మికుడుగా మారి స్వతంత్ర జీవితానికి నాంది పలికారు. ఇక్కడే కార్మికవర్గం యొక్క లక్షణాలు బీజప్రాయంగానైనా అబ్బి వుంటాయి. తరవాత సాధువుల సాంగత్యంవల్ల సంస్కృతం చదివి ఆధ్యాత్మిక అధ్యయనం ప్రారంభించి అయోధ్య, ప్రయాగ, లాహోరులలో తిరిగారు. ఈలోపు తండ్రి కొడుకును వెదుక్కుంటూ రావడం, ఇంటికి తీసుకువెళ్ళడం, బాల్యంలోనే

వివాహం చెయ్యడం జరిగింది. కానీ, ఈ వివాహాన్ని అంగీకరించక తండ్రి చని పోయిం తర్వాత సర్వ స్వతంత్రుడై దామోదర్ సాధు అని పేరు మార్చుకొని సాధువులలో కలిసిపోయాడు రాహుల్ జీ.

రాహుల్ జీ కుటుంబం ఫ్యూడల్ భావజాలం గలది. పసితనంలోనే తల్లి మరణించింది. ఆర్ష ధర్మ బద్ధురాలయిన అమ్మమ్మ పెంపకం, క్షామ పరిస్థితులు, విదేశీ దాస్యం, బాల్యవివాహం, వేద విద్యతప్ప మరో విషయ ప్రస్తావన లేని విద్యా విధానంలో ప్రారంభ అధ్యయనం, సాధువుల సాంగత్యం, ఆధ్యాత్మిక పరిసరాలు, ఇవన్నీ బాల్యావస్థను పీడిస్తాయే తప్ప ఆరోగ్యకరమైన పెరుగుదలకు తోడ్పడవు. ఈ పరిస్థితులన్నీ వెనుక చూపు నిస్తాయే తప్ప ముందుచూపు, అభివృద్ధికి దోహదం చెయ్యవు. ఈ వాతావరణానికి లొంగి సర్దుకుపోవడం ఆదిమ మానవుని ప్రాథమిక లక్షణం. ఫ్యూడల్ సంస్కృతి. భావ జాలం కూడా నాగరికుడైన మానవుని ఆలో చించనియ్యక సర్దుకుపోయే తత్వాన్ని పెంచి పోషిస్తుంది. సంఘర్షించి, తన మను గడకు అటంకంగా వున్న పరిస్థితులను మార్చ గలిగే అవగాహననూ, శక్తి సామర్థ్యా లను యిచ్చే పరిసరాలు కరువైనప్పుడు మానవునిలో కలిగే వైవిధ్య పూరితమైన ప్రవర్తనలలో ఒకదాని వెంటగాని, మరెన్నో ప్రవర్తనలతోగాని జీవితం వెళ్ళ బుచ్చడం జరుగుతుంది. రాహుల్ జీ బాల్యం సంఘర్షణ పూరితం. అన్వేషణాగుణం అభివృద్ధి చెంది తదనుగుణమైన ప్రవర్తనలకు ఆలవాలమైనారు రాహుల్. ఫ్యూడల్ గ్రంథాల అధ్యయనం వల్ల జీవిత సమస్యల పరిష్కార మార్గం అవగతంకాలేదు. తర్వాత ఏం చెయ్యాలి ? సహజంగా ప్రకృతి పరిశీలన వైపు ఆ తర్వాత సామాజిక పరిస్థితుల పరిశీలన వైపు, ఆ తర్వాత ప్రపంచ పర్యటనలవైపు రాహుల్ మనసు మళ్ళింది.

**ప్రకృతి పరిశీలన :**

ప్రకృతిని చూచి పులకించిపోని వారెవరూ వుండరు. పుట్టుకతో మానసిక వైకల్యం కలవారు, లేదా సామాజిక దుర్మార్గ సంస్కృతి వల్ల మానసికంగా దెబ్బతిన్నవాళ్ళు ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించలేరు. బాల్యానికి ప్రకృతి తల్లి ఒడి యంత అవసరమైనది. తల్లి లాలన పొందలేని బాలలకు అనుకూల వతయిన మాత ప్రకృతి. ప్రకృతిని పోల్చుకోగల సత్తా బాల్యానికున్నంత మరే దశకూ వుండదు. ప్రకృతిని చూడగలిగి, దాని వడిలోనికి చేరగలిగినవాడు పొందే అనుభూతి వర్ణింప శక్యం గానిది. ఇక్కడే హృదయ సౌందర్యం అభివృద్ధి అవుతుంది. సహజ సౌందర్యాభిరుచి అభివృద్ధి జరుగుతుంది. సౌందర్యాభి రుచిగలవారు ప్రేమమయులవుతారు. తోటి మానవుడిని ప్రేమతో చూడ గలిగి, మానవ విలువలను అభివృద్ధి చేయగలుగుతాడు. విశ్వమానవ ప్రేమ అంటే

ఏమిటో తెలిసి, సహజ విలువలకు శత్రువెవరో సుళువుగా గుర్తించ గలుగుతారు. శత్రువుని ద్వేషించగలిగి మిత్రుడిని ప్రేమించ గలుగుతారు. రాహుల్ చిన్న తనంలోనే తల్లి చనిపోయింది. తొమ్మిదవ ఏట వింధ్యాచలాన్ని దర్శించడం జరిగింది. వేదాంత విద్యకోసం, సంస్కృతం అధ్యయనం కోసం హరిద్వారం, రుషీకేశం, దేవప్రయాగ, బదరీ కేదారం, గంగోత్రి, జమనోత్రి మొదలైన ప్రదేశాలను చూశారు. తన పదిహేనవ ఏట హిమాలయ పర్వతాల్లో పర్యటన ఆయన మనసుపై గాఢమైన ముద్ర వేసింది.

"మంచు నాకు చాలా అందంగా కనిపిస్తుంది, కనుచూపు మేర వరకు మంచు కనబడడం, మధ్యలో అక్కడక్కడ ఏవో ఉండడం నాకు చాలా బాగుంటుంది. దేవదారు వృక్షాలు నాకు అందంగా కనబడతాయి" అని అంటారు రాహుల్‌జీ.

హిమాలయాలను దాటి దుర్గమాలైన ప్రాంతాలకు ప్రయాణం చేయాలని ఆయన హృదయం తహతహ లాడింది. పర్యవసానంగా 1926లో టిబెట్ సరి హద్దుల్లో దేశదిమ్మర్లు మాత్రమే చేయగలిగిన దుస్సాధ్యమైన ప్రయాణాన్ని మొదలు పెట్టారు. తనతో ప్రయాణం చేసిన సేంగ్-టుక్ అనే కుక్క మరణానికి చలించి పోయారు.

"నాకు అత్యంత ప్రీతి పాత్రులైన నా తాతతండ్రులు మరణించినపుడు కూడా అశ్రువులు రాల్చని నా కళ్ళు, చిన్నారి కుక్కపిల్ల మరణించినపుడు, అపుకో లేని అశ్రువులతో నిండిపోయాయి. ఈ శునకం మరణంపై స్మృతి గీతాలుగా సంస్కృతంలో ఎనిమిది శ్లోకాలు రచించాను. ప్రతి శ్లోకం 'సేంగ్-టుకె త్వత్ ప్రయాణే' అని ముగుస్తుంది" అని రాసుకున్నారు రాహుల్‌జీ 1929, 1934, 1936, 1938 లలో రాహుల్ టిబెట్ నాలుగుసార్లు దర్శించారు. అప్పుడే హిమాలయాల లోని బంగారు శిఖరాన్ని దర్శించి అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందారు.

హిమాలయాల ఆకర్షణ జీవితాంతం అంటిపెట్టుకునే వుంది. ప్రశాంతంగా గ్రంథ రచన సాగించాలను కొన్నపుడు రాహుల్‌జీ హిమాలయ ప్రాంతాలకు వెళ్ళి పోయేవారు. తన గ్రంథాల్లో సాధ్యమైనంత వరకు హిమాలయాల సౌందర్యాన్ని వర్ణించారు. ప్రత్యేకంగా "డార్జిలింగ్ పరిచయ్", "కుమా యూ" అనే గ్రంథాల్ని రచించారు. హిమాలయాల్ని సాధారణ ప్రజలకు పరిచయం చేశారు. హిమాలయ పాద భూమిని పరిచయం చేసే రాహుల్‌జీ గ్రంథం "కిన్నెర దేశ్".

---

"చరిత్ర మారుతూ సామ్యవాద ప్రాంగణంలోకి ఎలా అడుగు పెట్టవలసి వచ్చిందో కథా రూపంలో తెలుసుకోవాలనుకున్నప్పుడు 'వోల్గా సే గంగా' చదివితే చాలు."

—రాహుల్జీ

ప్రకృతి సౌందర్యారాధకుడైనందున రాహుల్ మానసిక సౌందర్యం ఇనుమడించింది. శారీరక మానసిక ఆరోగ్యం పొందినందున సహజానుభూతితో అత్యంత సహజమైన, సౌందర్యవంతమైన, ప్రయోజనకరమైన రచనలు చేయ గలిగారు. రచయితకు ప్రాణమై కావలసిన భూమికను ప్రకృతి సమకూర్చింది. ప్రపంచాన్ని భౌతికంగా విశ్లేషించే జ్ఞానాన్ని పొందారు రాహుల్. అందుకే రాహుల్‌జీ నుండి అమూల్యమైన రచనలు మనం పొందాం.

ప్రకృతి పరిశీలన ద్వారా సహజంగా పొందాల్సివున్న సౌందర్యాభిరుచిని పొందలేకపోతే రచయిత విలువైన రచనలు చేయలేరనే సత్యాన్ని రాహుల్‌జీ రచనల నుండి నేర్చుకోవాలి. పదార్థం యొక్క ప్రాముఖ్యాన్ని ప్రకృతి అనుశీలనం నుండి మాత్రమే గ్రహించగలుగుతాం. ఈ ప్రాథమిక జ్ఞానాన్ని పొందలేనినాడు అధిభౌతిక తత్వానికే పైచేయి అయిపోయి గతి తార్కిక దృష్టి కొరవడుతుంది.

**పర్యటనలు :**

విజ్ఞాన సముపార్జనకు పర్యటన ఎంతో బలంగా తోడ్పడుతుంది. ప్రజల చారిత్రిక, సాంస్కృతిక పరిణామాన్నీ, సమాజ గతియొక్క అంతస్సూత్రాల్ని అర్థం చేసుకోవాలంటే అనేక ప్రాంతాలనూ, చారిత్రిక ప్రదేశాలను చూడాలి. విభిన్న జాతులుగా వున్న ప్రజల మధ్య జీవించాలి. రచనలు సజీవంగా వుండాలంటే రచయిత పర్యాటకుడై వుండాలనే సత్యాన్ని రాహుల్‌జీ ద్వారా తెలుసుకోవచ్చును.

రాహుల్ తన తొమ్మిదవ ఏట స్వతంత్రించి కాశీలో ఉర్దూ పుస్తకాన్ని కొని చదివారు. "ఓ ప్రమాత్తురా! ప్రపంచ పర్యటన చెయ్యి. జీవితం అల్పమైనది. ఒక వేళ జీవితం వున్నా యవ్వనం వుండ"దనే వాక్యం వద్ద ఆగి ఆలోచించి, ఆ క్షణం నుండి పర్యటన ప్రారంభించి జీవితాంతం కొనసాగించారు.

విశాల ప్రపంచాన్ని చూడాలని, విజ్ఞానాన్ని సముపార్జించాలని ఆకాంక్షించి, దారి తోచని స్థితిలో 19ı0లో రాహుల్ సాధువులతో సాంగత్యం చేసి సంచార భిక్షువుగా మారారు. అప్పటికే అప్పటి సమాజం పట్ల నిరసన ఏర్పడింది. సాధువుల సాంగత్యం ఆయన్ని సనాతన ఆచారాలపైన, అంధ విశ్వాసాలపైన తిరుగుబాటును ప్రోత్సహించింది. భౌతికవాదిగా మారడానికి ఈ పరిస్థితి ఒకటి తోడ్పడింది. భిక్షుడిగా హిమాలయ ప్రాంతాలు పర్యటించారు. 1913లో హాజీపూర్, అసన్‌సోల్, ఆద్రా, ఖరగ్‌పూర్ గుండా పూరి, అక్కడనుండి మద్రాసు, తిరుపతి, కాంచీపురం, రామేశ్వరం, రామ్నాడ్, బెంగుళూరు, నాసిక్, త్రియంబకం, కపిలధార, ఉజ్జయిని, చేరి కుంభమేళాలో సాధువుల పేచీలను వివరించారు. 1920లో కార్వి నుంచి బయలు దేరి వారణాసి చేరి అక్కడ అస్వస్థులై, కోలుకున్న తరువాత మొదటిసారిగా సారనాథ్ దర్శించారు. అక్కడ నుండి బౌద్ధ క్షేత్రాలన్నీ దర్శించారు. 192ıలో నేపాల్

పర్యటించారు. తరువాత ఆయన కాశ్మీరు, కార్గిల్ ద్వారా లడక్ వెళ్ళి అక్కడ నుండి 18,000 అడుగుల ఎత్తున వున్న ఫార్ డొంగ్-లాకి వెళ్ళారు. మాన్‌పాంగ్-గాంగ్ సరస్సు మహామూర్తి-కినార్ మార్గం ద్వారా ఆయన సిమ్లాకి తిరిగి వచ్చారు. టిబెట్టు సరిహద్దుల్లో దేశ దిమ్మర్లు మాత్రమే చేయగలిగిన దుస్సాధ్యమైన ప్రయాణాన్ని రాహుల్ 1926లో మొదలుపెట్టి, మళ్ళీ 1929 నుండి నాలుగు సంవత్సరాలలో టిబెట్టును నాలుగుసార్లు దర్శించారు. 1927లో శ్రీలంక, 1935లో సింగపూర్ జపాన్, కొరియా, 1936లో ఇరాన్, 1937-38 మధ్య కాలంలో సోవియట్ అకాడమీ ఆహ్వానంపై సోవియట్ రష్యాలోని మాస్కో, లెనిన్‌గ్రాడ్ పర్యటించి అక్కడ కొన్నాళ్ళు వున్నారు. 1945లో లెనిన్‌గ్రాడ్‌లో ఆచార్య పదవి చేపట్టారు. ఆ తరువాత 1958లో చైనాలో నాలుగు నెలలు పర్యటించారు. తన యూరప్ పర్యటనలో కొంత అసంతృప్తికి గురై అమెరికా పర్యటన కోసం వచ్చిన ఆహ్వానాన్ని తిరస్కరించారు. 1962-63లో సోవియట్ రష్యాలో ఏడు మాసాలు చికిత్స పొందారు. ఇవన్నీ రాహుల్‌జీ పర్యటనలలో ముఖ్య ఘట్టాలు మాత్రమే. భారత దేశంలో నలుమూలలా పర్యటించారు.

నిరంతర ప్రయాణంలో రాహుల్‌జీకి విజ్ఞాన సముపార్జన, గ్రంథ రచన రెండూ దొరుసుగా వున్నాయి. "నా దృష్టిలో ప్రపంచంలో అతి విలువైనది ట్రావెల్" అంటారు ఆయన. రాహుల్ పర్యటనలు సాహసోపేతమైనవి, చారిత్రాత్మకమయినవి. 'తిబ్బత్ మే సవా వర్ష్', 'మేరీ యూరప్ యాత్ర', 'జపాన్' అనే గ్రంథాలలోనూ- 'ఘుమక్కడ్ శాస్త్రి' (పర్యటన శాస్త్రం) లోనూ 'మేరీ జీవన్ యాత్రా' అనే తన ఆత్మకథను తెలిపే గ్రంథంలోనూ రాహుల్ పర్యటనా విషయాలు విపులీకరించబడ్డాయి భారతదేశంలో పర్యటనపై శాస్త్రగ్రంథం మొట్టమొదట రాహుల్‌జీయే ప్రకటించారు.

సమాజానికి హితకరమైన విషయం చెప్పడమే శాస్త్రాల లక్ష్యం అంటూ డార్విన్ సంచార వ్రతం స్వీకరించకపోతే అన్ని గొప్ప విషయాలు ఆవిష్కరించగల్గేవాడా అంటూ "పర్యాటకులు తల్లి కన్నీరు, తండ్రి భయం లెక్కచెయ్యరు. భార్యా భర్తలు ఒకరికొకరు సంకెళ్ళు కారాదు" అని చెబుతారు రాహుల్‌జీ.

"నా గ్రంథం (పర్యటన శాస్త్రం) చదివి కోటి మంది తల్లులు తమ బిడ్డలకు దూరం కావచ్చు. ఆ పాపం నాకు చుట్టుకోవచ్చు. అదంతా నేను నా నెత్తిన వేసుకుంటాను. అవసరమైతే ఏసు ప్రభువులా శిలువ నెక్కుతాను. పర్యటించాలంటే ముందు తలిదండ్రుల బంధనాలు తెంచుకోవాలి" అని రాహుల్ అన్నారు.

"స్త్రీలూ సంచారం చెయ్యాలి. పురుషుడే కాదు ప్రకృతి కూడా స్త్రీకి వ్యతిరేకంగా వుంది. ప్రకృతి పురుషుని కంటే స్త్రీని ఎక్కువగా బాధిస్తోంది. అయినా స్త్రీలు

సంచారం చెయ్యాలి, అంటూ "సంచారకులు డైరీ రాయడం మరవకూడదు. డైరీలు భద్రపరచుకోవాలి. ఏ వ్యక్తికో వప్పగించడం కంటే ఏదో ఒక సంస్థకు వప్పగించడం మంచిది" అంటారు రాహుల్‌జీ.

ప్రతిభను నాశనం చేసుకోవడం కంటే మరణించడం మేలంటారు. ప్రతిభ పర్యటనలు వల్లే సునిశితమవుతుందని రాహుల్‌జీ భావించారు. రాహుల్‌జీ పర్యటన మొత్తం భాష, ప్రాంత, సాంస్కృతిక, శాస్త్ర, రాజకీయాంశాల సమాహారం. అవి రాహుల్‌జీని బహుముఖంగా రాజేసింది.

అన్వేషణాసక్తితో పర్యటనలు చేసిన రాహుల్ తన పరిశీలనలను రాసుకొని, ప్రపంచ సమాజాల తీరును తన పరిశీలనల వెలుగులో విశ్లేషించుకొని, కొన్ని అభిప్రాయాలకు వచ్చి తన జీవిత మార్గాన్ని నిర్దేశించుకొని నిగ్గుతేలడం కోసం జీవితాన్ని పరీక్షకు పెట్టారు. చివరకు మార్క్సిజమొక్కటే మానవాళికి మహా తేజస్సు నివ్వగలదని తెలిసి, బరువెక్కిన తన మెదడునూ శరీరాన్నీ భారత సాహిత్య రంగానికి అంకితం చేశారు రాహుల్‌జీ.

ఇంటి నుండి డ్యూటీకి, డ్యూటీ నుండీ యింటికి పోయి, కలలు కనడం మరచిపోయి, పెళ్లాం బిడ్డల బతుకుల మీద తల బాదేసుకొని బాధపడిపోయి, ఈ బాధే ప్రపంచ బాధగా యెంచిన మానవుడూ మేధావీ ఈ సమాజానికి ఏమివ్వగలడు? గదిలో మేధావులకు గతి సూత్రాలు ఎలా అర్థమవుతాయి? ఊహించి రాస్తే ఊకే గదా ? పర్యటనల మాటటుంచి, కనీస అధ్యయనం లేకుండా, కరపత్రమైనా చదివే ఓపిక లేని కవులు, రచయితలు, విమర్శకులూ చెత్త రాతలు రాస్తున్నవారూ రాహుల్‌జీని చదివి నేర్చుకొంటారా? ఈనాడు రాహుల్‌జీని యువ కవులు, కళాకారులు, రచయితలు అధ్యయనం చేయకపోతే సాహిత్య భవిష్యత్తు ఏమవుతుంది? సాహిత్య రంగంలో శ్రమ పడడం నేర్చుకోకపోతే, సాహిత్య యంత్రాంగాలేవో తెలుసుకొకపోతే కాగితం మీద కలం మోపే దమ్ము ఎలా వస్తుంది ?

## అధ్యయనం

నేర్చుకోవాలనే ఆసక్తి, అందులోనూ ప్రజల మధ్య జీవించి ప్రజల నుండి నేర్చుకొనే ఆసక్తి ఎంత మందికుంటుంది? రాహుల్‌జీలా ప్రపంచాన్ని పర్యటించి వివిధ జాతులకు చెందిన ప్రజల మధ్య జీవించి, వారి సాంస్కృతిక విలువలను జీర్ణింపజేసుకొని, అనేక సాహిత్య ప్రక్రియల ద్వారా ప్రజలకు తెలియజెప్పే శక్తి ఎందరికుంటుంది? ఎంత మందీ మార్గాన్ని తెలిసి రచనలు చేస్తున్నారు? విజ్ఞాన శాస్త్ర మూల సూత్రాలు కూడా ఎరగని ఒక మేధావి సైన్సు అనుమానాస్పదమని

---

"యువత కోసమే నేను కలం పట్టాను. వారి మీద నాకెంతో ఆశ వుంది. ఈ సమాజాన్ని మార్చగల దిట్టలు వాళ్లే" — రాహుల్జీ

చెప్ప సాహసిస్తారు. వాస్తవ నిజం గురించి తెలుసుకోకుండానే శీఘ్రంగా తమ గ్రహాన్ని సందేహిస్తారు. ఇక్కడొక కొటేషన్, అక్కడొక మాట ఏర్చి కూర్చి ఎంతో అధ్యయనం చేసిన వాడిలా బోజు పెట్టి రచనలు చేసే వారెందరో వున్నారు. వీరందరూ "అధ్యయనం" గురించి రాహుల్‌జీ నుండి నేర్చుకోవలసిందే.

అధ్యయనానికి ప్రాథమికావసరం భాషా జ్ఞానం. రాహుల్ సంస్కృతం, హిందీ, పాళీ, టిబెటెన్, భోజ్‌పురి అనే అయిదు భాషలను క్షుణ్ణంగా నేర్చుకున్నారు తన రచనలలో అత్యధికం ఈ భాషలలోనే రాశారు. మరో 30 భాషలను స్వయం కృషితో నేర్చుకున్నారు. భోజ్‌పురి, మాలి ఉచ్చారణలను, యితర భాషా మాండలికాలను అధ్యయనం చేయడమే గాక వాటి అభివృద్ధికి పద్ధతులను కూడా సూచించారు ప్రధాన భాషా గ్రూపులలోని ముఖ్య భాషను అధ్యయనం చేస్తే మిగిలిన ఆ గ్రూపు భాషలను నేర్చుకోవడం ఎంత సులువో ప్రాక్టీసు ద్వారా రుజువు చేశారు. గ్రంధాల ద్వారా కంటే ప్రజల మధ్య జీవించడం ద్వారా భాషను ఎంత సులువుగా, తొందరగా నేర్చుకోవచ్చునో రాహుల్‌జీ తెలియజెప్పారు. అధ్యయనా సక్తి వుంటే విజ్ఞాన సముపార్జనకు భాష అడ్డగోడ కాదు.

అధ్యయనం బహుముఖంగా సాగాలి. రాహుల్ 1910లో సంస్కృతంలో "లఘుల కౌముది" చదివారు. కాశీలో సంస్కృత గ్రంథాలకి, ప్రాచీన కావ్యాలకి, వ్యాకరణాలకి, ఆయుర్వేదానికి, జ్యోతిష శాస్త్రానికి సంబంధించిన అనేక గ్రంధాలని అధ్యయనం చేశారు.

అధ్యయనం ద్వారా సారాన్ని గ్రహించి ప్రభావితుడు కావాలి. రాహుల్‌కి తన 19వ ఏట పండిత రామావతార్ శర్మ ఉపన్యాసం విని హేతువాదంపై ఆసక్తి కలిగింది. అన్వేషణ ప్రారంభించారు. "సరస్వతి" అనే హిందీ పత్రికని, DAWN అనే ఇంగ్లీషు పత్రికను చదవడం ఆరంభించారు.

పుస్తకాలు కొనకుండా అధ్యయనం ఎలా సాధ్యం? రాహుల్‌జీకి అనేక గ్రంథాలను కొని చదువుకొనే అలవాటు వుండేది. ఇందుకు మిత్రుల నుండి అభిమానుల నుండి ధన రూపంలోనూ, పుస్తక రూపంలోనూ సహాయాన్ని పొందేవారు.

ఏ పుస్తకాన్ని చదువుతున్నా అందులో తనకు నచ్చిన విషయాలను రాసుకొని, తన అభిప్రాయాలను నోట్ చేసుకొనేవారు.

అధ్యయనం చేసి నేర్చుకొన్న విషయాలను నిగ్గు తేల్చుకొనేందుకు చర్చకు పెట్టేవారు. ఉపన్యాసాలకి, చర్చలకు వేదికలయిన సంఘాలను స్థాపించేవారు.

అధ్యయనానికీ, అభిప్రాయాల వ్యక్తీకరణకు, ప్రజలను విజ్ఞానవంతులను చేయడానికి సంఘం వుండాలి. సంఘంలో సభ్యుడిగా వుండాలని తెలుసుకొన్న రాహుల్ అనేక వేదికలను ఏర్పాటు చేసి వాటి ద్వారా మూఢ విశ్వాసాలను ఖండించే

వారు. బాంధవులైన మఠాధిపతులు ఆయుస్సు కొట్టించడం (రాళ్ళతో) జరిగేది. "నాస్తిక శిరోమణి" అనే బిరుదు పొందారు.

అధ్యయనానికి విద్యాలయాలు ఎంతో తోడ్పడతాయి. 1915లో ఆగ్రా ఆర్య ముసాఫిర్ విద్యాలయంలో ప్రవేశించి రెండు సంవత్సరాలు పాటు సంస్కృతం, అరబ్బీ, అనేక మతాలకు చెందిన సిద్ధాంతాలని, దేశ చరిత్రలని అధ్యయనం చేశారు. ఫలితంగా ఆయనలో సామాజిక జీవన విధానంపైన ఒక సంచలనం చైతన్యం కలిగాయి. వార్తా పత్రికలలో వ్యాసాలు రాయసాగారు.

అధ్యయనం చెడును తీవ్రంగా వ్యతిరేకించేటట్లు చేస్తుంది. మత గ్రంథాల అధ్యయనం వల్ల రాహుల్‌జీ నాస్తికుడయ్యారు.

రచయిత అధ్యయనం ద్వారా మంచి సాహిత్యోపన్యాసకుడవుతాడు. 1916లో రాయ్ బరేలీలో హిందీ భాషా సాహిత్యంపై అశువుగా ఉపన్యసించారు. ఆ తరువాత ఎన్నో సాహిత్య సభలలో మంచి సాహిత్య ఉపన్యాసకుడుగా పేరొందారు.

గ్రంథ అధ్యయనం అనేది అనేక మంది మేధావులతో ఉత్తర ప్రత్యుత్తరాలు రాసే అలవాటును ప్రేరేపిస్తుంది. రాహుల్‌జీ ఉత్తరాలు ద్వారా అనేక విషయాలు సేకరించారు. తను అనేక విషయాలను యితరులకు అందించారు. రాహుల్‌జీ తన అధ్యయనానికి ప్రజలను, గ్రంథాలను, వార్తా పత్రికలను, శిలాశాసనాలను వాడుకొన్నారు.

1927--8 లలో 19 నెలల పాటు ఏకధాటిగా రాహుల్‌జీ బౌద్ధమత గ్రంథాలను అధ్యయనం చేసి, భారతీయ సంస్కృతికి సంబంధించిన చరిత్ర గురించి విస్తారమైన సమాచారాన్ని సేకరించారు. బ్రహ్మి లిపిని నేర్చుకొని "ఎపిగ్రాఫికా ఇండికా" లోని ప్రాచీన కాలపు అంకెలను పరిశీలించారు. లండన్ 'రాయల్ ఏసియాటిక్ సొసైటీ' వారి ప్రచురణలను సంపాదించి ఆసక్తిగా చదివేవారు.

బక్సర్ జైలులో వుండగా (1922) రహస్యంగా ట్రాట్క్సి రచించిన "బొల్షి విజం- ప్రపంచ విప్లవం" అనే గ్రంథాన్ని చదివారు మార్క్స్, ఎంగెల్స్ ప్యూయర్ బాహ్, షెర్‌బాట్స్కీల రచనలను అధ్యయనం చేశారు. సేన్‌గుప్తా, రాధాకృష్ణన్, విద్యా భూషణ్‌ల రచనలు చదివారు. ఇలా రాహుల్ అధ్యయనం గురించి చెప్పుకు పోవడం సాధ్యం కాదు. అపరిమితమైనది ఆయన అధ్యయనం.

రాహుల్‌జీ అధ్యయనంతో పాటు రచనలు చేశారు. రచనలతో పాటు బోధనలు చేశారు. బోధనలు చేయడమే గాదు, ఆచరణలోనికి వెళ్ళారు. ఎన్నో యిబ్బందులను, కష్టాలను ఎదుర్కొన్నారు.

'ఎక్కువగా అధ్యయనం చేస్తే మారవలసి వస్తుంది. మారితే పోరాడవలసి వస్తుంది. అందుకు ప్రతిగా కష్టాలు ఎందుకొచ్చిందీ వ్యవహారం' అనేది మధ్య

తరగతి మేధావుల వాదన. వీళ్ళు నిష్ప్రయోజకులు. ఎన్ని చదివినా తనకు తెలిసిందే ఎక్కువని భావించే మేధావులున్నారు. వీళ్ళు స్వప్రయోజకులు. వీళ్ళెవరూ రాహుల్ జీని అధ్యయనం చేయడానికి ఉద్యుక్తులుకారు. మరెవరు రాహుల్ జీ నుండి నేర్చుకొనేవారు? వాళ్ళు ఈ సమాజాన్ని మార్చడానికి దోహదపడే రచనలు చేయగోరే సాహిత్యోద్యమ కార్యకర్తలు.

రాహుల్ జీ అధ్యయనం అయన దృక్పథాన్ని క్రమంగా మార్పులకు గురిచేసి సోషలిస్టు సమాజ ఆవిర్భవాన్ని ఆశించే వ్యక్తిగా చేసింది. రాహుల్ జీ అధ్యయనం భారత ప్రజలకు తమ సాంస్కృతిక విలువలను పెంచుకొనేందుకు సహకరించే సాహిత్యాన్నీ సేవలను అందించింది

**రాజకీయం :**

విజ్ఞాన సముపార్జన లక్ష్యంతో సాగిన అధ్యయనం అక్కడితో ఆగిపోదు. నూత్న భావాలు పొంది వాటిని రుజువుకు పెట్టాలనే జిజ్ఞాస పెరుగుతుంది. రాహుల్ జీ అధ్యయనం బహు ముఖంగా సాగింది. ఈ కాలంలోనే దేశంలో రాజకీయ ఉద్యమాలు ముమ్మర మయ్యాయి. ఆర్య సమాజపు స్వతంత్ర భావాల ఆకర్షణ, భౌతివాదం వైపు మొగ్గుతో బాటు రాజకీయాలపై ఆసక్తి పెరిగింది. 1917 రష్యా విప్లవం గురించి వార్తా పత్రికల ద్వారా తెలుసుకొన్నారు. ఆదర్శవంతమైన కమ్యూనిస్టు సమాజం గురించి ఆయన కలలు కన్నారు. 1919 ఏప్రిల్-మే మధ్య కాలంలో లాహోరులో మిలటరీ పాలన రుచి చూడడం ఆయనికి రాజకీయాలతో కలిగిన మొదటి ప్రత్యక్షానుభవం. 1922లో సంస్కృత శ్లోకాలలో కమ్యూనిస్టు వ్యవస్థ కోసం కన్న కలల రచన చిత్తు ప్రతిని తయారు చేశారు. 1923, 1924లో హజారీబాగ్ జైలులో "బాయీసవీసదీ" (ఇరవై రెండో శతాబ్దం) అనే గ్రంథాన్ని రచించారు. 1921-27 మధ్య కాలాన్ని తన "రాజకీయ రంగ ప్రవేశం" అని అభివర్ణించారు. 1921లో సహాయ నిరాకరణోద్యమంపై ఛాండ్ వాలో మొదటి రాజకీయ ఉపన్యాసం చేశారు. 1922లో బక్సర్ జైలులో 'బోల్షివిజం' అంటే ఏమిటో మొదటిసారిగా తెలుసుకొన్నారు. గాంధీజీని 'ధనిక స్వామ్యం వాదుల తొత్తు' అని తమ "వైజ్ఞానిక భౌతికవాద్" గ్రంథంలో విమర్శించారు. 1922 అక్టోబరు 29న జిల్లా కాంగ్రెసు

---

నా రచనలు చదివిన రచయితలు, పాఠకులు వాటిని మరిపించగల స్థాయిలో రచనలు సాగించాలని కోరుకుంటున్నాను. భావి తరాలవారు శాస్త్రీయ విమర్శనా కుశలురైతే నాకు తృప్తి. అంతేగాని నా రచనలు శాశ్వతంగా నిలిచిపోవాలన్న దురాశ నాకు లేదు. సమాజం మారుతూ వుంది. ఆ మార్పు ప్రభావం మానవుని మేధస్సుపై ప్రసరిస్తూనే వుంటుంది."  —రాహుల్జీ

కార్యదర్శి పదవి పొందారు. 1920లో గౌహతి కాంగ్రెసు సమావేశానికి హాజరైనారు. క్రమంగా రాహుల్‌జీ కమ్యూనిజం వైపు మొగ్గు చూపించ సాగారు. 1935లో మొదటిసారిగా సోవియట్‌లో పర్యటించారు.

రాహుల్‌జీ 1939 అక్టోబరులో మోన్‌మీర్‌లో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం పొందారు. బొంబాయిలో హిందీ సాహిత్య సమ్మేళనంలో ఆయన చేసిన అధ్యక్షోపన్యాసాన్ని నిరసిస్తూ భారత కమ్యూనిస్టు పార్టీ 1944లో రాహుల్‌జీ పార్టీ సభ్యత్వాన్ని రద్దు చేసింది. ఆ సందర్భంగా ఆయన యిలా అన్నారు—

"నేను పార్టీని విడిచి పెట్టినట్లు పత్రికల్లో వార్త పడింది నేను పార్టీ విడిచి పెట్టినందుకు చాలా మంది బాధ పడ్డారు. నా మటుకు నేను అదే విధంగా బాధ పడ్డాను. పార్టీ నుండి ఈనాడు నేను విడిపోయినా, నేను పార్టీకి తప్ప యింకెవరికీ అందజాలను. రాహుల్‌జీ పార్టీని విడిచి పెట్టినట్లు వెలువడిన వార్త నిజం కాదనీ యిదంతా కేవలం నాటకమనీ కొన్ని పత్రికల్లో పడింది. దాన్ని చూసి నా హృదయం ఆనందించింది. అదే నిజం కావాలని నా వాంఛ. ఎందుకంటే నా లక్ష్యాలను పార్టీ వెలుపల వుండి సాధించజాలను."

కానీ రాహుల్‌జీ తాను పార్టీ సభ్యుడిగా వుండక పోవడాన్ని సహించలేక 1955లో ఢిల్లీలోని పార్టీ కేంద్ర కమిటీ ఆఫీసు కెళ్ళి ప్రధాన కార్యదర్శి అజయ్ ఘోష్‌ను కలిసి తనను పార్టీలోనికి తిరిగి తీసుకోమని అర్థించారు. పార్టీ సభ్యత్వం పునరుద్ధరింప బడింది.

"ఆ రోజున నా ఆనందానికి మేర లేకపోయింది. పార్టీ సభ్యత్వం లేకుండానే చివరికి చనిపోతానేమోననే మనోవేదనతో బాధపడుతూ వుండేవాడిని. ఇప్పుడింక జీవితాంతం వరకూ పార్టీ సభ్యుడనే. నా జీవిత లక్ష్యం పూర్తయ్యింది" అన్నారు రాహుల్‌జీ.

1937, 44, 62 లలో సోవియట్ పర్యటించారు. 1939లో బీహారు రైతు పోరాటంలో పాల్గొన్నారు. 1940లో మోతిహారి కిసాన్ సమ్మేళనకు అధ్యక్షత వహించారు. 1940-42 కాలమంతా అనేకసార్లు జైలు కెళ్ళారు. 1942-44లో భారత దేశం నలుమూలలా రాజకీయ కార్యక్రమాల కోసం పర్యటించారు. 1958లో చైనాలో నాలుగున్నర మాసాలు పర్యటించారు.

ఒకనాడు కాంగ్రెసు కార్యకర్తగా ఇంగ్లీషు వారి జైళ్ళలో వున్నారు. 1938, 39 లలో రైతు కార్యకర్తగా కమ్యూనిస్టుగా కాంగ్రెసు పాలనలో జైలుశిక్ష అనుభవించారు. కాంగ్రెసు మంత్రులు ఇంగ్లీషు వాడికి ఏ మాత్రం తీసిపోని విధంగా రైతు ఉద్యమాల పట్ల క్రూరంగా వ్యవహరించడాన్ని, అణచివేత విధానాన్ని నిశితంగా విమర్శించారు. స్వాతంత్ర్యం వస్తే రైతులూ పేద ప్రజలూ ఏ గతిలోనికి నెట్టబడ

తారో గ్రహించారు. కాంగ్రెసు స్వభావాన్ని బట్టబయలు చేశారు. "సామ్యవాద్ హీ క్యోం?", (సామ్యవాదమే ఎందుకు ?) "దిమాగీ గులామీ" (భావదాస్యం ) మొదలైన రాజకీయ గ్రంథాలను ఆ రోజుల్లోనే రాశారు.

రాహుల్ జీ రాజకీయ జీవితం ఏం చెబుతోంది? భావాల పరిణతి మానవుడిని సమాజ శ్రేయోభిలాషిగా మార్చి వేస్తుంది. కష్టాలను లెక్కచేయని కార్యాచరణకు దించుతుంది. కమ్యూనిస్టు సమాజం కోసం కలలు కనేట్టు చేస్తుంది.

రాహుల్ ఆర్య సమాజ ఆకర్షితుడిగా, నాస్తికుడుగా, భౌతిక వాదిగా, బౌద్ధ మతాభిమానిగా గతి తార్కికుడుగా మారి కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం పొంది మార్క్సిజాన్ని మార్గదర్శక సిద్ధాంతంగా గ్రహించారు. ఈ పరిణామ క్రమాన్ని చూడనివారు రాహుల్‌జీని స్వేచ్ఛ మేధావిగా భావించారు.

1922 నాటికైనాగాని భారతదేశంలో కమ్యూనిస్టు భావాలు వ్యవస్థీకృతం కాకపోవడం, ఆ తరువాత దశలో భారత స్వాతంత్ర్య పోరాటాన్ని విముక్తి పోరాటంగా మలిచే శక్తిని కమ్యూనిస్టు పార్టీ సమకూర్చుకో లేకపోవడం, తెలంగాణా పోరాట విరమణ వల్ల రాహుల్‌జీ లాంటి మేధావులను యిముడ్చుకొని, వారికి దర్శకత్వం వహించ లేకపోవడం జరిగింది. ప్రజా పోరాటాలు పెల్లుబికినప్పుడల్లా రాహుల్‌జీ స్పందించారు. రాహుల్‌జీ రాజకీయ జీవితంలో వడిదుడుకులు ఈ నేపథ్యంలో అర్థం చేసుకోవాలి. రాహుల్‌జీ అనిశ్చితులు కారు. దృఢసంకల్ప సిద్ధులు.

ఈ శతాబ్దంలో ప్రజల జీవితాలు రాజకీయానికి బాహ్యంగా వుండవనీ, ప్రజానుకూల రాజకీయాన్ని ప్రజలలోని అన్ని వర్గాలూ ఎంత బలంగా ప్రదర్శిస్తారో అంత బలమైన విముక్తిని ప్రజలు పొందుతారనీ రాహుల్‌జీ విశ్వసించారు

**రచనలు :**

రాహుల్‌జీ హిందీ, సంస్కృతం, పాళీ, టిబెటెన్, భోజపురి భాషలలో సుమారు 125 గ్రంథాలు రచించారు. 30 భాషలను స్వయంకృషితో అభ్యసించి అసంఖ్యాకమైన ఉత్తరాలు, నోట్సు, డైయిరీలు రాశారు.

తత్వశాస్త్రం, చరిత్ర, సామాజిక శాస్త్రం, సైన్సు, పర్యటన, జీవిత గాథలు, నవలలు, నాటకాలు, కవిత్వం, వ్యాసాలు, నిఘంటు రచన, వ్యాకరణ గ్రంథాలు, పరిశోధన, పాఠ్య భేద వివేచనలు, దేశ చరిత్రలు, బౌద్ధమతంమీద, జానపథ విజ్ఞానం, రాజకీయ పరిశీలనలు, వ్యాఖ్యానాలు, అనువాదాలు, మాండలిక ఉచ్ఛారణ పద్ధతులు, పాఠ్యపుస్తకాలు—ఇలా రాహుల్‌జీ రచనలు బహుముఖంగా సాగాయి.

పర్యటనలలోను, జైళ్ళలోను, రైళ్ళలోను, ఓడ ప్రయాణాలలోను హోటళ్ళలోను, సత్రాలలోను, ఆశ్రమాలలోను, కేంపుల్లో, ఇంట్లో, మార్గ మధ్యంలో తన రచనా కార్యక్రమాన్ని కొనసాగించారు. రచనలు చేయడానికి ప్రత్యేక సదుపాయాలు, మానసిక స్థితి కోరుకుంటే రాహుల్‌జీ ఇన్ని రచనల చేయగలిగేవారా? 1927లో మొదలుపెట్టి 1961లో రోగగ్రస్తులయ్యేంతవరకు రచన సాగించారు. రోజుకు 18గం॥లు పని చేసేవారు. 34 సంవత్సరాలు రచనల చేసి 50వేల పేజీలు ప్రచురించారు. 12 గ్రంథాలు, నోట్సు, డైరీలు అముద్రితంగా వుండిపోయాయి.

రాహుల్‌జీ 13 నవలలు రచించారు. వీటిలో ప్రసిద్ధి చెందిన చారిత్రక నవలలు—సింహ సేనాపతి, జయయోధేయ, విస్మృతయాత్రికుడు, దివోదాసు, మధుర స్వప్నం. విప్లవోద్యమంలో చేరిన పేద రైతుగాథ యితివృత్తంగా "జీనే కేలియే" (బతకటం కోసం), రాణివాసాలలో బానిస స్త్రీల గాథలు తెలిపే "రాజస్తానీ రాణివాస్", ఇరవై రెండో శతాబ్ది ఊహాప్రపంచ చిత్రం "బాయీసవీ సది", వ్యావహారిక భాషలో రాసిన "భాగో నహీ! దునియా కో బదలో (పారిపోవద్దు! ప్రపంచాన్ని మార్చండి)" అనేవి సాంఘిక నవలలు.

ప్రచురించిన నాలుగు కథానికా సంపుటాల్లో "సత్మీకే బచ్చే" పేదపిల్లల దయనీయ పరిస్థితిని చిత్రించింది. "ఓల్గా సే గంగా" కథా సంపుటిని రాహుల్‌జీ భారత సాహిత్యానికి అర్పించిన అమూల్యగ్రంథం. గోర్కీ "మదర్"తో బాటు "ఓల్గా సే గంగా" కూడ భారతీయ భాషలన్నిటిలోకి అనువదించబడింది. ఈ రచనకు అంతర్జాతీయ ఖ్యాతి లభించింది.

మరో బృహత్ గ్రంథం "దర్శన్—దిగ్దర్శన్". ఈ గ్రంథంలో రాహుల్‌జీ గ్రీకు, ఇస్లామ్, ఐరోపా, భారతీయ తత్వశాస్త్రాలకి మార్క్సిస్టు అవగాహనతో హిందీలో విమర్శనాత్మక వివరణిచ్చారు. మూడు వేల సంవత్సరాల ప్రపంచ తాత్విక సింహావలోకనం ఈ గ్రంథం.

2814 పేజీలతో ఐదు సంపుటాలుగా "మేరీ జీవన్ యాత్రా" రాహుల్‌జీ ఆత్మకథ వెలువడింది. ఇది విజ్ఞాన సర్వస్వమని చెప్పడం అతిశయోక్తి కాదు. జీవిత గాథలకు చెందిన పదిహేడు సంపుటాలు రాహుల్ చేసిన సాహిత్య వచన రచనలల్లో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తాయి. హిందీలో మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో సే టుంగు ల జీవిత చరిత్రలు రాశారు. అందులో మావో జీవిత చరిత్ర 350 పేజీలుంటుంది. రాహుల్‌జీ పర్యటన అనుభవాలకు సంబంధించి 13 పుస్తకాలు రచించారు. కమ్యూనిస్టు మేనిఫెస్టోను మిత్రుల సహాయంతో హిందీలోకి అనువదించారు. సంస్కృతం, పాళీ భాషలలో రెండు కవితా సంకలనాలు

సమకూర్చారు. పరిశోధనలకు సంబంధించి "దక్కనీ కావ్యధారా" ముఖ్యమైన గ్రంథం. జానపద గాథలను, గీతాలను సేకరించి "అది హిందీకి కహానియా ఔర్ గీతే" అన్న గ్రంథాన్ని ప్రచురించారు. రాహుల్‌జీ వ్యాసాలు, "రాహుల్ నిబంధావళి" అనే సంకలనంగా 1970లో ప్రచురింపబడింది. గణిత శాస్త్రానికి సంబంధించి ఆయన "విశ్వ కీ రూపురేఖా" విద్యార్థులకీ ఎంతో ఉపకరిస్తుంది.

రాహుల్‌జీ రచనలన్నింటినీ ప్రస్తావించడం ఈ వ్యాసం పరిధికి మించినదే అవుతుంది. కొన్ని ముఖ్యమైనవిగా గుర్తుంచుకోదగ్గవిగా వున్న గ్రంథాలనే ప్రస్తావించడం జరిగింది.

పరిశ్రమించలేని, "గాడిదలా పనిచేయడానికి" మనస్కరించని వారికెవరికైనా రాహుల్‌జీ రచనా వ్యాసంగం ఒక అద్భుతంగా కనబడవచ్చును, అలౌకిక శక్తి సంపన్నుడని భావించవచ్చును. పరిణామక్రమంలో అత్యున్నత దశ నందు కొన్న మానవ జీవి, శక్తిని బయటకు తీస్తే, ఎలాంటి సృష్టినైనా చేయగలడు. ఈ సత్యానికి ఋజువు రాహుల్‌జీ.

## గ్రంథ సేకరణ :

అధ్యయనం — పర్యటన — రచన - గ్రంథసేకరణ, ఈ నాలుగూ రచయితకు అతి ముఖ్యమైన యంత్రాంగాలు. గ్రంథాలను సేకరించి, గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసికొంటేనే, రచయిత తన రచనా వ్యాసంగాన్ని నిలకడగా కొనసాగించగలడు.

రాహుల్‌జీ తన తొమ్మిదవ ఏట కాశీలో తొలిసారిగా ఒక ఉర్దూ పుస్తకం కొని చదివారు. ఆ పుస్తకం రాహుల్‌జీని ప్రపంచ పర్యటనకు ప్రోత్సహించింది. భోజపురి జైలు నుండి "బోల్షివిజం - ప్రపంచ విప్లవం" అనే గ్రంథాన్ని బాంకిపురి జైలునుండి "మాఝుమ్ నికాయ" అనే గ్రంథాన్ని సంపాదించి చదివారు. హజారీబాగ్ జైలునుండి "ఎపిగ్రాఫికా ఇండికా", సింహళం నుండి "పాళి పుస్తక సంఘ", లండన్‌లో "రాయల్ ఏసియాటిక్ సొసైటీ" ప్రచురణలు మిత్రుల ఆర్థిక సహాయంతో సంపాదించారు.

రాహుల్‌జీ టిబెట్టు పర్యటనల వల్ల లామా ఆశ్రయంలో భద్రపరచబడిన, మన దేశంలో లభ్యంకాని బౌద్ధ గ్రంథాలు, కాంజూరు టాంజూరులలో భద్రపరచబడిన సుమారు 10 000 గ్రంథాలలో విలువయిన వాటిని, తాళ పత్ర గ్రంథాలను చాలావరకు భారతదేశానికి తీసుకు వచ్చారు. బౌద్ధ తార్కికులైన దర్మకీర్తి, సుబంధు, అసంగ వంటి వారి రచనలను పునఃసృష్టించి భద్రపరచారు.

టిబెట్టులో సేకరించిన గ్రంథాలను, సుమారు 130 చిత్రాలూ మొదలైన సరంజామాని 22 కంచర గాడిదల మీద ఎక్కించి 39 రోజులు సాహసవంతమైన

ప్రయాణం చేసి, పాట్నా మ్యూజియంలోని కాశీ ప్రసాద్ జైస్వాల్ భవనానికీ అప్పగించారు.

1914లో పరాశ ఆశ్రమంలో భారత పురాతత్వ శాఖకు చెందిన గంగూలీ, పెండిదాన్ అనే ఛాయాగ్రాహకులనుండి ఫొటోగ్రఫీని నేర్చుకొని ఎన్నో దృశ్యాలను రచించారు.

కీట్సు కవితలోని—

Ever Let the Faney Roam

Pleasure is Never at Home అనే వాక్యాలను రాహుల్‌జీ తమ జీవితాంతం గుర్తుంచుకొన్నారు. రాహుల్‌జీ విజ్ఞానతృష్ణ గొప్పది. గ్రంథ సేకరణకై ఆయన ఎంతటి సాహసానికైనా వెనుకాడలేదు. ఆరోగ్యాన్ని లెక్కచేయలేదు. అమూల్యమైన గ్రంథాలను సేకరించి, వాటిని భారత జాతి సొత్తుగా భావించి సంస్థలకే వప్పజెప్పారు.

**బోధన :**

రాహుల్‌జీ ఆర్యసమాజ ప్రచారకులతో కలిసి చర్చలకు, ఉపన్యాసాలకు వేదిక అయిన ఒక సంఘాన్ని 1914లో స్థాపించి, మూఢ నమ్మకాలపై ధ్వజమెత్తారు 1915 లో మీరట్ నుండి వెలువడే "భాస్కర్" అనే హిందీ పత్రికలో రాహుల్‌జీ గృహస్థులను మోసగిస్తున్న సాధుల్ని గురించి మొదటి సుదీర్ఘ వ్యాసం రాశారు. 1922 లో జైల్లో రాజకీయ భజన గీతాన్ని రచించి తోటి వారితో కలిసి పాడి ఉత్సాహాన్ని కలిగించేవారు—

"వినుమోయి, వినుమోయి బాటసారీ
ఏకాకినీ కాదు ఏనాటికీ నేను!"

1927 లో "సరస్వతి" అనే హిందీ మాసపత్రికలో సింహళ దేశాన్ని గురించి కొన్ని వ్యాసాలు రాశారు. టిబెట్టు భాషను బోధించడానికి సంస్కృతంలో. వ్యాకరణం, ప్రాథమిక పాఠ్య పుస్తకం రాశారు.

1927—28లో శ్రీలంకలో సంస్కృత ఉపాధ్యాయుడిగాను, 1944-47లో సోవియట్ రష్యాలోని లెనిన్‌గ్రాడ్ విశ్వ విద్యాలయంలో ఆచార్య పదవినిఅలంకరించారు. ఆయన జీవిత కాలంలో అయనకు ఏ డిగ్రీ లేకపోవడం వల్ల మన దేశ విద్యాలయాల్లో బోధించడానికి ఎన్నడూ రాహుల్‌జీని ఆహ్వానించకపోవడం విచారించతగ్గది. మన దేశ విద్యా నిర్వహణలోని సంకుచిత తత్వాన్ని, డొల్లతనాన్ని అర్థం చేసుకోవచ్చును.

## మత విశ్వాసాలు - బౌద్ధ మతం :

సనాతన బ్రాహ్మణకుటుంబంలో జన్మించిన రాహుల్ సంస్కృతాన్ని సాంప్రదాయసిద్ధంగా అభ్యసించారు. ఆనాటి విద్యకు సంస్కృత భాష, ఆ గ్రంథాల అధ్యయనం ప్రధానం. సహజంగానే వేద విద్య రాహుల్‌జీకి తొలి విద్య. ఆర్య సంస్కృతి అధ్యయనం వల్ల తమ రచనల్లో తత్సంబంధమైన అంశాలు ఎక్కువగా చోటు చేసుకొన్నాయి. ఉత్తర భారత దేశంలోని జైన, బౌద్ధ తాత్విక చింతనలు మొదట రాహుల్‌జీని ఆకర్షించాయి. అవి తన రచనలకు భూమికలయ్యాయి. వేద సంస్కృతికీ, ఆర్యులకు అభిమాని రాహుల్‌జీ అని గాని, ద్రవిడ సంస్కృతికి వ్యతిరేకి అని గాని విమర్శించ బూనుకొనేవారు - రాహుల్‌జీ భావాల పరిణతీ పరిణామాన్ని చూడ నిరాకరించినవారే. బ్రాహ్మణ పక్షపాతి అనీ, బ్రాహ్మణ వ్యతిరేకి అని రెండు అపప్రదలూ రాహుల్‌జీపై వున్నాయి.

రాహుల్‌జీ అసలు పేరును తన సనాతన హిందూ విశ్వాసాలను మార్చుకున్నారు. బాబారామ్ ఉదాస్‌దాస్ అని పేరు మార్చుకొని సంచార భిక్షువుగా ఆర్య సమాజ వైదిక సిద్ధాంతాన్ని అంగీకరించక నాస్తికుడుగా మారారు. ఆ తరువాత రాహుల్ సాంకృత్యాయన్‌గా పేరు మార్చుకొని బౌద్ధ భిక్షువుగా మారిబౌద్ధ గ్రంథాల్ని అధ్యయనం చేసి "మహా పండిత", "త్రిపిటకాచార్య" బిరుదులు పొందారు. అధ్యయనం కోసం టిబెట్టులో మూగ సాహసవ స్యారు. బౌద్ధమత ప్రచారకుడుగా యూరప్ పర్యటించి విసిగిపోయి, అమెరికాలో బౌద్ధమత ప్రచారంకోసం వచ్చిన ఆహ్వానాన్ని తిరస్కరించారు. మార్క్సిజం రాహుల్‌జీని ఆకర్షించింది. అధ్యయనం చేసి, అవగాహనతో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం పొంది సోషలిస్టు దేశాలను పర్యటించారు. ఈ పరిణామక్రమాన్ని చూడ నిరాకరించే వారికి రాహుల్‌జీ అర్థం కారు.

చరిత్ర, మతం పట్ల, మానవ పరిణామం పట్ల అతని రచనలలోని శాస్త్రీయ దృష్టి అమోఘమైనది. హిందూ మతంలోని ఉన్మాదాన్ని నిరసించారు. బౌద్ధమతం తననెందుకు ఆకర్షించిందో వివరించారు. హిందూ మతోన్మాదుల వ్యతిరేకతను పొందారు రాహుల్. పక్షపాత వైఖరితో రచించబడిన చరిత్రలనీ, వక్ర భాష్యాలనీ, అసంగతమూ, కాలదోషం పట్టిన సంగతులనీ రాహుల్‌జీ గ్రంథాలను శుద్ధ పండితులు విమర్శించారు. రాహుల్‌జీని శుద్ధ చరిత్రకారుడిగా చూచి, ఆయన రచయిత అని మరచారు పండితులు. భావాలు పరిణతి చెంది, చివరి 25 సంవత్సరాలు మార్క్సిజం అభిమానిగా కమ్యూనిస్టుగా జీవించిన రాహుల్‌జీ జీవిత క్రమాన్ని అర్థం చేసుకోకపోతే ఆయన రచనలేవీ అర్థం కానట్టే భావించవచ్చును. రాహుల్‌ను బౌద్ధ మతస్థుడుగానే పరిగణించేవారు లేకపోలేదు. అందుకు కారణం ఆయన రచనలను తులనాత్మకంగా సమీక్షించుకోలేకపోవడం.

**కుటుంబం :**

సాహసికుడు తల్లి కన్నీరు, తండ్రి భయం లెక్క చేయడు. భార్యా భర్తలు ఒకరికొకరు సంకెళ్ళు కారాదంటారు రాహుల్‌జీ. లోక సంచారానికి ఏ బంధనాలూ అడ్డు పడరాదనుకున్నారు. తన బాల్యంలోనే జరిగిన వివాహాన్ని తిరస్కరించారు. ఈ కారణంగా తనకు 50 ఏళ్ళు వచ్చే వరకు స్వగ్రామం పందహాకు వెళ్ళలేదు. ఆ తరువాత స్వగ్రామం వెళ్ళి భోంచేస్తుండగా నిండుగా ముసుగు వేసుకొన్న ఒక స్త్రీ వచ్చి కాళ్ళమీద పడడంతో భోంచేయకుండా లేచి వెళ్ళిపోయారు రాహుల్. ఆ స్త్రీ ఆతని మొదటి భార్య.

1937-38 మధ్య కాలంలో సోవియట్ అకాడమీ ఆహ్వానం పురస్కరించుకొని రష్యా వెళ్ళిన రాహుల్‌జీ అక్కడ లోలా అనే విద్యాధికురాలను వివాహం చేసికొన్నారు. 1938 సెప్టెంబరు 5న వారికి ఒక కొడుకు పుట్టాడు. పిల్లాడికి ఇగోర్ అని పేరు పెట్టారు. కాని అప్పటి పరిస్థితులలో ఆయన భార్యాబిడ్డలను భారతదేశం పంపడానికి రష్యా ప్రభుత్వం తిరస్కరించింది. 1947 తరువాత రాహుల్‌జీ తన భార్య లోలాను, కొడుకు ఇగోర్‌ను చూడలేకపోయారు. తమ జ్ఞాపకశక్తి నశించిన తరువాత, చికిత్స కోసం రాహుల్‌జీని రష్యా తీసుకువెళ్ళినపుడు లోలా ఆయన్ని కలుసుకొన్నారు.

1950 ప్రాంతంలో నేపాలులోని భారతీయ మహిళ డా॥ కమల పెరియార్‌ని పెళ్ళి చేసుకొని, మసూరిలో కొంతకాలం జీవించగా జయ అనే కూతురు, విజేత అనే కొడుకు పుట్టారు. తరువాత శ్రీలంకలోని విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా వున్నపుడే డయాబెటిస్ వ్యాధి పట్టుకుంది. చికిత్సకు రష్యా వెళ్ళినా ప్రయోజనం లేకపోయింది. 1961 డిశంబరులో జ్ఞాపక శక్తిని కోల్పోయారు. 1963 ఏప్రిల్ 14న డార్జిలింగ్‌లో కన్ను మూశారు రాహుల్‌జీ.

రాహుల్‌జీ వ్యక్తిగత జీవితంలోని ఒడుదుడుకులకు ఆయన అవిశ్రాంత జీవితమే కారణం చెబుతుంది.

రాహుల్‌జీకి తన జీవిత కాలంలో తగిన గుర్తింపు, అవసరమైన విశ్రాంతి లభించలేదు. అత్యున్నత స్థాయికి ఎదిగిపోయిన అతడి మనస్సును బహుశా ఆయన శరీరం భరించలేకపోయింది. రాహుల్‌జీ గురించి ఎన్ని ప్రశ్నలు వున్నా, వాటి జవాబులు ఆయన రచనలలోనే లభ్యమవుతాయి. విచారకరమైన విషయమేమిటంటే వారి కొన్ని నవలలు తప్ప ఇతర రచనలు తెలుగులోనికి అనువాదం కాలేకపోవడం.

రాహుల్‌జీ పర్యటనే ఊపిరిగా బతికిన మహా యాత్రికుడు. బహు భాషా పండితుడు, త్రిపిటకాచార్యుడు, శ్రామిక వర్గ శ్రేయోభిలాషి, 'మార్క్సిస్టుమేధావి,→

## పరకాయ ప్రవేశం ఇక వద్దు !

కారణాలు పెద్దగా అక్కర్లేదుగానీ
మోసపోవడానికి అలవాటు పడ్డవాళ్ళం
మోసపోతూనే వుంటాం

ఇంకా స్త సూటిగా చెప్పాలంటే
పారిపోడానికి అలవాటు పడ్డవాళ్ళం
పారిపోతూనే వుంటాం
పెద్ద గీతని మరిచిపోవడానికి
చిన్న గీత గీసి వీరోచితంగా కేక లేస్తుంటాం

బాధలు పెద్దగా అక్కర్లేదు గానీ
దాక్కోడానికి వొకింత గుహ వెతుకుంటాం
గుహ లోపలి గుహ నుంచి నిశ్శబ్దంలోకి నిష్క్రమిస్తాం

* * *

నిజమే, శరీరం ఒక అసహజ కవచం
దానికి ఏ రంగూ లేనప్పుడు మనమే కొత్త రంగు వేసుకోవాలి
దానికి ఏ వాసనా లేనప్పుడు మనమే కొత్త పరిమళం కావాలి
అసహజంగా దిగజారిన
ఈ శరీరాకాశమ్మీద ఒక మత్తు తెరని కప్పుకుంటాం
యంత్ర రణగొణ ధ్వనులయ్యాక
సాయంత్రానికో కొత్త భాష కావాలి

---

→మహా పండిత, త్రిపిటకాచార్య, సాహిత్య వాచస్పతి వంటి బిరుదులు-భగల్‌పూర్, శ్రీలంక విశ్వ విద్యాలయాలిచ్చిన డి.లిట్ డిగ్రీలు — భారత ప్రభుత్వం యిచ్చిన పద్మభూషణ్ అవార్డు — ఇవన్నీ రాహూల్‌జీ పొందిన చిన్న పురస్కారాలు.

"విజ్ఞానం కొంత కాలానికి ఉపయోగించిన పడవ మాత్రమే, తలపై మోయ లేని బరువు" కాదనే బుద్ధుని మాటలు, "ఒక చోట కలకాలం నిలిచిపోకు, నిరంతర గమన శీలివి కమ్ము" అన్న నవజిందా బజిందా మాటలు, "ఊహని విశాలంగా విహరించనీ! ఇంటివద్ద లేదు ఆనందం ఏనాటికీ!" అన్న కీట్సు మాటలు రాహుల్‌జీ జీవితాన్ని ప్రభావితం చేశాయి. ప్రతిభను నాశనం చేసుకోవడం కంటే మరణించటం మేలని ఎంచిన రాహుల్‌జీ మరణించేంత వరకూ సాహిత్య రంగంలో కృషి చేశారు.

పగటి అశాంత మేఘాల అంచుకి
రవంత ప్రశాంతతని సింగారించాలి
ఎంత చిత్రంగా
మనం వోడిపోతుంటామో అద్దంలో చూస్కోవాలి

* * *

మనం రోజూ పరాజితులమే అంటే
నీకు అబద్దంగా వినిపించవచ్చు
అబద్ధంతో ఎప్పుడూ యుద్ధం చెయ్యని నీకు
ప్రతి నిజమూ ఒక అబద్ధమేగా !
పిల్లల ఆకలి కడుపు కొట్టి
ప్రశాంతతని కొనుక్కుంటాం సరే,
మనింటి చుట్టూ కాపలా కాసే
దరిద్రపు గజ్జికుక్క సంగతేమిటి ?
మానవ చర్మాన్ని కోల్పోయిన
అకారణ ఆగ్రహ ప్రదర్శనలో
అర్ధ శరీరం తెగిన చెప్పుగా మారుతుంది
గుడ్డి దీపం నీడలో
రేపటి అక్షరాల్ని కూడబలుక్కొని చదూతున్న
పిల్లల కంఠాల్ని భయం చలి చుట్టు కుంటుంది
అయినా, ఈ యుద్ధంలో
పిక్కబలం చూపుతున్న పాదాలు నీకు కన్పించకపోవచ్చు

* * *

వాగ్దాన భంగాలు పెద్దగా వుండక్కర్లేదు గానీ
దొంగ నిద్రకి అలవాటు పడ్డవాళ్ళం
నిద్రపోతూనే వుంటాం
నిద్రలోకి జారుకున్నప్పుడల్లా
జారిపోయిన వస్త్రాలు గుర్తొచ్చి నిద్రా భంగమవుతుంది
బహిరంగ నగ్న నృత్యంలో
రాలిపోయిన పెదాల్ని మళ్ళీ కుట్టాలనుకుంటాం
తడబడిన అడుగుల్ని
మళ్ళీ వెతుక్కోవాలనుకుంటాం

ఒక అబద్ధం కోసం ఎన్ని శిలువలు ఎక్కి
ఎంత నెత్తురోడ్చామో అనిపిస్తుంది

ం ం ం

ఆత్మ ఖననానికి
ఇంత కంటే రాజ మార్గం లేదు
మనిషిని మరో మనిషి నుంచి
మరో మనిషిని మరో మనిషి నుంచి చీల్చి చెండాడటానికి
ఇంత కంటే రాజ్య మార్గం లేదు
ఎవరో ఆడిస్తున్న నాటకంలో
మనం పాత్రధారులమవ్వాయమని అందరికీ తెలుసు
మనం తొడుక్కునే సుఖ దుఃఖాల వస్త్రాలు
మన వొంటికి అస లేసూత్రం అతకడం లేదనీ తెలుసు
మన కోప తాపాల వెనకా
మన బాధల బాదర బందీల వెనకా
మూసుకుపోతున్న మన అంతర్లోక ద్వారాల వెనకా
ఎవరెవరు నక్కి వున్నారో తెలుసు

ం ం ం

కారణాలు తెలియవని కాదు గానీ
ఆత్మ వంచనకి అలవాటు పడ్డ వాళ్ళం
ఆత్మని వంచిస్తూనే వుంటాం
ఆత్మ వంచనే 'కాల'ధర్మమైనప్పుడు
ఆ కాలాన్ని
నాలుగు పాదాల మీద మోసుకెళ్ళి
ఖననం చేయడమే ధర్మం
కానీ ఒక్కటి —
ఇప్పుడు స్థిరమైన తడబడని పాదాలు కావాలి
దేశాన్నే కొత్త దేహంగా ధరించుకోవాలి
నిజంగానే
ఇప్పుడు మనదైన
కొత్త కాల శరీరంలోకి ప్రవేశించాలి

— అఫ్సర్

# మనందరిలోనూ ఉన్నాడు రాహుల్జీ

— చలసాని ప్రసాదరావు

నేను రాహుల్జీని ఎన్నడూ చూడలేదు. ఒకే ఒక లేఖ ద్వారా తప్ప మా మధ్య పరోక్ష పరిచయం కూడా దాదాపుగా లేదు.

కాని, ఆయన నాలో ఉన్నాడు.

నాలోనే కాదు, మనందరిలోనూ ఉన్నాడు.

ఆయన రచన కనీసం ఒకటన్నా చదవని వారు మనలో ఉండరనే నా అంచనా!

నాలో ఆలోచనను రగిలించి, విచక్షణా శక్తిని, హేతువాద దృష్టిని పెంచిన తొలి గ్రంథం రష్యన్ రచయితలు ఎం. ఇలిన్, ఇ. సెగాల్ రాసిన "మీకు తెలుసా ?"

అప్పట్లో తెలుగులో అసలు అందుబాటులో ఉన్న పుస్తకాల సంఖ్యే చాలా తక్కువ. నా ఆంగ్ల పరిజ్ఞానం అత్యల్పం. అందువలన దొరికిన ప్రతీ తెలుగు పుస్తకాన్ని చదివేసే కాలమది.

అలాంటి సమయంలో పెన్నిధిలా దొరికింది నాకు అల్లూరి వారు అనువదించిన రాహుల్ సాంకృత్యాయన్ బృహద్గ్రంథం "ఓల్గా నుండి గంగాతీరము."

పేరు చూస్తే అది నవల గానీ, కథలుగానీ అనుకోరెవరూ. ఆ పేరు అంతగా ఆకట్టుకునేలా లేదు కూడా. పైగా 'ఓల్గా' గురించి తెలుగు వారికి తెలిసింది అప్పట్లో చాలా తక్కువ.

అయితే,

చదవటం మొదలెట్టిన తర్వాత మాత్రం ఏకబిగిన పూర్తి చేసే దాకా వదల లేక పోయాను. అందులోని విషయం, దానిని రాహుల్జీ కథలు కథలుగా, చదివించేలా రాసిన తీరు, నిర్మొహమాటంగానూ, ఎలాంటి దాటవేతలూ లేకుండానూ విషయాన్ని సూటిగా చెప్పిన పద్ధతి అందుకు కారణం.

ఈ గ్రంథం చదివాక నేను చాలా చాలా తెలుసుకున్నట్లుగా ఫీలయ్యాను. కనీసం పాతిక చరిత్ర పుస్తకాల్ని పదే పదే పట్టుదలగా, ఓపికగా చదివి తెలుసుకో గల దానికన్నా అధికంగా అర్థం చేసుకోగలిగా ననుకొన్నాను. తప్పనిసరిగా తెలుసు

---

అజ్ఞానానికి మారుపేరు భగవంతుడు, మనం తెలివిలేనితనాన్ని స్పష్టంగా ఒప్పుకోవడానికి సిగ్గుపడతాము. అందువల్లే 'భగవంతు'డనే గౌరవనీయమైన పేరు ఆవిష్కరించబడింది. భగవంతునిపై విశ్వాసానికి మరో కారణం మానవుని అసమర్థత, వివశత్వం.

—రాహుల్ జీ

కుని తీరాల్సిన విషయాల్ని సునాయసంగా జీర్ణం చేసుకో గలిగానని ఇప్పటికీ జ్ఞాపకం చేసుకుంటూ ఉంటాను.

ఆ విధంగా రాహుల్జీ పుస్తకం నాలో అంతకు ముందే రగిలిన హేతువాద దృష్టిని బలపరచి, పెంచి, ఆ తరువాత చదివే పుస్తకాలను విశ్లేషించుకోగల శక్తిని పెంచింది !

ఈ అనుభవం ఇంకా ఎందరెందరికో కూడా జరిగే ఉంటుంది, జరుగక తప్పదు.

అందుకే రాహుల్జీ నాలో, మీలో, మనందరిలో ఉన్నాడు.

లేదా, నా ద్వారా మీలో, మీ ద్వారా నాలో, మన ద్వారా మరెందరిలోనో కూడా ఉండి ఉంటాడు.

అందుకు మనం ఆయనకు తీర్చుకోలేని విధంగా ఋణపడి ఉన్నాం.

ఆ ఋణం తీర్చుకునే అవకాశం మనకు కేవలం మనం ఆయన నుండి స్వీకరించిన దానిని, నేర్చుకున్న దానిని ఇతరులకు పంచిపెట్టటం ద్వారానే, నేర్పటం ద్వారానే లభ్యమవుతుంది.

'ఓల్గా సే గంగా' తర్వాత రాహుల్జీ పుస్తకాల కోసం ఎంతగానో వెదికాను. ఆయితే, కమ్యూనిస్టు పార్టీపై నిషేధం, నిర్బంధం తొలిగిన తొలి రోజులవి. అప్పటికే వారి సాహిత్యం సమస్తం విచక్షణా రహితంగా పోలీసుల చేతిలో ధ్వంసం అయి ఉంది.. కుప్పలుగా వేసి, పెట్రోల్ పోసి తగలేసిన చరిత్ర ఉన్నది. నేను చదివిన కొద్దిపాటి పుస్తకాలూ ఏదో ఒక విధంగా ఆ దహన కాండల నుండి తప్పించుకుని ఆ తర్వాత బయటపడినవే.

అప్పట్లో రాహుల్ జీ కమ్యూనిస్టు కూడానని నాకు తెలియదు. 'ఓల్గా సే గంగా' అనువదించిన అల్లూరి సత్యనారాయణ రాజు గారు రాష్ట్ర కాంగ్రెస్ అగ్ర నాయకుల్లో ఒకరవటాన ఆ ఆలోచనే రాలేదు నాకు. ఆ తర్వాతే అసలు విషయం తెలిసింది.

అలాంటి మరో పుస్తకం దొరక్క దాన్నే మళ్ళీమళ్ళీ ఎన్ని సార్లు చదివానో లెక్కేలేదు. అలా నా చేత ఒకటికి పది, పాతికసార్లు కూడా చదివించిన పుస్తకాలు అత్యల్పం.

ఆ తర్వాత ఏ సంవత్సరమో గుర్తులేదు గానీ, నేను 1956 లో వరంగల్‌లో ఉండగానో, లేక హైదరాబాద్ వచ్చి 1958లో ఫైన్ ఆర్ట్స్ కాలేజీలో చేరిన తొలి రోజులలోనో గానీ రాహుల్జీ మరో 'నవల' "సింహ సేనాపతి" తెలుగు అనువాదం వెలువడింది. భారతదేశ చరిత్ర పరిణామక్రమంలోని ఒక దశను ఆసక్తికరంగా

వివరించే సాధికార రచన అది. ఆ రచనలో కనపడే 'దృష్టి' లేదా పరిశీలనా కోణం ఇతర చరిత్రకారులు, "చారిత్రక నవల" లలో మనకు కనుపించదు.

అందుకు కారణం రాహుల్జీకి మార్క్సిస్టు దృక్పథం ఉండటమే. అది ఉన్న వారికి తిరుగులేదు. వారికి వుండే అవగాహనా, విశ్లేషణా శక్తి మరెవరికీ రాదనేది నా అనుభవం. పైగా రాహుల్జీ శతాధిక శాతంలో అసలు సిసలు భారతీయుడు. ఈ దేశ చరిత్ర-సంస్కృతులను అపోశనం పట్టి జీర్ణించుకున్న మహా వ్యక్తి ఆయన.

మహా పండితులకు మనకు లోటు లేదు. కానీ, ఆ పాండిత్యాన్ని సామాన్యులకు పంచి పెట్టి, వారిని ఆలోచింప జేయగలగాలని చూసిన "మహా వ్యక్తులు" చాలా తక్కువ.

అలాంటి వారిలో అగ్రగణ్యుడూ, ప్రథముడూ రాహుల్జీ!

"సింహ సేనాపతి" ఒకటికి పదిసార్లు ఆత్రంగా, చదివిన తర్వాత పది విందు భోజనాల తృప్తి కలిగింది నాకు. అయితే అదే సమయంలో నాలో అనేక సందేహాలు, ముఖ్యంగా ఒక విషయంలో తలెత్తాయి.

1956 నాటికి నా వయసు పదిహేడేళ్ళు, ఆ సంవత్సరం తప్పనుకున్నా 1958 నాటికి పంధొమ్మిదేళ్ళు మాత్రమేనని ఈ సందర్భంగా గమనించాలి. అయినా రాహుల్జీ అంతటి పండిత రచయిత వర్ణించిన చారిత్రకాంశాలను గురించి సైతం నాలో అనుమానాలు తలెత్తాయంటే, ఆ క్రెడిట్, అలా ఆలోచించగల శక్తిని తన పాఠకులకు కలుగజేసిన రాహుల్జీకే దక్కుతుంది.

"సింహ సేనాపతి" నవలకు పరిచయంగా రాహుల్జీ ఒక ప్రవేశిక రాశారు. అందులో తాను ఒక కాలంలో చాప్రా జిల్లాలో ఉంటున్న సమయంలో, నిత్య వ్యాయామంలో భాగంగా ఊరి చివర్న త్రవ్వకం పనిలో మునిగి వుండగా ఓ ఇటికల 'ఆవం' బయట పడిందనీ, కాల్చిన ఆ ఇటుకల మీద బ్రాహ్మీలిపిలో ఓసు దీర్ఘ కథనం రాసి ఉందనీ, ఆ ఇటుకలన్నింటిని ఓ క్రమంలో పేర్చి అనువదించగా ఈ "సింహసేనాపతి" నవల తయారయిందనీ, దానిని యథాతథంగా పాఠకుల ముందుంచుతున్నాననీ, అందులో తన స్వంత మాట ఒక్క అక్షరం కూడా లేదనీ, లింకు తెగిన చోట్ల మాత్రం పాఠకుల సౌలభ్యం కోసం తను ఒకటి రెండు మాటలు చేర్చాననీ, అలాంటివి తన స్వంత మాటలుగా గుర్తించేందుకు వీలుగా బ్రాకెట్లలో పెట్టాననీ రాశారు.

ఆ ఇటుకలన్నీ ప్రస్తుతం పాట్నా మ్యూజియంలో ఉన్నాయనీ, తన నిజాయితీ పట్ల ఎవరికైనా ఎలాంటి అనుమానాలైనా వస్తే, వెళ్ళి చూసుకోవచ్చుననీ కూడా వివరించా రాయన.

ఈ ప్రవేశికలో రాహుల్జీ ఎంత నిజాయితీగా నమ్మబలికినా నేను మాత్రం ఇలా ప్రవేశికనే నమ్మలేకపోయాను. నవలలోని మన సాధారణ నమ్మకాలకు, అవగాహనలకు, పరిజ్ఞానానికి పూర్తి విరుద్ధంగా ఉన్న కొన్ని విషయాల పట్ల మనకు విశ్వాసం కలిగించేందుకే ఆయన సులభ మార్గంగా ఈ పద్ధతిని ఎన్నుకుని ఆ ప్రవేశిక రాశారనీ ఆ 'సింహ సేనాపతి' ఆయన స్వీయరచనే తప్ప, ఆ ఇటుకలూ, బ్రాహ్మీ లిపీ నిజం కాదనీ నాకు అనిపించింది.

ఆ నవలలో రాహుల్జీ గౌతమ బుద్ధుడిని మాంసాహారిగా వర్ణించాడు. చారిత్రకంగా అది నిజమేకావచ్చు. కాని అహింసావాదిగానే బుద్ధుడయిన సిద్ధార్థుడిని మాంసాహారిగా మనం ఎలా అంగీకరించగలం, నమ్మగలం?

ఇలాంటివే మరి కొన్ని విషయాలు కూడా మన పారంపర్య జ్ఞానానికి, అవగాహనలకు వ్యతిరేకమైన అంశాలు నవలలో ఉన్నాయి. అందువలన రాహుల్జీ తన పాఠకులు గందరగోళంలో పడిపోకుండా వుండేందుకూ, తను రాసిన దానినే ప్రామాణికంగా స్వీకరించేందుకూ ఉద్దేశించి అలా ఆ "ప్రవేశిక"ను సృష్టించారనీ, ఆ ఇటికలు, బ్రాహ్మీ లిపిలో నవల, దాన్నాయన అనువదించటం-అదంతా కల్పన అనీ నేను అనుమానించాను.

అప్పట్లో సాహిత్య శైలులు, రచనా విధానాలను గురించిన మన-లేదా-నా-పరిజ్ఞానం అత్యల్పం కనుక మరోలా దానిని స్వీకరించి సరిపెట్టుకోలేకపోయాను.

పైగా విజయవాడ వెళ్ళినపుడు అక్కడి మార్క్సిస్టు మేధావులు, తత్వవేత్తలునైన పెద్దల నా విషయంలో ప్రశ్నించినపుడు నాకు సంతృప్తికరమైన సమాధానం రాలేదు.

బుద్ధుడు మాంసాహారే అయి ఉండవచ్చు. కానీ భక్తులు తెచ్చి ఇచ్చినదే అయినా (భిక్షగా) మాంసాహారం ఆయన మూల సిద్ధాంతానికే విరుద్ధం. మాంసం తినటం అంటే ప్రత్యక్షంగా తాను జీవ హింస చేయకపోయినా, పరోక్షంగా హింసను ప్రోత్సహించినట్లే గదా! దీన్నెలా సమర్థిస్తాం? అనే దొక పెద్ద ప్రశ్న.

అయితే రాహుల్జీకి చరిత్రను వక్రీకరించాల్సిన అవసరం లేదు! కనుక చరిత్రలోని వాస్తవాంశాల్ని పాఠకులు సునాయాసంగా స్వీకరించ గలిగేలా వారిని సిద్ధపరచటం కోసమే ఆ "ప్రవేశిక"ను అలా రూపొందించారనీ, ఆ ఇటుకలా గట్రా అబద్ధం అనీ నేను భావించాను.

కానీ, నాకు తెలిసిన చిన్నా—పెద్దా మేధావు లెవరూ కూడా నాతో ఏకీభవించలేదు.

అలా చాలా మందితో చర్చలయాక....

ఇలా కాదనుకుని నేరుగా రాహుల్జీకే ఉత్తరం రాశాను.

అప్పట్లో రాహుల్జీ ఢిల్లీ నుండి వెలువడే కమ్యూనిస్టు పార్టీ వార పత్రిక "న్యూ ఏజ్"లో వరుసగా కొన్ని వ్యాసాలు రాస్తూ ఉన్నారు. ఆ "న్యూ ఏజ్" కేరాఫ్‌కు నాకు వచ్చిన ఇంగ్లీషులోనే నా అనుమానాల్ని వెల్లడిస్తూ రాహుల్జీకి ఓ సుదీర్ఘమైన లేఖ రాసి పోస్టు చేసేను.

ఆ విధంగా నా "బకాయి" దింపుకున్నాను తప్ప జవాబు వస్తుందని ఆశించ లేదు గానీ, మరో మూడు వారాల తర్వాత నాకు మహదానందం కలిగించే విధంగా రాహుల్జీ స్వదస్తూరీలో ముస్సోరీ నుండి ఓ పోస్టు కార్డు వచ్చింది. అందులో ఉన్న నాలుగే నాలుగు లైన్లు నాకు జ్ఞాపకం ఉన్నంతలో ఇవి:

"డియర్ మిస్టర్ రావ్, యు వార్ కరెక్ట్! దిబ్రైక్స్ అండ్ అదర్ థింగ్స్ ఆర్ ఓన్లీ ఎ స్టైయిల్ ఆఫ్ రైటింగ్. బట్ ది ఈటింగ్ ఆఫ్ మీట్ బై బుద్ధ ఈజ్ ఎ ఫాక్ట్."

అప్పట్లో ఈ కార్డును విజయవాడలో ఉన్న కంభంపాటి సత్యనారాయణ- సీనియర్- గారికి పంపటం వలన ఇపుడు అమూల్యంగా భావించుకోదగిన ఆ జాబు నా వద్ద లేకుండా పోయింది.

ఇదొక్కటే రాహుల్జీతో నాకున్న వ్యక్తిగతానుబంధం. మూడున్నర దశాబ్దాలు గడచినా మరుపుకు రాని సాహిత్యానుబంధం. అంతేకాదు, ఓ జిజ్ఞాసాపరుడైన కుర్రాడికి ఆ మహావ్యక్తి ఇచ్చిన ఉత్సాహం, ప్రోత్సాహం, వగైరాలన్నీ కూడా ఆ నాలుగు లైన్ల పోస్టు కార్డులోనే ప్రతిఫలిస్తాయని గుర్తించాలి.

పైగా అప్పటి కాయన వయసు 63-65 అని కూడా గమనించాలి.

ఆ తరువాత రాహుల్జీ పుస్తకాలింకెన్నో తెలుగులో వచ్చాయి. అని చదివి నపుడల్లా మన సమాజ పరిణామ చరిత్ర మరింత చక్కగా ఒక అవగాహ నానుసారంగా అర్థం అవుతూ, వంటపడుతూ వచ్చింది. చరిత్ర గ్రంథాలు చదివితే, బట్టీపడితే వచ్చే జ్ఞానం కాదది. పైగా అది ప్రామాణికమైన, రాహుల్జీ స్వీయ పరి శోధనల ఫలితమైన చరిత్ర.

ఆ చరిత్ర పరిజ్ఞానం, సాంఘిక పరిణామ క్రమం మనలో జీర్ణించుకు పోబట్టే మనం ఈనాడిలా ఉన్నాం.

అందుకే రాహుల్జీ మనలో, మనందరిలో ఉన్నాడనటం.

"ధన్యజీవి" అంటారే! ఆ మాట అక్షరాలా వర్తించే మహానుభావుడు, సాహిత్య వాచస్పతి త్రిపిటకాచార్య, మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్.

"పద్మభూషణ్" అనేది కేవలం ఆయనకో బిరుదు మాత్రమే. వాస్తవంలో ఆయన మేలు జాతి "భారతరత్నం"!

ఆయన మన వాడే కావటం మనకు గర్వకారణం!

# రాజకీయ స్థిర దృష్టి కొరవడిన పరిశీలన




1947 ఆగస్టు 15న జరిగిన అధికార మార్పిడితో అధికారంలోకి వచ్చిన కాంగ్రెసు పార్టీ, సామ్రాజ్యవాద అనుకూల విధానాలనే అనుసరించుతూ వచ్చింది. భారత ప్రజల జాతీయ భావాలనూ, ఆకాంక్షలనూ పెడమార్గం పట్టించి, సామ్రాజ్య వాదులకు సేవ చేసేందుకు మోసపూరిత నినాదాలను చేపట్టింది. "సోషలిస్టు తరహా సమాజ స్థాపన", "ప్రణాళికా బద్ధ అభివృద్ధి", "మిశ్రమ ఆర్థిక వ్యవస్థ", "స్వావలంబన" వంటి ప్రజాకర్షక నినాదాల హోరుతో 1956 పారిశ్రామిక విధానం, ఎం.ఆర్.టి.పి. చట్టం, ఫెరా చట్టం వంటి తళుకు బెళుకుల చర్యలతో సామ్రాజ్య వాద అనుకూల విధానాలను అమలు జరుపుతూ వచ్చింది. ఈ మోసపూరిత నాటకానికి సారథ్యం వహించినది నెహ్రూ. రాడికల్ భావాలతో నింపిన ఉపన్యాసాలతో, సోషలిస్టు సిద్ధాంతంతో ప్రభావితుడైన వాడిగా పోజు పెడుతూ ఈ నాటకాన్ని సాగించారు.

'విదేశీ పెట్టుబడులు దేశం నుండి తరలిపోకుండా స్వాతంత్రమన్న పదానికే అర్థం లే'దన్న నెహ్రూ సారథ్యం లోనే బ్రిటీషు పెట్టుబడులు, పదింతలు పెరగటంతో పాటుగా, అమెరికాతో సహా పశ్చిమ సామ్రాజ్య వాదుల పెట్టుబడులు కూడా పెరిగాయి. ప్రారంభంలో ప్రభుత్వ రంగాన్ని అనుమాన దృక్కులతో పరికించిన అమెరికా ఆ తరువాత ప్రభుత్వ రంగ ఉపయుక్తతను గుర్తించి, తన పెట్టుబడులతో నింపటం మొదలు పెట్టింది. ప్రభుత్వ రంగంలో విదేశీ పెట్టుబడులకు స్థానాన్ని కల్పించడం మొదలయింది.

మరొక వైపున ప్రభుత్వ రంగానికి తానందిస్తున్న సహాయం భారత ఆర్థికాభివృద్ధికి దోహదపడుతున్న దంటూ రష్యా సోషల్ సామ్రాజ్యవాదం రంగ ప్రవేశం చేసింది. కీలక పరిశ్రమలకు సహాయం, రూపాయలలో వాణిజ్యం, సైనిక సహాయం పేరిట భారత ఆర్థిక వ్యవస్థపై పట్టును పొందింది. భారతదేశం రెండు అగ్రరాజ్యాల పోటీ, కుమ్మక్కులకు నిలయమైంది. ఫలితంగా భారత ప్రజల ఆశలకు భిన్నంగా, సామ్రాజ్యవాద దోపిడీ తీవ్రమై అన్ని కీలక రంగాలకూ విస్తరించింది. దేశంలోకి

వచ్చే సామ్రాజ్యవాదుల పెట్టుబడుల కంటే, దేశం నుండి వారు తరలించుకు పోతున్న సంపదలు అధికమయ్యాయి. దీనితో విదేశీ రుణం మోయలేని భారంగా పరిణమించి, పాత రుణాలను తీర్చడానికే అప్పులు చేయవలసిన దుస్థితిలోకి దేశాన్ని పెట్టారు.

ప్రభుత్వ రంగపు తీరుతెన్నులను పరిశీలించిన వారెవరికైనా, అది ప్రైవేట రంగానికి చేసిన సేవగా స్పష్టంగానే కన్పిస్తుంది. దేశ ప్రయోజనాలకు చక్కని పాడియావుగా మనవలసిన ప్రభుత్వ రంగాన్ని, దేశ ప్రయోజనాల మూతులు బిగియ గట్టి పితికిన పాలను గడసరి ప్రభుత్వం స్వదేశీ, విదేశీ గుత్త పెట్టుబడులకు కుడి పింది. వట్టిపోయిన ఆవును కసాయి కత్తి కెర చేయటానికి బేరాలు సాగిస్తున్నది.

కొద్ది కాలం పాటు కేంద్రంలో అధికారాన్ని నెరిపిన జనతా పార్టీ ఇందుకు భిన్నంగా వ్యవహరించిందేమీ లేదు. రూపాయి, రూబులు మారకం రేటులో అసమాన ఒప్పందం ఎంత నష్టదాయకమో, ఇటీవలే బహుళ ప్రాచుర్యంలోకి వచ్చిన 'రూపాయి-రూబులు మారకం రేటు' ఒప్పందం జనతా ప్రభుత్వ హయాంలో (సోషలిస్టు ఆర్థిక మంత్రి, జనసంఘ్ విదేశాంగ మంత్రి సంతకాలతో) జరిగిందే నన్న విషయం గుర్తుంచుకుంటే భారత పాలక వర్గ పార్టీల స్వభావం తేటతెల్ల మౌతుంది.

ఇందిరాగాంధీ తిరిగి అధికారంలోకి వచ్చిన తర్వాత విదేశీ చెల్లింపుల భారం పెరగటంతో ఐ. ఎం. ఎఫ్ షరతులకు లోబడి రుణాన్ని తెచ్చారు. ఆ షరతుల ప్రకారమే "ఎగుమతులపై ఆధారపడ్డ అభివృద్ధి"ని వ్యూహంగా స్వీకరించారు. విదేశీ రుణాలను తీర్చడానికి ఎగుమతులను పెంచాలన్న పేరిట విదేశీ పెట్టుబడుల ప్రవేశం పైనా, విదేశీ యంత్ర పరికరాల దిగుమతుల పైనా ఉన్న ఆంక్షలను సడలించుతూ వచ్చింది. ధనాఢ్య వర్గాల విలాసాలను తీర్చే సరుకుల ఉత్పత్తిని ప్రోత్సహించింది. స్వేచ్ఛా వ్యాపార మండలాలు. ఎగుమతి మండలాలు, ఎగుమతి ప్రాధాన్య పరిశ్రమలు [FTZ, EPZ, EOU] పేరిట సామ్రాజ్య వాదులకు, బడా బూర్జువాలకూ అనేక రాయితీల నిచ్చింది. వేలకోట్ల రూపాయలు సబ్సిడీల నిచ్చింది. వీటిలో కార్మిక హక్కులన్నింటినీ కాల రాచింది. ఈ విధానాల ఫలితంగా ఐ.ఎం.ఎఫ్ రుణాన్ని తీర్చగలిగామని బాకాలు వాయించుకున్నారు. అయితే గల్ఫ్ దేశాల నుండి భారత శ్రామికులు పంపిన ధనంతో ఈ అప్పును తీర్చారు తప్ప, ఎగుమతులతో సంపాదించి కాదు. ఈ కాలమంతటా ఎగుమతులతో పాటు, దిగుమతులు కూడా పెరిగి వాణిజ్య లోటు పెరుగుతూనే వచ్చింది.

ఈ సమయంలోనే అమెరికా సామ్రాజ్య వాదులు "ఉదార రుణాల"ను తగ్గించి వేశారు. ఇక భారత ప్రభుత్వానికి వాణిజ్య రుణాలే గతి అయ్యాయి. మరొక

పైపున రష్యా తన దోపిడీని విస్తృతం చేయటానికి పూనుకుంది. భారత రుణాన్ని అవసరమైతే డాలర్లలో చెల్లించే ఒప్పందాన్ని రుద్దింది. భారత బడా బూర్జువాలతో కలిసి మిలాఖత్ కంపెనీలు స్థాపించేందుకు చర్యలు తీసుకున్నది. ఐ.ఎం.ఎఫ్, ప్రపంచ బ్యాంకులలో సభ్యత్వానికి ప్రయత్నించటం మొదలెట్టింది. ఇదంతా బ్రెజ్నెవ్ ఆధ్వర్యంలోనే సాగింది. ఇది భారత దేశంపై ఆధిపత్యం కొరకు అగ్ర రాజ్యాల పోటీ తీవ్రతనే కాకుండా, తరువాయి కాలంలో చేపట్టిన "సంస్కరణల" విషయంలో వాటి కుమ్మక్కును కూడా తెలుపుతుంది. వీటి ఫలితంగా విదేశీ రుణం, వాటిలో వాణిజ్య రుణం పెరిగి మరింతగా సామ్రాజ్య వాదుల ముందు మోకరిల్ల వలసిన స్థితి ఏర్పడింది.

కనుకనే ఐ. ఎం. ఎఫ్., ప్రపంచ బ్యాంకును రాజీవ్‌గాంధీ కాలంలో తమ షరతులను మరింతగా పెంచివేశాయి. '21 వ శతాబ్దంలోకి పరుగు' పేరుతో రాజీవ్‌గాంధీ ప్రభుత్వం ఈ షరతులను నల్లేరుపై బండిలా అమలు జరుప పూను కుంది. విదేశీ పెట్టుబడులకున్న అవరోధాలను ఒకటొకటిగా తొలగించ పూను కున్నారు. ఎం. ఆర్. టి. పి, ఫెరా చట్టాలలో మినహాయింపులు యిచ్చారు. సాంకేతిక పరిజ్ఞానం ఆధునికీకరణ పేరిట విదేశీయంత్ర దిగుమతులను పెంచారు. చిన్న పరిశ్రమల రంగానికున్న రక్షణలను తొలగించటం మొదలు పెట్టారు. విలాస వస్తువుల పరిశ్రమలను పెంచారు. వాటికి రాయితీల నివ్వటం ప్రారంభిం చారు. విదేశీ చెల్లింపులలో లోటు పెరిగింది. విదేశీ రుణభారం వడ్డీలు కూడా చెల్లించలేనంతగా పెరిగింది. తిరిగి ఐ.ఎం.ఎఫ్. వద్దకు భిక్షాపాత్రతో వెళ్ళవలసిన స్థితి ఏర్పడింది.

వి. పి. సింగ్, చంద్రశేఖర్‌ల స్వల్పకాలిక ప్రభుత్వాలతో ఏర్పడిన రాజకీయ అస్థిరత్వంతో విధాన నిర్ణయాలు జరిగింది తక్కువేగానీ, ఐ. ఎం. ఎఫ్ కనుసన్నలలో సాగుతున్న ఈ క్రమాన్నే కొనసాగించాయి. పి. వి. నరసింహా రావు ప్రధాన మంత్రి అయిన తర్వాత గత ప్రభుత్వాలు ఆర్థిక వ్యవస్థను ఛిన్నా భిన్నం చేశాయని సాకు చెప్పి, ఐ. ఎం. ఎఫ్ రుణానికి బయలుదేరారు. సహజం గానే ఐ. ఎం. ఎఫ్ ఇంతకు ముందు షరతులలో మిగిలిన వాటిని అమలు జరపమనటంతో పాటుగా, కొత్త షరతులను విధించింది. ఈ షరతులను అమలు జరిపి, దఫ, దఫాలుగా ఐ. ఎం. ఎఫ్ నుండి రుణాలు తెచ్చుకోవటం లోనే గత 20 నెలలుగా ఈ ప్రభుత్వం తలమునకలై వుంది.

'పరాధీన భారతం' గ్రంథ రచయిత జర్నలిస్టుగా ప్రసిద్ధులు. జర్నలిస్టుగా తనకున్న నైపుణ్యంతో పి. వి. నరసింహారావు ప్రభుత్వం తీసుకున్న వివిధ

చర్యలనూ, ఐ. ఎం. ఎఫ్. విధించిన షరతులతో వాటికున్న సంబంధాన్నీ, వాటి దుష్ఫలితాలనూ వివరించారు. విషయ సేకరణకూ, వివరణకూ ఆయన వెచ్చించిన శ్రమ అభినందనీయం.

అయితే రాజకీయ స్థిర దృష్టి కొరవడటంతో మొత్తంమీద చూస్తే, గ్రంథం దిశారహితంగా రూపొందింది. 1947 నాటి నుండి పాలకులు సాగిస్తున్న సామ్రాజ్యవాద అనుకూల విధానాల క్రమాన్నుండి విడదీసి నేటి చర్యలను పరిశీలించారు. దీనితో తప్పంగా ప్రస్తుత ప్రభుత్వంలోనే జరిగినట్లు దురభిప్రాయం ఏర్పడే అవకాశం వుంది. నెహ్రూ ప్లాను కాదనూరు, బొంబాయి ప్లాను అమలు, ప్రభుత్వరంగం మిశ్రమ ఆర్థిక వ్యవస్థనన్నా నిలపటం లేదు వంటి అభిప్రాయాలతో ఈ అవకాశాన్ని మరింతగా పెంచారు. బిర్లా అధ్వర్యంలో రూపొందిన బొంబాయి ప్లానుకు నగిషీలు చెక్కి రూపొందించినదే 1956 నాటి పారిశ్రామిక విధానక తీర్మానం అన్న విషయం రచయిత ఈ గ్రంథంలో ఇచ్చిన ఉల్లేఖనలను బట్టే అర్థమవుతున్నది. వస్తు మార్పిడి పద్ధతిలో వాణిజ్యం ఉత్తమ మని రచయిత అభిప్రాయం ఆశ్చర్యాన్ని కలిగించింది. సామ్రాజ్యవాదుల ఆధిపత్యం క్రింద కొనసాగుతున్న అంతర్జాతీయ వాణిజ్యంలో ఏ వాణిజ్య రూపమైనా దోపిడీకే తోడ్పడుతుంది. వస్తు మార్పిడి వాణిజ్యంలోనూ, రూపాయి వాణిజ్యంలోనూ రష్యా సాగించిన దోపిడీ అందరెరిగినదే. అయినా రచయిత రష్యా సోషల్ సామ్రాజ్యవాదంతో జరిగిన వాణిజ్యం లాభదాయక మైనదిగా భావించటంతో పాటు, వస్తు మార్పిడినే "సంజీవిని"గా సూచిస్తున్నారు.

ఈ గ్రంథానికున్న లోటంతా యిదే. జరుగుతున్న పరిణామాలను వాటి చారిత్రక నైపథ్యంలో చూడ నిరాకరించటం; సామ్రాజ్యవాదానికీ, భారత ఆర్థిక వ్యవస్థకూ మధ్య నున్న సంబంధాల విస్తృతినీ, లోతునూ సరిగా అంచనా వేయలేకపోవటం, వీటి పరిశీలనలో రాజకీయ స్థిరదృష్టి కొరవడటం మూలంగా ఇలా జరిగింది కనుకనే పాఠకులలో స్పష్టమైన సామ్రాజ్యవాద వ్యతిరేక రాజకీయ చైతన్యాన్ని కలిగించటం సందేహాస్పదమే. మార్క్సిజంలో నమ్మకాన్ని ప్రకటించుకున్న రచయిత నుండి, ఇలాంటి అరకొర పరిశీలన రావటం విచారకరం.

పరాధీన భారతం : రచన ; ఎ. బి. కే పేజీలు : 216 వెల ; రు. 25/- ప్రచురణ : పెర్స్పెక్టివ్స్, హైదరాబాద్ ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, 3-3-865. ఆర్య సమాజ్ రోడ్డు ఎదుట, కాచిగూడా, హైదరాబాదు - 500027.

# ప్రేమ లోకం

## —తమ్మినేని అక్కిరాజు

దేవుని దయవల్లే తాను ఎం. ఏ. ఫస్ట్ క్లాస్‌లో గోల్డ్ మెడల్ సంపాదించానని అమ్మా, నాన్న అంటే నిజమేనని నమ్మి భరత్ కుమార్ మరోసారి దేవుణ్ణి తలచుకున్నాడు. ప్రస్తుతం నిరుద్యోగిగా వున్న భరత్, మధ్యతరగతికి చెందిన నీతి సూత్రాలన్నీ వంట బట్టించుకున్నాడు. కాని రెండేళ్ళపాటు ఉద్యోగాన్వేషణలో విసిగి, వేసారిన తర్వాత అతని ఆలోచనల్లో మార్పు లొచ్చాయి.

దేవుడు తనపట్ల ఎందుకిలా ప్రవర్తిస్తున్నాడు? ఇంత చదువూ చదివి నిరుద్యోగిగా వుండాల్సిందేనా? అలా అయితే చదు వెందుకు? చదువు మానేసిన తన మిత్రులు వ్యాపారమో, వ్యవసాయమో చేసుకుంటూ అనుభవం గడించారు. జీవితంలో స్థిరపడ్డారు. కాని తాను? చదువు కొసం కుటుంబం ఆర్థికంగా చితికి పోయింది. తల్లిదండ్రులు బెంగతో సగమయ్యారు. తాను రోడ్లమ్మట తిరుగుతున్నాడు. ఇదంతా తన అసమర్థత అనుకొని భరత్ ఆత్మన్యూనతా భావంతో కుంచించుకుపోతున్నాడు.

దేవుడే వుంటే ఇలా ఎందుకు చేస్తాడు? మరి తన మీద దేవుడు 'శీతకన్ను' ఎందుకేశాడు? ఇలాంటి ప్రశ్నలతో ప్రారంభించి దేవుడి అస్తిత్వాన్ని ఎదిరించ సాగాడు.

ఈ రెండేళ్ళ కాలంలో తాను చదివిన చదువుకూ, బయట సమాజానికి ఎక్కడా పొంతన లేదని గ్రహించాడు. అబద్ధాలాడ కూడదనీ, సత్యమునే పలకవలెను అనే సూత్రాలకూ అబద్ధాలు, అసత్యాలు లేకుండా బతకలేని సమాజానికీ మధ్య లింకు అర్థం కాలేదు. అవినీతిపరుడైన, ఉద్యోగమిచ్చే అధికారికి 'విలువ' 'స్థాయి' ఎలా వచ్చాయి? లంచాల సంస్కృతిని ఏం చేయాలి? భరత్ ఆలోచిస్తున్నాడు.

మన సహజ నిర్మాణంలో ఏదో లోపం వుండటం చేతనే ఈ నిరుద్యోగం, అవినీతి మొదలగు రుగ్మతలు పెచ్చరిల్లుతున్నాయి. ఇది అర్థం చేసుకోడానికి ఎక్కువ కాలాన్ని గ్రంథాలయంలో గడపడం ప్రారంభించాడు. అధ్యయనం కొనసాగించాడు. విషయాలను విశ్లేషణాత్మకంగా అర్థం చేసుకున్నాడు. ఫలితం — భరత్ ఇప్పుడు మారిన మనిషి.

నిరుద్యోగానికి గానీ, ఇతర కష్టాలకు గానీ కారణం దేవుడు కాదనీ, ధనార్జనే ధ్యేయం గల వారిలో మానవ సంబంధాలు మృగ్యమౌతున్నాయనీ, మనిషిని మనిషి ప్రేమించలేక పోతున్నాడని, గ్రహించాడు. పైగా పరస్పరం

దారుణంగా హింసించుకుంటున్నారు. ఈ హింసా రచన లోని భాగాలే.'— దేవుడు, కులాలు, మతాలు అన్న సత్యాన్ని గ్రహించాడు. ఈ జ్ఞానోదయంతో భరత్ ముఖం వెలిగిపోతోంది.

సమాజ స్వరూపాన్ని విడమరచి చెప్పే రచనలు చదవసాగాడు భరత్. గోపీచంద్, కొడవగంటి, చలం, శ్రీ శ్రీ రచనల పట్ల ఇష్టం పెంచుకున్నాడు. వివిధ చారిత్రక అంశాలను పరిశీలించి రాసిన రాహుల్ రచన 'వోల్గా-సే-గంగా' 'సింహ సేనాపతి' మొదలైన రచనలన్నీ పదే పదే చదవ సాగాడు.

ఒకరోజున రాహుల్ రచన 'మధుర స్వప్నం' చదువుతుంటే భరత్ మనోహరమైన ఆలోచనల్లోకి జారిపోయారు. మన సమాజం చాల వెనకబడి వుంది. మనుషుల మధ్య సంబంధాలు ఆర్థిక సంబంధాలుగా దిగజారాయి. వీళ్ళలో ప్రేమ, ఆప్యాయత లేదు. వీరి జీవితానందానికి అడ్డుగోడలుగా కుల మతాలు నిలిచివున్నాయి. రాహుల్ చిత్రీకరించిన ఉన్నత సమాజం వచ్చేనా? అటువంటి సమాజంలో నిరుద్యోగం వుంటుందా? చాలీ చాలని అందీ అందని 'జీతాలు, అసమర్థులకు అందలాలు, అన్యాయాలు, అక్రమాలు, దోపిడీలు - ఆ కుల మత ఘర్షణలు, హత్యలు - కన్నీళ్ళు - కష్టాలు ఇవన్నీ ఉంటాయా? ఉండక పోతే ఆ లోకం ఎలా వుంటుంది?

తనెక్కడున్నాడో భరత్‌కు తెలియడం లేదు. అక్కడ ఎక్కువగా మాటలు వినిపించడం లేదు. ఎవరి పనులు వారు చేసుకొని పోతున్నారు. అందరి ముఖాల్లో కళాకాంతులు తళ తళ లాడుతున్నాయి. కళ్ళు ఆనందంతో మెరుస్తు న్నాయి. ఎవరి ముఖాల్లోనూ విచారం లేదు. శరీరాలు బలంగా, స్ఫుటంగా వున్నాయి. ఎవరి వయసెంతో చెప్పలేని పరిస్థితి. జరామరణాలను జయించే మందు ఏదైనా అక్కడివారు కనిపెట్టారేమో!

పిల్లల్లో క్రమశిక్షణ కనిపిస్తోంది. భాష చాల తక్కువగా ఉపయోగిస్తున్నారు. ప్రతి పనిలోనూ పొదుపు కనబడ్తోంది. 'అవును'—'కాదు' లాంటి చిన్న చిన్న పదాలనే ఉపయోగిస్తున్నారు. అరుచుకోవటాలు, ఆవేశ కావేశాలు, కొట్టుకు చావ టాలు - ఎక్కడా కనబడటం లేదు. యంత్రాలు నిరంతరంగా పనిచేస్తున్నాయి. క్రేన్‌లు పెద్ద పెద్ద బరువులను ఎత్తుతున్నాయి. రైళ్ళు మనో వేగంతో పరుగెడు తున్నాయి. పట్టణాలు గ్రామాలు అని తేడా లేకుండ ఊళ్ళన్నీ పొందిగ్గా కనిపిస్తు న్నాయి. పరిశుభ్రత చెప్పుకో తగ్గట్టుగా ఉంది. ఎక్కడ పెంట కుప్పలు, మురికి గుంటలు కనపడటం లేదు. మనుష్యులు ఒకరితో ఒకరు పోట్లాడుకోవటం లేదు. ఆజ్ఞాపించుకోవటం లేదు. మనుష్యుల 'వేషం'లో కూడ పెద్దగా మార్పులు లేవు.

ఒక మనిషి ఇంకో మనిషిని అదరించి, బెదిరించే పరిస్థితి అక్కడ లేదు. 'నవ్వే' ఒకటే — వాళ్ళ ఎక్స్‌ప్రెషన్. ఆనందమే వాళ్ళ అనుభూతి. ఊరంత తిరిగాడు భరత్. బహుశ భూలోక స్వర్గం అంటే ఇదే కాబోల్ను అనుకున్నాడు. తిరిగి తిరిగి కాళ్ళు నొప్పులు పుట్టాయి. గొంతు తడారిపోయింది. దాహం కోసం ఒక ఇంటి దగ్గర ఆగాడు—

"దాహం" అన్నాడు.

ఒక అమ్మాయి మంచినీళ్ళు యిచ్చింది.

"హమ్మయ్య! బ్రతికించింది" అనుకున్నాడు భరత్ మనస్సులో. ఇదే తమ లోకంలో అయితే ఒక గ్లాసుడు మంచినీళ్ళు యివ్వటానికి ముందు వేసే ప్రశ్న "మీరేంవుల్లు?" - ఈ ప్రశ్నకు జవాబు తెలిసిన తరువాతనే - గ్లాసుతో మంచినీళ్ళు ఇవ్వాలో, దోసిట్లో నీళ్ళు పోయాలో—అంతకి 'అధమ కులం' అయితే 'యిక్కడ నీళ్ళు దొరకవని' చెప్పాలో నిర్ణయించబడేది!....అలాంటి తతంగం ఏమీ లేకుండా - సింపుల్‌గా 'దాహం' అనగానే 'మంచినీళ్ళు' యిచ్చేసింది. తన మనస్సెంతో సంతోషం అయిపోయింది భరత్‌కి.

"ఆమె అందంగా వుంది. మొహం బాగుంది. ముక్కు చాలా బాగుంది".... అని అనుకున్నాడు. అంతలోనే నాలుక కరచుకొని— "ఆడది కనిపించగానే అంగాంగ వర్ణన చేయాలనే బుద్ధి మన లోకంలో కాని వీళ్ళ లోకంలో లేదు. ఇక్కడ ఆడవాళ్ళ అర్థ నగ్న చిత్రాలు కనపడలేదుగా!" అనుకున్నాడు.

ఆమె ఎవరితోనో మాట్లాడుతోంది. అతను కూడ ఆమెతో చనువుగా వున్నాడు. వాళ్ళ మాటలకంటే మనస్సులకే ఎక్కువ భావాలు తెలుస్తున్నట్టున్నాయి. వాళ్ళ ముఖాల్లో నవ్వుల జల్లు....కొన్ని గంటల తర్వాత అతను వెళ్ళిపోయాడు. అతను ఎవరు? ఈమెకు ఏమౌతాడు? వీళ్ళిద్దరూ భార్యా భర్తలా....లేక....? భర్త అయితే యింట్లోనే వుండాలి కదా! అయినా భార్యా భర్తలు అంటిపెట్టుకుపోయే సంప్రదాయం వీళ్ళ దేశంలో లేదా!

....యిలా ఆలోచిస్తూ వుండగా ఒక అందమైన కుర్రాడు - బలంగాను కాస్త పొట్టిగాను వున్నాడు - వచ్చి రాగనే ఆమె ఒళ్ళో వాలిపోయాడు. ఆమె అతని ముక్కు మొహాన్ని చేతులతో ప్రేమానురాగాలతో నిమిరింది. ఇంతకు ముందు వెళ్ళిపోయిన వ్యక్తి పట్ల ప్రవర్తన యితని పట్ల గల ప్రవర్తన ఒకేలాగ వున్నప్పటికీ ఆమె ముఖంలో భావాలు వేరు. ఆ ఆనందం వేరు. ఆ కదలికలు వేరు. ఆమె ఇతడిని ముద్దు పెట్టుకుంది. కళ్ళల్లో ఆనంద బాష్పాలు.

'ప్రేమ'తో ఆ హృదయాలు తడిసిపోయాయి.

కొన్ని క్షణాల తర్వాత—ఆ అబ్బాయి "అమ్మ" అన్నాడు—

అప్పటికి తెలిసింది - వాళ్ళిద్దరు తల్లి కొడుకులని. యిందాకటి అతను భర్త కావచ్చు. కాని వీళ్ళ వయస్సులో తేడా గమనించేటంతగా లేదు. యిలా ఆలోచిస్తూ భరత్ బయటకు దారి తీశాడు ...

నడుస్తున్నాడు.... ఎక్కడికో అతను వెళ్ళిపోతున్నాడు. రోడ్లు రద్దీగానే వున్నాయి. కాని ఏ ఆటంకాలు, ప్రమాదాలు జరగలేదు. కార్లు, బస్సులు,....స్కూటర్లు పరిగెడుతూనే వున్నాయి. అంతలో ఒక తెలిసిన ముఖం కనిపించింది. ఎవరు అతను? అవును తాను యితనిని 'దాహం' యిచ్చిన ఆమె యింట్లో చూశాడు. ఆమె భర్త అతను. కాని ఇప్పుడు అతనిప్రక్కన మరో యువతి ! యీమె ఎవరు ?....యిద్దరు దుస్తులు ఒకే విధంగా వున్నాయి. బహుశ యూనిఫారం అయి వుంటుంది. వీళ్ళిద్దరు ఒకే ఆఫీసులో పని చేస్తున్నారేమో! యిద్దరు కలిసే ప్రయాణం చేస్తున్నారు. వీళ్ళ ముఖాలలో కూడ చెరగనిది ఒక్కటే నవ్వు.

అదంతా ఏదో దేవలోకంలా కనిపించింది. రాత్రి పగలుకు తేడా లేదు అక్కడ. ఎవరి పనులు వారు చేసుకొని పోతున్నారు. సోమరితనంతో కాలాన్ని వ్యర్థపుచ్చే వాళ్ళు అక్కడ ఎవరు లేరు. మన గ్రామాల్లో అయితే సంవత్సరంలో సగం రోజులు పని లేక పేకాట్ల ఆడుతూ, జులాయి పనులు చేస్తూ, ఆడపిల్లల్ని ఏడిపిస్తూ....ఎంతో మంది కనిపిస్తారు. కాని యిక్కడ అలాంటి పరిస్థితి లేదు. ఎవరి పనులు వాళ్ళు వేగంగా, కాలం వృధా కాకుండా, ముఖం మీద నవ్వు చెరగకుండా - చేసుకు పోతున్నారు.

తమ 'పని' పట్ల ఎవ్వరికి అనాసక్తి వున్నట్లు కనిపించలేదు. మన లోకంలో అయితే ఎవడు చేసే పని వాడికే 'బోర్'. ఆ 'పని' చేయటం వలన తన కడుపు నిండుతోందన్న కృతజ్ఞతా భావం లేకపోగా ఆ పని పట్ల వ్యతిరేకతను పెంచుకొని జీవిస్తున్నారు యిక్కడి మనుష్యులు.

ఇక్కడ అందరికి పని ఉన్నది. ఏ పని చెయ్యగలిగేవాడు ఆ పనే చేస్తున్నాడు. పనులన్నీ నిశ్శబ్దంగా సాగిపోతున్నాయి. యూనియన్లు, సమ్మెలు, నాయకులు....లేరక్కడ. అసలు యజమాని ఎవరో, పనివాడు ఎవరో తెలియటం లేదు. ఒకడి శ్రమ ఫలాన్ని మరొకడు గుంజుకోవాలనే ప్రయత్నం లేదక్కడ. అలాంటి ఆలోచనలు వున్న సోమరిపోతులు లేరు. తింటున్నారు - పని చేస్తున్నారు- కొంతమేరకు విశ్రాంతి తీసుకుంటున్నారు. అందరు ప్రశాంత జీవితాలు గడుపుతున్నారు.

ఒకడిమీద ఒకడికి అసూయలు, అనుమానాలు, ద్రోహ చింతనలు, కపట బుద్ధులూ....యిలాంటి కుళ్ళు ఎక్కడా కనిపించటంలేదు. ఒకడి నొకడు దోచుకు

తినే సమాజంలోనే యిలాంటివన్నీ—యిక్కడెందుకుంటాయి! ఇదీ అభివృద్ధి చెందిన సమాజం. ఆర్థికంగా, నైతికంగా ఎంతో ఉన్నత స్థితిలో ఉన్న సమాజం మన లోకంలో ఉన్నట్టు తెలివిలేని సమర్థులు, అసమర్థులైన మేధావులు లేరిక్కడ. తెలివి, సమర్థత ఒకే చోట రాణిస్తున్నాయి. ఇక్కడి మనిషి 'మహోన్నత మానవుడు'. వీళ్ళది 'ప్రేమలోకం'.

ఇక్కడ మనుషుల్ని బాధపెట్టే ఆచారాలు లేవు. పెళ్ళిళ్ళకు, చావులకు మంత్ర తంత్రాల కార్యక్రమం లేదు. నిరుద్యోగులు లేరు. ఉద్యోగం కోసం రికమండేషన్లు, లంచాల పద్ధతులు లేవు. ఉద్యోగాల కోసం తిరిగి తిరిగి 'డబ్బులు' పోగొట్టుకునేవాళ్ళు లేరు. ఉద్యోగాలు యిప్పిస్తామని చెప్పే దళారి సంస్థలు లేవక్కడ.

అక్కడ ఉన్నది ఒక్కటే! 'శ్రమిస్తున్నారు - అనుభవిస్తున్నారు'. ఈ రెంటికీ మించిన విషయాల్లేవక్కడ. వాళ్ళ కష్ట సుఖాలను వాళ్ళ 'శ్రమ సాఫల్యత' లోనే చూస్తున్నారు తప్ప - పరలోకంలోను, పరమాత్మలోను, జ్ఞాన బోధనల్లోను, కాల జ్ఞాన తత్వాల్లోనూ చూడటం లేదు. ఏ తల్లి బిడ్డల పోషణకోసం-కట్టుకున్నవాడి దయాదాక్షిణ్యాలపై ఆధార పడటంలేదు అసలు తల్లి ఎవరో, తండ్రి ఎవరో, పిల్లలెవరో తెలియటం లేదు. 'కుటుంబ భారం' అన్న మాట వాళ్ళ 'డిక్షనరీ'లోనే లేదు.

బ్రతుకు గడవక పదహారేళ్ళ పిల్ల వ్యభిచరించటం లేదు. బ్రతక లేక ఆత్మ హత్యలు చేసుకునేవాళ్ళు లేరక్కడ. సమాజ కుటిల నీతులకు తలవొగ్గి బ్రతికుండి చచ్చి, చస్తూనే బ్రతుకు లీడుస్తున్న జీవశ్చవాలు లేవక్కడ.

రోగాలు....రొష్టులు....డాక్టర్లు....మందులు .... అసలు లేరనే చెప్పాలి. వాటితో పనేమిటి? ఎవరి పనుల్లో వారు ఆనందిస్తున్నారు. అందరి హృదయాలు నిర్మలమైనవి, భవిష్యత్తు వాళ్ళకొక 'కమ్మని కల', 'రేపు ఎలారా దేవుడా!' అని బాధపడేవాళ్ళు లేరక్కడ. 'రేపు' ఎప్పుడు వస్తుందా అన్న కుతూహలమే వాళ్ళలో కనిపిస్తోంది. అందుకే వాళ్ళ శరీరాల్లో రోగ క్రిములు లేవు. అజీర్తి రోగాలు లేవు. గుండె జబ్బులు లేవు. తిన్నదంతా ఒంట బడుతోంది. అంతా రక్తమై తీరుతోంది.

మానవశక్తి అక్కడ అపారంగా ఉపయోగపడుతోంది. 'ఇద్దరు లేక ముగ్గురు' బోర్డులు కనబడటంలేదు. బిడ్డలు ప్రభుత్వ సంరక్షణలో పెరుగు-తున్నారు. అవసరమైన చదువులు చదువుతున్నారు. అభిరుచికి, సామర్థ్యానికి తగ్గ పనుల్లో సెటిల్ అవుతున్నారు. చూడాలనుకున్నప్పుడు తల్లిదండ్రులను చూడ టానికి బిడ్డలు వస్తున్నారు. ఆనంద పారవశ్యంలో ఆ 'తల్లి' వారిని కౌగిలించు కుంటోంది. ముద్దు పెట్టుకుంటోంది. గోముగా తల నిమురుతోంది. ఎక్కడ పని

చేస్తున్నప్పటికి భార్యా భర్తలు ఒకరి నొకరు కలుసుకోగలుగుతున్నారు. సుఖానికి నిర్బంధం లేదక్కడ. 'సంఘ లాభం' కోసం 'వ్యక్తిత్వాను రాగాలు' ఉన్నాయి తప్ప, 'వ్యక్తి లాభం' కోసం 'సంఘ పతనం' కాలేదక్కడ.

ఇదంతా చూసి భరత్ తెగ ఆనంద పడిపోయాడు. తనలాంటి వాళ్ళకు యిలాంటి సమాజంలో మంచి స్థానం ఉందనుకున్నాడు. ఈ లోకానికి రావాలంటే 'దారి' ఏమిటా అని ఆలోచించాడు. తన నిరుద్యోగాన్ని చూచి నవ్వే వాళ్ళుండరు. అసలు నిరుద్యోగమే వుండదు. అందరికి పనులున్నాయి. ఎవరి పనులు వారు చేసుకు పోతున్నారు. 'డబ్బు' కోసం ఎవ్వరూ ఏపనీ చెయ్యటంలేదు. ఉత్పత్తికి-వంపిణీకి మధ్య ఎలాంటి 'దళారీలు' లేరిక్కడ.

ఇక్కడ ఎంత హాయిగా వుంది! ఎవరి శ్రమఫలం వారు తింటున్నారు. మిగిలిన 'ఫలాన్ని' సామాజిక అవసరాలకు నిలవచేస్తున్నారు. అందరు అందరి కోసం బ్రతుకుతున్నారు. వాళ్ళ 'నిఘంటువు' ఏభై పేజీలకు మించలేదు. చాలా తక్కువ మాటలతోనే సమస్తాభిప్రాయాలను వెల్లడించుకుంటున్నారు.

స్వేచ్ఛా స్వాతంత్రాలు, సుఖ సంతోషాలు, ప్రేమాభిమానాలు, శాంతిసామరస్యాలు....ఇవే ఎక్కడ వెతికినా కనిపించేవి. వాళ్ళంతా మానవులుకాదు - మహామానవులు - ఆధీమాలోనే వాళ్ళు జీవిస్తున్నారు. మానవశక్తిని ఉపయోగిస్తూ ప్రకృతి శక్తుల్ని లొంగదీసుకునే కార్యక్రమంలో నిరంతరం కృషి కొనసాగిస్తున్నారు.

భరత్ ఆనందం అవధులు దాటిపోయింది. తాను ఎక్కడ నడుస్తున్నాడో కూడా మరచిపోయాడు.

కారు హారన్ వినిపించింది -

ఇంతవరకు లేని గొడవ ఇదేమిటా అనుకున్నాడు. ఆలోచనల నుండి తేరుకుని చూసాడు. తాను రోడ్డుకు అడ్డంగా నడుస్తున్నాడు. తనకు ముందు, వెనుక కొన్ని వందల కార్లు, బస్సులు, మోటారు వెహికిల్సు....ట్రాఫిక్ జామ్. క్షణకాలం భయపడిపోయాడు భరత్. రోడ్డు మీద గీతలుగీసి వున్నాయి. ఆ 'డైరెక్షన్స్' ప్రకారం ఫుట్ పాత్ సీదికి జాగ్రత్తగా తప్పుకున్నాడు. కొన్ని క్షణాల్లోనే ట్రాఫిక్ క్లియర్ అయిపోయింది.

ఏ లారీవాడు తనను బూతులు తట్టలేదు. కొట్టలేదు. అదృష్టం - ఇదే మా ఊళ్ళో అయితే - ఆలోచన వెంటనే ఆపేశాడు. ఇంతలో ఒక కానిస్టేబుల్ అక్కడికి వచ్చాడు. భరత్ గుండెల్లో రాయి పడింది - తనను స్టేషన్‌కు తీసుకెళతాడేమో! తనకు పెద 'ఇన్‌ఫ్లూయన్సు' లేదు. బడా నాయకుడు కాకపోయినా-కనీసం ఓ ఛోటా

నాయకుడు కూడా తనకు తెలవదు. లంచం పెడదామంటే జేబులో కనీసం రెండు రూపాయలు కూడా లేవు. తన పని అయిపోయిందనుకున్నాడు. రాత్రి తెల్లవార్లూ 'పోలీసు లాకప్' తప్పదనుకున్నాడు. అయితే తను భయపడిందేమీ జరగలేదు. ఆ కానిస్టేబుల్ తిన్నగావచ్చి అతని చేతిలో 'రోడ్డు రూల్స్' పేపరు పెట్టి వెళ్ళిపోయాడు. అది తన 'అదృష్టం'గా భావించాడు భరత్. 'థాంక్‌గాడ్' అనుకున్నాడు. కాళ్ళు చేతులు క్రమంగా ఒణుకు తగ్గాయి. ఇప్పుడు దానిలోని రూల్స్ ప్రకారమే నడక ప్రారంభించాడు.

ఇంతలోనే మరో ప్రమా(మో)దం. ఒక 'హాసిని' తన చెయ్యి పట్టుకుంది. భరత్ బెంబేలు పడిపోయాడు. 'బేర్' మని అరిచాడు. ఆమె మాత్రం ఏమీ కంగారు పడలేదు. చిరునవ్వు నవ్వుతూ "ఎక్కడికి వెళ్ళాలి?" అని అడిగింది. "మా ఊరు" అన్నాడు భరత్. o o o

కళ్ళు తెరిచాడు. తాను ఎక్కడున్నాడు? తన పడక కుర్చీలోనే! రాహుల్ రచన 'మధురస్వప్నం' తన గుండెల మీదే వుంది. నేనింతవరకు కలగన్నానా? ఎంతటి 'మధుర స్వప్నం'! యింత కమ్మని కలకు కారణం! తన చేతిలోని పుస్తకాన్ని ముద్దు పెట్టుకున్నాడు.

ఇంతలోనే భరత్‌ను 'విషాదం' చుట్టు ముట్టింది. తానిప్పుడు మళ్ళీ మామూలు లోకంలో వింతమనిషి. ఇక్కడ అంతా అసంబద్ధం. అనాగరికం. క్రమశిక్షణా రాహిత్యం - మళ్ళీ వింత చూపులు, అప్లికేషనులు, రికమండేషను....నిరుద్యోగం 'ఛీ ఛీ' అనుకున్నాడు.

అంతలోనే ఒక ఆలోచన తళుక్కుమన్నది. "వెళ్ళాలి - వెళ్ళి తీరాలి-తాను కలగన్న ప్రేమ లోకానికి తప్పకుండా వెళ్ళాలి" అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా ప్రయాణ సన్నాహాలు ప్రారంభించాడు.

---

— హిందూస్థానీ — కర్నాటక సంగీతాలకు 'ఆర్యన్ మ్యూజిక్' అని కొత్త పేరు వస్తుంది.

— ముస్లింప్రభావంతో హిందూస్థానీ సంగీతంలో ప్రవేశించిన 'ఖయాల్' అదృశ్యమౌతుంది. దాని స్థానాన్ని 'దుప్రద్—ధామర్' ఆక్రమించవచ్చు.

— అప్పుడు అమీర్‌ఖాన్, అల్లాదియాఖాన్, బడే గులాం అలీ ఖాన్, అబ్దుల్ కరీం ఖాన్ రికార్డులు దొరకవు.

— భీమ్‌సేన్ జోషీ, కిషోరి అమోంకర్, ప్రభా అత్రేలు ముస్లిం సంగీతంలో ప్రావీణ్యం సంపాదించినందుకు విచారించాలి.

— కథక్ కూడా ఖయాల్‌లాగా అదృశ్యమౌతుంది.

(పదాన్ త్రివేది 'ది ఇండిపెండెంట్' 16-2-93)

# రాహుల్ సాంకృత్యాయన్: సుధూర స్మృతులు

— డా. సంజీవ దేవ్

కనిపించటం వేరు, వుండటం వేరు.

వస్తువులు, చెట్లు, జంతువులు మొదలైనవి కనిపించినట్లుగానే వుంటాయి.

మనుషుల విషయం వేరు. వారిలో అధిక సంఖ్యాకులు కనిపించటం ఒక విధంగా వుంటే వుండటం మరో విధంగా వుంటారు.

ఒక అస్తిత్వం కనిపించటాన్ని మనం చూస్తాం, కాని అది వుండటాన్ని మనం చూడ లేం.

కనిపించటాన్ని చూస్తాం, వుండటాన్ని కొన్ని తీరుల ద్వారా తెలుసు కుంటాం.

రాహుల్ సాంకృత్యాయన్ కనిపించినట్లుగానే వుంటాడు కూడ. కనుక ఆయన్ను మనం చూడటం తెలుసుకోటం కూడ ఒకటే.

ఒక విధంగా కనిపిస్తూ మరో విధంగా వుండడు. ఒక విధంగా వుంటూ మరో విధంగా కనిపించడు.

తన ఆలోచనల ననుసరించే తన ఆచరణ లుంటాయి.

రాహుల్‌జీ సామాన్య మానవుడు.

రాహుల్‌జీ అసామాన్య మానవుడు.

ఆయనతో నేనున్న జ్ఞాపకాలు, నాతో ఆయన వున్న జ్ఞాపకాలు ఎన్నో వున్నాయి. అవన్నీ ఆయనలో ఇప్పుడు లేవు; కారణం ఆయన ఇప్పుడు లేడు. అవి నాలో ఇప్పుడున్నాయి; కారణం నేనిప్పుడున్నాను కనుక.

వుండటానికి జ్ఞాపకాలెన్నో వుంటాయి కాని వున్న జ్ఞాపకాలన్నీ అక్షర రూపం దాల్చటం కష్టం.

ఈ జ్ఞాపకాలు ఘటనల రూపాల్లో వున్న రోజుల్లో రాహుల్‌జీ కంటె వయసులో నేను చాలా చిన్నవాణ్ణి. అయినప్పటికీ తనను నాకంటే పెద్దవాడిగా చూచేవాడు కాదు ఆ పెద్ద మనిషి. పెద్ద మనిషి కాదు పెద్ద మనీషి ఆయన.

రాహుల్‌జీకి అప్పటి బెజవాడలోని సి. వి. ఆర్ కాలేజీ ప్రిన్సిపాల్ డా. పుట్టపర్తి శ్రీనివాసాచారి మిత్రుడు. వారిద్దరు ఒకప్పుడు లండన్‌లో వుండే వారు. శ్రీనివాసాచారి గారికి నేను మిత్రుణ్ణి. కనుక రాహుల్‌జీ నాకు మిత్రుడు.

1944 వేసవి ప్రారంభంలో బెజవాడలో కమ్యూనిస్టు పార్టీ వారు అఖిల భారత కిసాన్ మహాసభలు జరిపారు. ఆ సందర్భంగా ఆహ్వానించబడి బౌద్ధ

విద్వాంసుడైన కమ్యూనిస్టు రాహుల్‌జీ బెజవాడ రావటం జరిగింది. ప్రిన్సిపాల్ గారు నన్ను బెజవాడకు తీసుకపోయి తమ ఇంట రాహుల్‌జీతో నాకు మైత్రి కుదిర్చారు.

నా మొదటి చూపులో రాహుల్‌జీ నాకు మనిషిగా కాక మాట్లాడుతున్న పాలరాతి బౌద్ధ విగ్రహంగా గోచరించారు.

ఆయన్ను గురించి ఎప్పటినుంచో తెలుసు కాని ఆయన్ను తెలియదు అప్పటివరకు. ఆయన రూపం, రంగు, స్వభావం, మాటలు, భావభంగిమలు ముఖంలో వెలుగుతున్న ప్రజాదీప్తి మొదలైనవన్నీ నాలో ఒక అపరిచిత అనుభూతిని రేకెత్తించటంలో సఫలమైనాయి.

డా. శ్రీనివాసాచారి గారు ఆయన్ను నాకు పరిచయం చేయకుండా నన్నే ఆయనకు పరిచయం చేశారు, కారణం రాహుల్‌జీ జగ మెరిగిన మనీషి. మరి నేనో.........?

నేను ఆయనతో ఎక్కువగా హిందీలోనే మాట్లాడాను. అవసరమైతే తప్ప ఆయన ఇంగ్లీషులో మాట్లాడాడు. ఎక్కువగా హిందీలోనే జరిగేది మా సంభాష ణంతా. విచిత్రం ఏమిటంటే హిందీ మాతృభాష కాని నేను హిందీలో త్వర త్వరగా మాట్లాడుతుంటే రాహుల్‌జీ చాలా నిదానంగా మాట్లాడేవారు.

అందువల్ల నాకనిపించింది నాకు సరీగా హిందీ రాదేమో అని; బాగా వచ్చి వుంటే ఆయన మాట్లాడినట్లు నేను కూడ మెమ్మదిగా నిదానంగా మాట్లాడే వాడినే గదా అని. భాష బాగా రానివాళ్ళు ఆ భాషను వేగంగా మాట్లాడుతారని నమ్మేను.

మా యిద్దరికీ త్వరలో మైత్రి కుదరటం గమనించిన ప్రిన్సిపాల్ శ్రీనివాసా చారిగారు లోలోపల సంతసించటమే కాక పైపైన సంతసించటం మాకు కనిపించింది.

బెజవాడనుంచి రాహుల్‌జీ నేను ఒక మధ్యాహ్నానంతరం రైల్లో తుమ్మపూడి మా ఇంటికి చేరుకున్నాం. ఆంధ్రదేశపు గ్రామాలను, గ్రామీణులను, గ్రామాల్లో జీవన రీతులను, వ్యవసాయంలో చేసే విధానాలను చూచి ఆయన ఎంతో ఆనందిం చారు.

ఆయన భోజనాన్ని గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకునే అవసరం వుండేది కాదు. మన ఇళ్ళలో దొరికే కాయకూరలను, ఆకు కూరలను, ఆవకాయ, పూరగాయ

---

— శాంతియుత పోరాటంలోని మార్గాలన్నీ విఫలమైనప్పుడు, పరిమితం చేయ బడినపుడు, దౌర్జన్యకాండ కొనసాగుతున్నపుడు మాత్రమే కమ్యూనిస్టులు ఆత్మ రక్షణకోసం దౌర్జన్య విధానాన్ని బలపరుస్తారు —రాహుల్జీ.

లను అన్నీ సంతృప్తిగా తినేవారు. ఆయనకు ఏ దేశమూ పర దేశం కానట్లే, ఏ దేశ వాసీ పరదేశి కానట్లే, ఏ భాషా పరాయి భాష కానట్లే ఏ భోజనం కూడ పర భోజనం కాదు.

ఆ రాత్రి ఇంటివద్ద వసంతాకాశం క్రింద నక్షత్ర కాంతిలో ప్రొద్దుపోయే దాకా ఆకాశంలోని విషయాలు, భూమి మీది విషయాలు, ప్రాచీన, అర్వాచీన విషయాలు-ఎన్నో మాట్లాడుకుంటూ పడుకున్నాం.

ఇంటిలోని మా పెదతల్లి అపుడపుడు మా వద్దకు వచ్చి కొన్ని నిమిషాలు నిలబడి ఒక నిమిషంలోని మా మాటలు కూడ ఆమె తెలుసుకోలేక వెళ్ళిపోయేది.

రష్యాలోని తన రష్యన్ భార్యను గురించీ, తమ పసి అబ్బాయిని గురించీ చెప్పటంలో ఆయన కెంతో సంతోషం కలిగేది. వాళ్ళను గురించి చెపుతుంటే వాళ్ళు తన సమక్షంలో వున్నంత సంతృప్తిని పొందేవారు ఆయన.

తుమ్మపూడిలో వున్న కొన్నాళ్ళలో ఆయన కొన్ని ప్రక్క వూళ్ళలో రష్యాలో వ్యవసాయాలను గురించీ, సామాజికాలను గురించీ హిందీలో ప్రసంగాలు చేస్తుంటే నేను తెలుగులోకి అనువదించి చెపుతుండేవాణ్ణి.

ఈ విధంగా మా తుమ్మపూడి నివాసం పూర్తి అయి ఇక అమరావతి, నాగార్జున కొండ మొదలైన బౌద్ధ కేంద్రాలను, వాటిలోని శాతవాహనుల, ఇక్ష్వాకుల శిల్ప సంపదను ఆయనకు చూపటానికి ఆయనను వెంట పెట్టుక వెళ్ళాను.

ఆయనతో కలిసి ప్రయాణం చేయటం అంటే ఒక లైబ్రరీలోని పుస్తకాలను తిరగవేస్తున్నట్లుంది. ఒక విశ్వ విద్యాలయంలోని ప్రొఫెసర్ల ఉపస్థితిలో కూర్చొని వారి జ్యోతిర్మయ భాషణలను ఆలకిస్తున్నట్లుంటుంది, ప్రాజ్ఞులతో సంభాషణలను జరుపుతున్నట్లుంటుంది.

మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్ త్రిపిటకాచార్యలోని విశిష్టతలను తెలియని వారుంటారేమో తెలియదు. ఒకవేళ వుండి వుంటే అటువంటి వ్యక్తుల లోని విశిష్టత ఏమిటని ఎవరైనా ప్రశ్నిస్తే వచ్చే జవాబు ఏమంటే "రాహుల్‌జీని గురించి తెలియక పోవటమే ఆ విశిష్టత" అని.

రాహుల్‌జీ విశిష్టతను గురించి ఒక్క మాటలో చెప్పాలంటే "మనలో వున్నవన్నీ రాహుల్‌జీలో వున్నాయి కాని రాహుల్‌జీలో వున్నవన్నీ మనలో లేవు" అని.

మొదటి నుంచీ ఆయన స్వేచ్ఛావాది, సంప్రదాయ విరోధి. మొదటగా వేదాధ్యయనంతో ప్రారంభమైన ఆయన జీవితం ఆర్య సమాజం లోకీ, తరువాత

విశిష్టాద్వైతంలోకి మారుతూ వచ్చి తరువాత బౌద్ధంలో ప్రవేశించి అందులో వుంటూనే కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశించింది. కమ్యూనిస్టు పార్టీలో వుంటూనే ఆయన గొప్ప బౌద్ధ పండితుడుగా రూపొంది పాళీ భాషలోని బౌద్ధ "త్రిపిటకాలు"ను హిందీలోకి అనువదించి ఆ రంగంలో విఖ్యాతుడైనారు. ఆయన కెన్నో ఎన్నో భాషలు తెలుసు. ఆయన బాషావిజ్ఞుడు (Linguist) మాత్రమే కాదు, భాషాశాస్త్రజ్ఞుడు (Philologist) కూడా. ఎన్నో భాషలు తెలిసినట్లుగానే ఎన్నో భాషల మూలాలు, వాటి వికాసాలు, వాటి వాటి వ్యాకరణ మర్మాలు, భాషలలోని పారిభాషిక పదాలు, లిపి వున్న భాషల వచనా పటుత్వం, లిపి లేని భాషల వాగ్ధోరణి మొదలైన విశిష్ట విషయాల కదిలే విజ్ఞాన సర్వస్వం ఆయన.

నాగార్జున కొండ ప్రాంతంలోని పుల్లారెడ్డి గూడెం అనే ఒక చిన్న గ్రామంలో మేము బస చేశాం. అక్కడ ఒక కొద్దిపాటి లంబాడీ తండా నివసిస్తుంది. రాహుల్‌జీ గౌరవార్థం ఆ లంబాడీ వనితలు ఆ రాత్రి తమ నృత్యాన్ని ప్రదర్శించారు, తపెట్ల వాద్యాల మధ్య. లంబాడీ వనితలు లయ మయ నర్తన రీతుల వలెనే లంబాడీ పురుషుల శ్రావ్యమైన వివిధ తాళ వరసల తప్పెట దరువులు కూడ ఎంతో ఆనందం ఇచ్చాయి.

ఆ నృత్య ప్రదర్శనానికి రాహుల్‌జీ బాగా స్పందించారు. వాళ్ళ భాష ఏమై వుంటుందని ప్రశ్నించగా అపభ్రంశ మరాఠీ అయి వుంటుందేమో అని అన్నాను నేను. వాళ్ళను సంభాషించి వాళ్ళ సంభాషణలు శ్రద్ధగా విని వాళ్ళతో సంభాషణ సాగించారు వాళ్ళ భాషలో. వినేవాళ్ళు ఆశ్చర్యపోయారు. లంబాడీ భాష ఆయన కెట్లా తెలుసునా అని అందరి ఆశ్చర్యం. అది గ్రహించి ఆయన చెప్పసాగేరు "వీళ్ళ భాష అపభ్రంశ మరాఠీ కానీ మరొకటి కానీ కాదు, అది గుజరాత్ రాజస్థాన్‌ల సరిహద్దు ప్రాంతపు భాష, కొంత మార్పుతో. ఆ భాషలు వాళ్ళు ఎక్కడెక్కడ పగులగొట్టి మాట్లాడుతున్నారో గ్రహించిన నేను కూడా దాన్ని అదే మాదిరి పగులగొట్టి మాట్లాడితే అది వాళ్ళకు అర్థం అయింది, వాళ్ళ మాటలు నాకూ అర్థమయ్యాయి" అని.

ఆయన భాషా ప్రతిభ అత్యద్భుతం అని మేము ఆశ్చర్య పడకుండా వుండలేకపోయాం! అటువంటి ప్రజ్ఞాజ్వాల ఆయనలో వెలుగుతుండేది!!

తుమ్మపూడి నుంచి మేం ముందుగా పోయింది అమరావతి. అమరావతిలోని శాతావాహనుల శిల్పా విశేషాలను, బౌద్ధ శిథిల స్తూప సంపదను మేము అనుశీలించటం వీలైనంత తొందరగా పూర్తి చేసుకున్నాం.

బౌద్ధ కేంద్రాల్లో అమరావతి స్తూప ప్రాధాన్యం కలది. బౌద్ధ వాస్తు నిర్మాణాల్లో చైతన్యం, విహారం, స్తూపం అనే మూడు ప్రముఖమైనవి. చైత్యం అనేది బౌద్ధ భిక్షుల ధ్యానమందిరం: ఇందులో వీరంతా తమ సాధనకు సంబంధించిన ధ్యానాన్ని చేస్తారు. చైత్యం అంటే వీరి అంతర్ జీవితాన్ని గడిపే కట్టడం. విహారం అంటే బౌద్ధ భిక్షులు సామాన్యమైన దైనందిన జీవితాన్ని గడిపే ఆవాసం. ఇక స్తూపం అంటే వీరి మరణానంతరం నిర్మించే సమాధి.

స్తూప ప్రశస్తిని పొందింది అమరావతి.

రాహుల్‌జీలో కళాసక్తి కంటే శాస్త్ర శక్తి ఎక్కువ పదును కలిగి వుంటుంది. శిల్పాన్ని చూచి దాని రూప సౌందర్యాన్ని ఆనందించటం అంటే, దాని కొలతలు, దాని కాలం, అది నిర్మితమైన మాధ్యమం, అది ఎందుకు రూపొందింది మొదలైన వివరాలు ఆయనకు ముఖ్యం. అంటే ఆయనలో ప్రధానంగా నివసించేది కళాకారుడు కాక శాస్త్రజ్ఞుడే. ఆయన దృష్టి ప్రధానంగా విశ్లేషణాత్మకం సంశ్లేషణాత్మకం కంటే,

ఆయనలో ప్రధానంగా వెలిగేది రస దీపం కాదు, విజ్ఞాన జ్వాల, జిజ్ఞాస తృష్ణ. అతికించి చూడటం ఆయన రంగం కాదు, పగుల గొట్టి చూడటం ఆయన పని. ఎట్లా వున్నది అనే దానికంటే ఏమి వున్నది అనేది ఆయన్ను నడుపుతుంది. సౌందర్యం కంటే ఉపయోగం ఆయనకు ఎక్కువ ఉపయోగమైంది.

పర్యవసానం ఏమంటే ఆయన జీవించటానికి తింటాడు కాని తినటానికి జీవించడు. అందుకని ఆయన ఆనంద జీవి కాదా అంటే ఆనంద జీవే అనాలి. ఆయన ఆనందం స్పందిస్తుంది- సత్య సాధనలో, సత్య శోధనలో.

పలనాడులోని పుల్లారెడ్డి గూడెంలో మేము ఇద్దరం ఒక మట్టి మిద్దె మీద నిద్రించాం. వేసవి ప్రారంభ దశలో అంతగా వేడిగా కాని, చలిగా కాని లేక సమ శీతోష్ణంగా ఉన్నందున మాకు హాయిగా నిద్రపట్టింది. ఆ రాత్రి లంబాడీలు చేసి ఇచ్చిన వేడి వేడి జొన్న రొట్టెలు ఆకుకూరతో కలిపి, మధ్య మధ్య కాల్చిన మిరప కాయలు కొరుకుతూ సంతృప్తిగా తిని చిక్కని మజ్జిగ త్రాగి పడుకున్నాం.

రాహుల్‌జీ చాలా రాత్రి వరకూ తన జీవితగాథ, ఒంటరిగా కాలినడకతో టిబెట్ ప్రయాణాలు, హిమాలయ సాంద్రారణ్యాల మధ్య గుండా రావటాలు పోవటాలు, కొండ నెక్కటాలు, లోయలోకి దిగటాలు, ఆ సమయాల్లో కలిగే ఖేదాలు మోదాలు మొదలైన వన్నీ ఒకోసారి పెద్దగా నవ్వుతూ, మరోసారి తనలో తాను నవ్వుకుంటూ, ఇంకోసారి గంభీర రూపంలో చెప్పి ముగించారు.

తన జీవితాన్ని గురించి తనకే ఆశ్చర్యం వేస్తుందట అప్పుడప్పుడు. భారతీయుల జీవితాలు ప్రథమంలో బ్రహ్మచర్యంతో ప్రారంభించి గృహస్తంలోకి మారి, అంచులో

నుంచి వానప్రస్థంలో ప్రవేశించి అంతంలో సన్యాసంలోకి అడుగుపెట్టి ఆగి పోతుంది.

అయితే తన జీవితం అందుకు తలక్రిందులుగా పరిణతి చెందిందట. తాను మొదటిలో సన్యాసి అట. తరువాత కొండలు కోనలు అరణ్యాలు తిరుగుతూ వాన ప్రస్థ జీవితాన్నీ అటు తరువాత గృహస్థ జీవితాన్నీ గడుపుతున్నాడు. "ఇక గడప బోయేది బ్రహ్మచర్యం" అంటూ పెద్దగా నవ్వి "బాగుంది కదూ" అంటూ నా వీపు చరిచాడు.

అందుకు నేను అన్నాను "అసలు జీవన క్రమం అదేనేమో, మీరు గడుపు తున్న క్రమ పద్ధతే సక్రమ పద్ధతేమో. దాన్నే అందరూ అనుసరించాలని నేనను కాని ఆ విధంగా మీరు అనుసరించటాన్ని నేను హార్ధికంగా ఆమోదిస్తాను, అందుకు మిమ్ములను అభినందిస్తాను, జీవితంలో మీరు పెంచుకున్న మీ మన్ను మీది ఆశ లను, మిన్ను మీది ఆశయాలను ఆరాధిస్తాను.

మరుసటి పగలంతా కాళ్ళు నొప్పులుగా అనిపించేంత వరకు ఆ సమతలం కాని ప్రదేశాన్నంతా కలియ తిరిగాం, కంటికి కనిపించిన దాన్నంతా కలియ చూచాం, ఆస్వాదించాం, కనిపించని దాన్ని గురించి ఆలోచించాం, సమాలోచించాం.

మావి కొన్ని అన్వేషణలు, గవేషణలు, తార్కిక చర్చలు మొదలైనవి చరిత్రను అనుమానించాయి. చరిత్రకు పూర్వ యుగంలోని వాస్తవాలను చరిత్ర తెలుసుకోజాలదు; వాటిని తెలుసుకోవలసింది పురాతత్వ శాస్త్రం. ప్రథమ చరిత్ర యుగం (**Proto-history**) లోని విషయాలను గురించిన వాస్తవాలు కూడా చరిత్ర కందవు, అప్పటికి చారిత్రక పరిశోధన వికసించ లేదు కనుక. ఇక చరిత్ర యుగం లోనివి కూడా అంతగా నమ్మటానికి వీలుండవు. కారణం అప్పటి చరిత్ర కారుల పరిశోధనల మీద కూడ వస్తుగత హేతువాదానికంటే వ్యక్తిగత విశ్వాసాలు ప్రాబల్యాన్ని కలిగి వున్నాయి కనుక.

ఈపై అనుమానాలను బట్టి చూస్తే, భూతకాలపు వాస్తవాలను తెలుసుకోటా నికి ఎక్కువ వాస్తవమైన ఆధారం పురాతత్వ శాస్త్రమే అని రాహుల్‌జీ తన అభి ప్రాయాన్ని వ్యక్త పరచారు. పురాతత్వ శాస్త్ర పరిశోధనకు బలమైన ఆధారాలు శిల్ప కళకే అని కూడ ఆయన అభిప్రాయం. అమరావతిలోని శాతవాహన బౌద్ధ శిల్పాలు ఎంతో ప్రముఖమైనవని కూడ ఆయన అభిప్రాయ పడ్డారు. ఈ విషయంలో ఇంతవరకు జరిగిన పరిశోధనలు ఆంశికాలేకాని సమగ్రాలు కావని ఆయన అభి ప్రాయం. జరిగింది కొద్ది, జరగాలసింది చాలా ఎక్కువ వున్నదని ఆయన అన్నారు.

ఆంధ్ర బౌద్ధ కళలో చాలా లలితమైనవనీ, అభివ్యక్తి మూలకమైనవనీ, నిర్మాణాత్మకంగాను (**Structurally**), ఉపయోగాత్మకంగాను (**Functionally**)

కూడా అవి ఎంతో ఔన్నత్యాన్ని అందుకొన్నవని కూడ ఆయన అభిప్రాయపడ్డారు. ఆయనొక్కరి అభిప్రాయం మాత్రమే కాదది.

రాహుల్‌జీని గురించి వ్రాయటం అంటే విశ్వ వ్యాప్త దీప్తిని గురించి వ్రాయటమే అవుతుంది. నేనొక చోట ఆయన్ను గురించి వ్రాశాను ;

"రాహుల్ ది విచిత్ర స్వభావం. వ్యతిరేకతకు, భయాందోళనలకు చలించడు. భయాన్ని జయించిన వాళ్ళలో ఆయనొకడు. జీవన అమరత్వం మీద, శాశ్వతత్వం ఆయనకు అభిలాష వుండేది కాదు. క్షణ భంగురత్వం గురించి భయం ఎందుకనే వాడు. అమరత్వం, శాశ్వతత్వం అనేవి కూడా జీవికి ఒక విధమైన బంధనకే అని చెప్పేవాడు.

"సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, మీమాంస, వేదాంత అనబడే షడ్దర్శనాలను గురించి ఎంతగా అధ్యయనం చేశాడో అంతగానే పాశ్చాత్య దర్శనాలను కూడా చేశాడు. థేల్సు, సోక్రటిస్, ప్లేటో, అరిస్టోటల్ మొదలు మార్క్సు, ఎంగెల్సు జీన్‌సాల్ సార్త్రె వరకూ ఆయన ఎవరినీ వదలలేదు."

ఆయనకు వివాహం కాక ముందు ఆయన కొంత కాలం రష్యాలోని లెనిన్ గ్రాడ్ యూనివర్శిటీలో ప్రాచ్య భాషలకు అచార్యుడుగా వుండేవాడు. తనవిభాగంలో ఒక రష్యన్ యువతి తనకు తోడుగా పని చేస్తుండేది. వారిద్దరికీ స్నేహం ఏర్పడి చివరకు ఆ స్నేహం వారి వివాహంలోకి రూపొందింది. తరువాత వారికి ఒక అబ్బాయి కూడ కలిగేడు.

ఆయనది ఎవరితోను కలిసి వుండే స్వభావం కాక పోవడంతో భార్యతోకూడ కలసి వుండలేకపోయాడు. రష్యన్ కుటుంబాన్ని అక్కడే వదలి తాను ఒకడే భారతదేశానికి తిరిగి వచ్చాడు. తరువాత భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీలో బాగా పని చేశాడు.

తన మొదటి వివాహం* నాటికి ఆయన వయస్సు నలభైనాల్గు వుంటాయి. రాహుల్జీ లాంటి వారు పెళ్ళి కాకుండానూ వుండలేరు, పెళ్ళి అయీ వుండలేరు. రష్యా నుంచి తిరిగి వచ్చిన కొంత కాలానికి యు.పి.లోని కమల అనే ఒక యువతిని వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకుజేతా, విజయ్ అనిఒక అమ్మాయీ, అబ్బాయీ జనించారు.

ఆయన హిందీలో రచించిన గ్రంథాలు సారంలోను సంఖ్యలోను కూడ చెప్పుకోదగినవి. వాటిలో "ఓల్గా-సే గంగా" అనే గ్రంథం విఖ్యాతమైంది. దాన్ని

---

* రష్యన్ యువత లోలాతో వివాహం రెండోది. మొదటిది చాలా చిన్న వయసులో తలిదండ్రులు చేయించింది. ఆ వివాహాన్ని రాహుల్‌జీ ఎన్నడూ పట్టించుకోలేదు. — సం॥

నాకిచ్చిన మరుసటి సంవత్సరంలో నేను పశ్చిమ హిమాలయాల్లోని రష్యన్ మహో దయుడు నికొలాయ్ రోరిక్ దగ్గరకు పోయి వారి కుటుంబంలో కొన్నాళ్ళుండటం జరిగింది. ఆయన పెద్ద కొడుకు జార్జ్ రోరిక్ ప్రాచ్య భాషల పండితుడు. ఆయనకు నా దగ్గరున్న "ఓల్గా సే గంగా" ఎంతో నచ్చింది. దాన్ని ఆయనకు బహూకరించాను.

అయన మస్కోలో సకుటుంబంగా జీవిస్తున్న రోజుల్లో ఆయనకు మతి మరపు (అమ్నీషియా) సంక్రమించింది. దానితో ఆయనలోని జ్ఞాపకశక్తి పూర్తిగా నశించి భార్యనూ బిడ్డలను, తన గ్రంథాలను కూడ గుర్తించలేని దురవస్థ ఏర్పడింది. ఆయనలో ఏది ప్రధానమో అదే నశించిపోయింది. ఆయన మానసిక శక్తుల్లో జ్ఞాపకశక్తి ప్రధానమైంది. అజ్ఞాపక శక్తియే లేకుండా పోయింది. మొదటి భార్యను చూస్తే స్మృతి మేల్కొంటుందేమో అని ఆయన్ను లెనిన్ గ్రాడ్ కూడ తీసుకపోవటం జరిగింది. కాని ఫలితం శూన్యమైంది.

ఆ వ్యాధి క్రమేణ తీవ్రరూపం దాల్చి 1963లో ఆయన ఆ వ్యాధి నుంచేకాక అన్ని వ్యాధుల నుంచి కూడ విముక్తుడైనాడు శాశ్వతంగా.

అటువంటి వ్యక్తులు ఈ భూమి మీద కొద్దిమంది మాత్రమే వుంటారు.

నాగార్జున కొండ దగ్గర ఏదో ప్రసంగ సందర్భంలో ప్రశ్నించారు ఆయన నా జీవితంలోని చరమ ఆశయం ఏమిటని, నేను తక్షణం తగుముకోకుండా సమాధానం ఇచ్చాను "మరణించే క్షణం వరకూ జీవించి వుండటం" అని.

---

"ఆర్యులు భారత దేశానికి బయట నుండి వచ్చారు" అని అంగీకరించక పోయిన యెడల ఆర్య భాషా పరివారానికి చెందిన భాషలు వారు యిక్కడి నుండి బయటకు వెళ్ళారని ఒప్పుకొనక తప్పదు. దీని వలన యింకా అనేక చిక్కులు వస్తాయి. వాటికి సమాధానం చెప్పటం కష్టమవుతుంది. ఆర్య భాష, భారత ఐరోపా భాషలు, వానికి సంబంధించిన యితర సామగ్రి యందు శ్రద్ధ లేకుండుటయే పై వాదనకు ముఖ్యమైన కారణంగా తోస్తుంది. అందుచేత మన శాస్త్రవేత్తలు కలియుగాన్ని మహాభారత కాలాన్ని నమ్మిన మన చరిత్రను వేల సంవత్సరాలు వెనుకకు తీసుకొని పోవుటకు ప్రయత్నిస్తున్నారు. ఆసియా మైనరులో హిట్టైయిటులు, గ్రీసులో యవనులు, ఇరానులో ఇరానీయులు ప్రవేశించిన కాలాన్ని పరిశీలిస్తే ఆర్యులు భారత దేశంలో ప్రవేశించింది క్రీ.పూ. 1500 కంటే పూర్వం కాదనేది వాస్తవమనిస్తుంది. భరద్వాజ, వశిష్ట, విశ్వామిత్రులను ప్రాచీన ఋగ్వేద ఋషులనుకుంటే వారి కాలం పైన చెప్పిన కాలానికి 300 ఏండ్ల తర్వాత అవుతుంది. —రాహుల్జీ

"ఋగ్వేద ఆర్యులు" నుండి

(8 వ పేజీ తరువాయి)

మార్క్సిస్టు మౌలిక రచనలు "ఓల్గా సే గంగ" కథల చారిత్రక గతిని అవగాహన చేసుకుందుకు తోడ్పడం చేశాయి. డా॥ రాజారావు నన్ను నటుడుగా తీర్చి దిద్దారు గాని, మార్క్సిస్టు భావజాలానికి దగ్గర చెయ్యలేదు. నన్నే కాదు, వారి సంతానం సహా ఎవ్వరినీ చెయ్యలేదు.

ఆయన నిత్య జీవితాచరణే నన్నాయన మార్గానికి దగ్గర చేసింది. ఆయన చుట్టూ ఆనాడున్న ఇష్టా వాతావరణం ఆ మార్గాన్నందుకుందుకు సహాయం చేసింది. ఆ వాతావరణం నుంచే నాకు పరిచయమై "కమ్యూనిస్టు ప్రణాళిక" సారాన్ని బాగా బుర్రకెక్కించిన నా రాజకీయ గురువు ఎస్. ఎస్. త్రిపాఠి.

ఈ పనిమీద నేను ఆయన నివాసానికి వెడుతున్నప్పుడే, డైరక్టర్ తిలక్ సోదరుడు కొల్లిపర రామనరసింహారావు అక్కడికి వచ్చేవాడు. వారి రాజకీయ చర్చలు వింటూ, నాకు కనువిప్పు కల్గుతున్న రోజుల్లోనే నక్సల్‌బరీ ఉద్యమమైంది. జీవితాన్ని శాస్త్రీయ ప్రాపంచిక దృక్పథం వెలుగులో పరిశీలించడం యిక్కడిన్నించే నా ముప్పయ్యోయేట నుంచే- మొదలైంది. అందుకు "ఓల్గా సే గంగ" నా చేతి టార్చిలైట్లా వుపయోగపడింది. ఇంకా వుపయోగపడుతూనే వుంది.

ఈ పుస్తకంలోని మొదటి నాలుగు కథలు- నిశ, దివ, అమృతాశ్వుడు, పురుహూతుడు- క్రీస్తు పూర్వం ఆరువేల సంవత్సరాల్నించి క్రీస్తు పూర్వం రెండువేల ఐదువందల దాకా వున్న మానవ సమాజాన్ని చిత్రించాయి. ఇవి చారిత్రక యుగోదయానికి ముందు కథలు. అలాగని ఇవి కేవలం కల్పించి రాసినవి కావు. రాహుల్జీ "ఇండో యూరోపియన్ ఇండో యిరానీ" భాషా శాస్త్రాల పరిశోధనల్లోని మహత్తర విషయాలు యీ కథల్లో చోటు చేసుకున్నాయని సాహిత్య వేత్తలంటారు.

ఆది నుంచి మానవజాతి భావ పరివర్తనలో ఆకలి, ఆహారం చాలా కీలకమైన పాత్ర నిర్వహిస్తున్నాయి. రాహుల్జీ క్రీస్తు పూర్వం ఆరు వేల సంవత్సరాలకు పూర్వం వున్న మానవ సమాజ స్థితి గతుల్ని శాస్త్రీయంగా వూహించి చిత్రిస్తూనే కీలకమైన వాటి ప్రాథమిక రూపాన్ని "నిశా" కథలో కళ్ళకి కట్టించాడు.

చలి కాలం వస్తోందనగానే సకల జీవరాశి వేడి ప్రధానమైన దక్షిణానికి వలస పోతాయి. ఏ కారణం చేతనైనా పోలేక పోతే మంచులో యిరుక్కుపోయి చావాల్సిందే.

అప్పటికి వికసించిన మానవ-మానసిక-ధర్మం ప్రకారం, యజమానురాలైన తల్లి ఒక ప్రాణి రక్షణకి పరివారాన్ని ప్రమాదంలో పడెయ్యకూడదు. కాని 'నిశ' తన పిల్లల్లో ఒక పిల్లకి జబ్బుగా వుండడంతో పరివారాన్నాపేసింది.

ఇది మాతృ హృదయానికి స్వభావ సిద్ధమైన మమకారం. కాని నాయకు రాలిగా అదే ఆమె బలహీనతైంది. ఫలితలగా ఆహారం కోసం పరివారం పడరాని పాట్లు పడింది. క్రూర మృగాలతో సాగిన జీవన పోరాటంలో యిద్దరు పిల్లల్ని పోగొట్టుకుంది.

నిశా వృద్ధాప్యాన్ని కొచ్చింది. ఆమె పరివారం ఓల్గా నదీ తీరాని కొచ్చింది. తల్లుల యాజమాన్యాల్లోని అనేక పరివారాలూ ఆ నదీ నీరానికి చేరాయి. ఇంకా చేరు తున్నాయి.

లేఖా, నిశా కూతురు. ఈ పిల్లే తన యాజమాన్య స్థానాన్ని ఆకమిస్తుందని గ్రహించింది నిశా. సహించలేక పోయింది. విద్ర పోతున్నపుడు గొంతు పిసికి చంపాలనుకుంది; కాని లేఖా బలం ముందు నిశా బలం యెందుకూ సరిపోదు. పరి వారంలో వున్నవారు లేఖాకి వ్యతిరేకంగా నిశాతో కలవరు. అందుకు యెవరి కారణాలు వారికున్నాయి. అయినా ఆలోచించి చివరికో మార్గాన్ని కనిపెట్టింది.

రేఖా కొడుకుతో 'స్ట్రాబెరి' పళ్ళతో ఆడింది. చివరికి యెన్నో పళ్ళని గజి బిజిగా తొయ్యటంతో, ఇటన్నిటినీ తేవాలని పరిగెట్టిన లేఖా కొడుకు ఓల్గా నదిలో పడిపోయాడు. కొడుకుని రక్షించుకుందుకు లేఖా నదిలో కురికింది కుర్రాడితో రాబోతున్న తన మీద తన తల్లే బరువుగా వుండటంతో పెనుగులాట మొదలైంది ఈ పెనుగులాటలో చివరికి ముగ్గురూ ఓల్గా నదికి బలయిపోయారు.

ఇది యించుమించు నేలేనిమిదియేళ్ళ క్రితం మానవ సంఘంలో "ఆకలి", "అధికారం" నిర్వహించిన కీలక పాత్రకి ప్రాథమిక రూపం. అధికారం కోల్పో తున్నప్పుడు, మాతృ సహజమైన మమకారం కూడా, ప్రకృతి సహజంగా యెగిరి పోతుంది. పద్ధతులు రూపాంతరం చెంది నాగరిక మయ్యాయి గాని, యీ నాటికీ కుటుంబాల్లో, సంస్థల్లో, రాజకీయ పార్టీలో, చివరికి రాజ్యాంగ యంత్రంలో వున్న "అధికారం" కోలుపోతున్న వారు, ఆ స్థానాని కొచ్చేవారి విషయంలో యెంత ద్వేషంగా ప్రవర్తించేదీ చూస్తున్నాం.

క్రీస్తుకి మూడు వేల అయిదు వందల సంవత్సరాల ముందు జరిగింది. "దివా" కథ. తల్లి యాజమాన్యంలో "జన సమితులు" యేర్పడ్డాయి. వారి ప్రధాన వృత్తి వేట. వేటా, ఆటా, పాటాలాంటి సమస్త కార్యకలాపాలూ "జన సమితి" చేస్తుంది. జన సమితి నుంచి వ్యక్తుల జీవితంలోని యే అంశమూ వేరు కాదు. అన్ని పనుల్లోనూ తల్లి దే ప్రాధాన్యత. నిప్పు వాడుకలో కొచ్చింది. అగ్నిని దేవతగా భావిస్తున్నారు.

కుటుంబంలోని స్త్రీ పురుషులందరూ కల్సి పనిచేస్తారు. కలిసి అనుభవిస్తారు. అవసరమైతే కలిసి పస్తుంటారు. కలిసి చేసే పనిలో 'పాట' ఒక భాగం. ఆనాటి

ఆటా పాటా లాంటి ఆదిమ కళలు "మాయ"- (మేజిక్) తో ముడి పడ్డాయి క్రూరమృగాల్నీ ప్రకృతిబీభత్సాన్నీ ప్రతిక్షణం ఎదుర్కోవల్సిన పరిస్థితే తొలిసారిగ యీ "మాయ" తలెత్తడానికి కారణం.

ఇప్పుడిది ఒక తల్లి యొక్క యేకైక రాజ్యం కాదు. అనేకమంది తల్లుల కుటుంబాల, పరివారాల సమిష్టి, సంఘటిత శాసన రూపం యీనాటి జన సమితి. కనక యిక యే "నిశా", తన "లేఖా" ని ఓల్గాలో ముంచలేదు.

అలాగని ఆకలి, అధికారాల పాత్ర తగ్గలేదు. రూపాంతరం చెందింది.

జన సమితులికి మృగ క్షేత్రాలు- వేటాడే చోట్లు వుంటాయి. క్షేత్రానికీ క్షేత్రానికీ మధ్య ఎవరికీ చెందని వనప్రాంతం వుంటుంది. ఆహారం కోసం యీహద్దులు మీరనంత వరకూ బాగానే వుంటుంది. మీరితే "రణం" తప్పదు.

దివా జన సమితికీ, ఉషా జన సమితికి యీ విధంగా "రణం" మొదలైంది. అధికార బలా బలాల్ని తేల్చుకుందుకు పరస్పర మారణహోమం జరిగింది. చివరికి దివా జన సమితి విజయం పొందింది. కాని విజేతల్లో విరోధులు చచ్చి సాధిస్తారేమో నన్న "భయం" మొదలైంది. దాంతో అందరూ రాత్రుళ్ళు ఆ రణక్షేత్రం వైపు వెళ్ళడానికి హడలి చస్తున్నారు. చీకట్లోంచి పసిపాపలు- ప్రేతాలు- వచ్చి కౌగలించు కున్నట్టనిపించి, దివా కెవ్వున కేక వేసేది. ఇక్కడ్నించి ప్రత్యర్థుల్ని కూడ తమ లాంటి ప్రాణ చైతన్యమేనన్నది, మానవజాతిలో తలెత్తింది. యుద్ధం అనాగరిక ధర్మమన్న ఆలోచనా అంకురిస్తోంది.

గెలవలేని తెగలు ఓల్గాని వదిలిపోతున్నాయి.

పశు పోషణ ప్రధాన వృత్తిగాగల "పితృస్వామ్య" సమాజ స్థితిగతుల్ని చిత్రించింది "అమృతాశ్వుడి" కథ. ఇది క్రీస్తుపూర్వం మూడువేల సంవత్సరాల నాడు జరిగింది. అప్పటికి స్త్రీ గృహ పత్నయింది గాని, తన మనశ్శరీరాల మీద ఆమె సంపూర్ణ స్వాతంత్ర్యం కొనసాగుతోంది.

పశువుల్ని— గోవుల్నీ, అశ్వాల్నీ- దోచుకున్నట్టే స్త్రీలనీ దోచుకునేవారు. పశువుల్ని దోచుకోవడం చిరకాల శతృత్వానికి దారి తీస్తుంది. కాని కన్యాపహరణం మాత్రం తాత్కాలిక వైరుధ్యమే. చివరికి అల్లుణ్ణి మావగారు సత్కరించడంతో, అది సమసిపోతుంది.

మాతృస్వామ్య సమాజంలోని "మాయ" నృత్య గాన కళల్తో బాటు పితృస్వామ్య సమాజంలో కొచ్చింది. ఆచార వ్యవహారాల్లో భాగంగా కొనసాగింది. మహా పితరుని— సంఘ నాయకుని- గృహంలో పుత్రోత్సవం జరుగుతోంది. వాళ్ళాకుల్నించి రక్షించిన మధురతో అమృతాశ్వుడు అక్కడ మాట్లాడకాడు. వారి

మాటల్లో స్త్రీ స్వేచ్ఛని హరించని మాతృస్వామ్య సమాజాలు సమాంతరంగా కొన సాగుతున్నాయని తెలుస్తుంది. స్త్రీగా మధుర కున్న స్వేచ్ఛని హరించకుండా కొన సాగిస్తానని హామీ యిచ్చి, అమృతాశ్వుడు మధురని తన దాన్ని చేసుకున్నాడు.

కురు సంఘానికి అమృతాశ్వుడే మహా పితరుడయ్యాడు. ఇతని రాజ్యంలో పశు సంపద సమృద్ధిగా వుంది. కనక అధికారానికి అగ్ని పరీక్ష పెట్టే యుద్ధ భయమూ వుంది. బీదస్థితిలో వున్న పనివారున్నారు. కాని స్వకుటుంబీకుల్లా కలిసి పని చేస్తారు. మధుర అమృతాశ్వునితో సమానంగా పని చెయ్యడం కొందరి కిష్టం లేదు. ఆమె గృహకృత్యాలకే పరిమితం కావాలని వారి వాదన.

తల్లి రాజ్యంలో యెల్లప్పుడూ పరివారమంతా ఒక్కటిగా వుండి ఒక్కుమ్మడిగా పనిచేస్తుంది. తండ్రి రాజ్యం దీనికి భిన్నం. వారి వారి పరివారాలూ, పశు సంపదలూ, లాభ నష్టాలూ యెవరికి వారే అనుభవించడం మొదలైంది. ఆత్మ రక్షణ పరిస్థితుల్లో మాత్రం ఐక్యమవుతారు. ఒక్కుమ్మడిగా పోరాడుతారు.

పురులు, కురుల పశు సంపదని దోచుకుపోతున్నారు. అమృతాశ్వుని నాయకత్వంలో కురులు పురుల్ని ఓడించారు. పురుల పశు సంపదంతా వీరి వశమైంది. లొంగినవారిని ఖైదీలుగా వుంచడం నియమ విరుద్ధం. కనక వృద్ధుల్ని పిల్లల్ని హతమార్చి స్త్రీలని తమతో తీసుకొచ్చారు. ఒక తరందాక ఒక స్త్రీ కంటె హెచ్చు మంది భార్యల్ని కల్గి వుండడం శాస్త్ర సమ్మతమని మహా పితరుడు ప్రకటించాడు.

ఈ విధంగా బహు భార్యత్వానికి అంకురార్పణ జరిగింది.

నాలుగో కథ "పురు హూతుడు". ఇది క్రీస్తుపూర్వం రెండువేల అయిదు వందల సంవత్సరాల నాటి ఆర్యసమాజ స్థితిగతుల్ని చిత్రించింది. ఇప్పటికి పశు పోషణతోపాటు వ్యవసాయం కూడా మొదలైంది. మానవుల్లో సోదర సోదరీభావం తలెత్తి బలపడుతోంది. రాతి ఆయుధాల స్థానంలోకి లోహ— రాగి, మొ॥న ఆయుధాలు వస్తున్నాయి. మానవ సంఘాలు సంచార జీవితాన్ని వదిలి, స్థిర జీవితాని కొచ్చే ప్రాథమిక ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మాయ సంస్కృతిలో, సాహిత్య కళల్లో భాగమై రూపాంతరం చెందుతూ వస్తూనే వుంది. ఆహారోత్పత్తిలో సాధిస్తున్న అభివృద్ధిని రక్షించుకోవాలంటే సంఘం, దాని అధికారాన్ని నిలబెట్టే ఆయుధాల్లో వస్తున్న అభివృద్ధిని కూడా సాధించి సొంతం చేసుకోవాలి. సాధించుకోలేని సంఘం, తోటి సంఘాల దాడికి గురయి దాని అస్తిత్వాన్నే కోల్పోతుంది.

పురు హూతుడు ముప్పయేళ్ళ వయసులోనే పురు సంఘానికి మహా పితరుడయ్యాడు. దిగువ మద్రులు అప్పటి న్యాయాన్ని మీరి సాటి సంఘాల అస్తిత్వాన్ని దెబ్బ తీయాలని చూస్తున్నారు. పురువుల వుత్తర మద్రుల మహాపితరుల సమావేశం

దిగువ పద్రులను తుడిచి పెట్టకపోతే, దాసు బానిసలం కాక తప్పదని గ్రహించింది. పురుహూతుని నాయకత్వంలో యుద్ధాన్ని నడిపించడానికి తీర్మానించింది

పురుహూతుడే విధంగా తొలి "ఇంద్రుడు" డయ్యాడు.

యుద్ధంలో విజయాన్ని సాధించారు. ఆనాటి యుద్ధనీతి ప్రకారం, శత్రువర్గంలోని పురుషుల్ని, ఆ బాలవృద్ధుల్ని సంహరించాలి. కాని తిరిగి పోగోరిన వార్ని పంపేసి, మిగిలిన వారిని సంహరించారు. స్త్రీలను మాత్రం తమ స్త్రీలలో కలిపేసుకున్నారు.

ప్రాణాల్ని నిలుపుకుని పోగోరిన కొద్దిమంది స్త్రీ పురుషులా వక్షు నదీ ప్రాంతాన్ని వదిలి, పశ్చిమంగా పోయారు. వీరి సంతానమే తరువాత ఈరానుపర్శు-పర్షియన్-లనీ మద్రు-మిడియన్-లనే పేర్లతో పిలువ బడ్డారు. ఇంద్రుని నాయకత్వంలో తమ పూర్వులికి జరిగిన అత్యాచారాల్ని మరవలేకపోయారు. వక్షునదీ ప్రాంతాన్నంతనీ పురువులు ఉత్తర మద్రులు స్వాధీనం చేసుకున్నారు. ఆర్యులు తమలోకి అనివార్యంగా వచ్చిన బానిసత్వాన్ని విసర్జించాలను కుంటున్నారన్న సూచనలీ కథలో వున్నాయి.

ఈ ఆర్య సమూహంలోని కొందరి సంతానమే భారతావని-గంగ—పైపుకి బయల్దేరింది.

వీటి తరువాత నాలుగు కథలకి- పురుధానుడు, అంగిరా, సుదాసుడు, ప్రవాహణుడు,- సాహిత్య ప్రమాణాలున్నాయి. వేదాలు, బ్రాహ్మణాలు, మహాభారతం, కొన్ని బౌద్ధ గ్రంథాలు వీటికాధారం. సుదాసుని కథకి ఆధారం ఋగ్వేదమే. ప్రవాహణుడు కథకి చాందోగ్యోపనిషత్తు బృహదారణ్యకోపనిషత్తు, కొన్ని బౌద్ధ కథలూను. ఈ నాలుగు కథలు క్రీస్తు పూర్వం రెండు వేల్నించి, యేడు వందల వరకూ జరిగిన సమాజ వికాసాన్ని సూచించాయి.

పురుధానుడు కథ ప్రథమ అసుర దుర్గ పతనం వెనకున్న చారిత్రక నేపథ్యాన్ని వెలుగు నీడలతో వ్యక్తంచేసింది. అప్పటికి ఆర్య సమాజంలో భోగ జీవితం లేకపోలేదు. కాని పరిమితుల్లో వుంది. పర్వత ప్రాంతాలకే పరిమితమైన ఆర్య సంఘాలు శ్రమ విలువని విస్మరించలేదు. బానిసత్వాన్ని అంగీకరించలేదు.

సుమేధ పురుధానుల సంభాషణల్లో ఆర్యసమాజ స్థితిగతులూ, అసుర ఆర్య సమాజాల మధ్య వున్న వ్యత్యాసాలూ వ్యక్తమవుతాయి. అప్పటికి భౌతిక సంపదల అభివృద్ధిలో అసుర సమాజం, ఆర్య సమాజాన్ని మించింది. అందుకు తగిన భోగ లాలస జీవితం- వేశ్యలు, బానిసలు- ఆర్య సమాజం అసహ్యించుకునే అన్ని దురాచార దుర్లక్షణాలూ, అసుర సమాజంలో వున్నాయి.

ఆర్య సమాజం ఈ తరహా భోగ లాలస జీవితానికి దూరంగా వుంది. సుమేధుడు వయసులో తనకన్నా చాలా చిన్నదైన వుషని ప్రేమించి పెళ్ళాడాడు. తనకి సొంతమైన ఆమె అందరి యువకుల ప్రేమకీ పాత్రురాలవుతోందని బాధ పడతాడు. భర్త పోతే భార్య మరిదికి భార్యగా కొనసాగే ఆచారం, ఆ సంఘంలో వుంది. ఆర్యుల యింద్రోత్సవంలో - యజ్ఞ సమయంలో - యువతీ యువకులు సర్వ స్వతంత్రులయి, విచ్చల విడి ప్రణయ విహారం చేసే ఆచారమూ వుంది.

ఆర్యసమాజం తనకి దొరకని విలాస వస్తువుల కోసం, పుష్కలావతీనే అసుర నగరంతో, వ్యాపార సంబంధాల్ని పెట్టుకుంది. ఇది స్వాత్ కుభా -కాబూల్- నదుల సంగమ ప్రదేశంలో వుంది. సుమేధుడు మరణించాక వుష తన మరిది పురుధానుడి భార్యయింది. పురుధానుడుకి అనేక సంవత్సరాల స్నేహం కారణంగా అసుర సమాజం అంతరంగిక బలహీనతలు తెలిశాయి. అసురులు అనేక విధాల ఆర్యుల్ని అవమానిస్తున్నారనీ తెల్సింది.

పురధానుడు ఆర్య నాయకుల్తో చర్చించి, అసుర నగరం మీద దాడి చేశాడు. అసురుల ద్రోహానికి ఆగ్రహించి ఆర్య స్త్రీ పురుషులు, ఆవేశంతో అతి నిర్ద యగా శత్రువుల్ని వధించారు. నగరాధిపతిని నాలుగు వీధుల మొగలో చిత్రవధ చేశారు. అసుర నగరాన్ని - పుష్కలావతిని చాలా భాగం భస్మం చేసి అసురలతో వ్యాపారాన్ని ఆపేశారు. కాని వారు లోహాల్ని — రాగి యిత్తడి వెండి బంగారం మొ॥న వాటిని - యెన్నాళ్ళు బహిష్కరించగల్గుతారు ?

ఇది ఆర్యా - దేవా - సుర సంగ్రామానికి అంకురార్పణ.

"అంగిర" కథ క్రీస్తు పూర్వం పద్దెనిమిది వందలేళ్ళ నాటి సమాజ జీవి తాన్ని చిత్రించింది. పురుధానుడి కాలం నుంచి యీనాటిదాకా ఆర్యా సుర యుద్ధాలు జరుగుయునే వున్నాయి. పరస్పర విరుద్ధ సంస్కృతుల భావ సంఘర్షణ సాగు తూనే వుంది.

ఈ భావ సంఘర్షణ అనాదిగా సాగుతూ వస్తున్నదే. వేట ప్రధానమైన కాలంలో అంకురంలా వున్న మాయ, పశు పోషణ వ్యవసాయ సమాజాల్లో క్రతు రూపమై కొనసాగింది. ఇదే మాయా సృష్టి నాటకం - మిస్టిక్ ప్లే - రూపంలో అన్ని ఖండాల అనాగరిక సమాజాల్లోనూ కనిపిస్తుంది.

ఇది మంత్ర తంత్రాలతో, ప్రకృతి శక్తుల్ని అనుకరిస్తుంది. సృజన శక్తికి లైంగిక క్రియని సూచనగా భావిస్తుంది. ఈ క్రియ పొలాల్లో జరిగితే సంతానోత్పత్తిలా, "పంటల" వుత్పత్తి కూడా వృద్ధి చెందుతుందని విశ్వసిస్తోంది.
ఆదిలో అందరిచేతా ప్రదర్శితమైన యీ నాటకం తరువాత యెన్నికైన జంటకే పరిమితమైంది. ఇందులో పురుష పాత్ర విత్తనానికీ ప్రతీక, స్త్రీ పాత్ర

భూగర్భానికి సంకేతం. విత్తనాన్ని - ఎన్నికైన పురుషుణ్ణి — చంపి, పాతిపెట్టే ఆచారం కొత్తలో వుంది. రాను రాను — ఓడిన వారిని బందీల్ని, బానిసల్ని చేసుకుంటున్నది మొదలు - ప్రత్యామ్నాయంగా బందీనో, బానిసనో చంపి పాతే ఆచారంగా రూపాంతరం చెందింది.

ఈ నరబలి స్థానంలోకి, క్రమంగా జంతుబలి ప్రవేశించింది.

ఇంద్రుణ్ణి ఎన్నుకోపడిన జన నాయకుడుగానే వుంచిన ఆర్యసమాజంలో, బందీల్ని బానిసలుగా వుంచే ఆచారం, ఆర్యాసుర యుద్ధాలు ముగిసేదాకా రాలేదు. కాని అప్పటికే భౌతిక సంపదల్లో వూహించని అభివృద్ధి సాధించిన అసుర సమాజంలో, ఇంద్రుడు దైవాంశ సంభూతుడైన రాజుగా నియంతృత్వాధికారాలు చెలాయిస్తున్నాడు.

రాజు కా శక్తినిచ్చిన రాజ్యాంగ యంత్రం, దానికి వెన్నెముకైన పురోహిత వ్యవస్థ, వీటిని బలంగా నిలబెట్టే - దురాచార దుర్లక్షణాలున్న - సంస్కృతి, అసుర సమాజం అణువణువునా అల్లుకుపోయింది. అంగిర కాలానికి - పెనగ పెనగ ప్రేమ పుట్టినట్లు - ఆర్య స్త్రీ పురుషులు - ముఖ్యంగా నాయకులు - అసుర సంస్కృతి వైపు బలంగా ఆకర్షితులవుతున్నారు.

అంగిరా తక్షశిలని కేంద్రంగా చేసుకుని, జాతి సౌందర్యం - సాంస్కృతిక సౌందర్యం కాకూడదని, శత విధాల ప్రయత్నించాడు. అతను అన్ని చెడులకీ మూలమూ, అన్నిటికన్న ప్రమాదమూ, అసురుల రాజ్య విధానమని గుర్తించాడు. దానిలో భాగమే పురోహితాచారమని తెలుసుకున్నాడు. అంతేకాదు. ఆర్యుల్లో ఏనాడు రాజు యేర్పడతాడో, ఆరోజునే అసుర పురోహితుని వంటి పురోహితుడు యేర్పడుతాడని వూహించాలి.

చరిత్ర గతి ముందు అంగిరా ప్రయత్నాలు విఫలమయ్యాయి. అతని వూహ మాత్రం నిజమైంది. ఆర్యనాయకులికి అధికారం పైనా, భోగాల పైనా ఆశ పుట్టింది. పరస్పర విరుద్ధమైన మనోవాంఛల మధ్య, సంఘర్షణ తీవ్రంగా జరిగింది. ఎక్కడైతే అసురుల సంఖ్య యెక్కువుందో, అక్కడ యీ భావ సంఘర్షణ తీవ్రమైంది. అక్కడ పరాజితులైన అసురులు ఆర్యుల అంతఃకలహాల్నించి లాభం పొందాలని చూశారు. దొరికిన ప్రతి అవకాశాన్ని వినియోగించుకున్నారు.

ఈ విధంగా సుదాసుడు- రుగ్వేద- కాలానికే వైదికార్య పురోహిత వ్యవస్థ మొదలైంది.

---

— కవిత్వంలోను, నవలా రచనలోను స్థానికత, ప్రాంతీయత ప్రతిఫలించడం అవసరం —రాహుల్జీ

తొలి నాగరిక - వర్గ సమాజంలో, చారిత్రకంగా పడిన మెలిక, ఇక్కడ్నించీ సంక్లిష్టమై మరింత చిక్కులు పోయింది. చరిత్రని శాస్త్రీయంగా వివరించేవారు కారణాన్నిలా చెబుతారు. ఆటవిక దశల్లో, మనిషి మెదడు పరిణామం చెందుతున్న పద్ధతికి, శాస్త్ర విజ్ఞానం సాయంతో సామాజిక పరివర్తన సాగాల్సిన పద్ధతికి, అవినా భావ సంబంధం వుంది. రాజ్యాంగ యంత్రాల పుట్టుకతో - దాని వర్గ విభజనవల్ల ఆ సంబంధం విచ్ఛిన్నమయ్యే క్రమం మొదలైంది. సమాజ పరిణామానికి విరుద్ధమైన కృత్రిమ - దోపిడీ - పద్ధతుల్లో సమాజ పరివర్తన కొనసాగుతూ వస్తోంది.

తొలిరాజ్యాంగ రచయిత - బుద్ధిజీవి - ఒద్దికిచ్చిన స్థానాన్ని, దానికి జన్మనిస్తున్న "శ్రమ కివ్వలేదు, ఫలితంగా మానసిక, శారీరక శ్రమలమధ్య వైరుధ్యం తలెత్తింది. ఈ వైరుధ్యం విస్తరించే కొద్దీ అన్నదాతయిన రైతు, వుత్పత్తి పునరుత్పత్తుల్లో ప్రధాన పాత్ర నిర్వహిస్తున్న స్త్రీ, నాగరిక - వర్గ - సమాజం ఇరుసుని మోసే బలి పశువు లవుతూవస్తున్నారు. సుదాసుడు కథలో దీని ప్రాథమిక రూపాన్ని చిత్రించాడు రాహుల్జీ.

సుదాసుడు కథాకాలం క్రీస్తుకు పూర్వం పదిహేను వందల సంవత్సరాలు. అప్పటికి ఆర్య అసుర జాతుల సమ్మేళనం జరిగిపోయింది. వైదికార్యసామాజిక వ్యవస్థ ఇంద్రుణ్ణి - రాజుని - దేవుణ్ణి చేసింది. పాలనా యంత్రాంగాన్ని తన గుప్పిట్లో పెట్టుకుంది.

సుదాసుడు తన సంచార జీవితంలో దీనికి భిన్నమైన గణ వ్యవస్థని చూశాడు. అక్కడ మానవ సంబంధాలు అత్యున్నత స్థితిలో వుండడం, అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడు. సున్నితమైన ఆ అనుబంధాల ప్రేమాంతఃకరణకి సంకేతం, అతని ప్రేయసి అపాల.

అపాల, సుదాసుడు తన రాజ్యానికి వెడుతున్నప్పుడు "నేను నీ కోసం మద్రపురంలో నిరీక్షిస్తూ వుంటాను" అంది. అతని మనసులో, ఆమె మాటలు బలంగా హత్తుకు పోయాయి.

మానవ చైతన్యం మనసుకి పట్టిన సుదాసుడు తండ్రి దివోదాసుతో రాజ్యం ప్రజల పరం చెయ్యమని చెప్పాడు. వారిద్దరి సంభాషణల్లో వశిష్ట విశ్వామిత్రుల్లాంటి - పురోహిత - మొసళ్ళున్నంత కాలం, అది అసాధ్యమని తేలింది. రాజ్యాన్ని సుదాసుడి చేతిలో పెట్టి, దివోదాసు దివంగతుడయ్యాడు.

రాజయ్యాక, వైదికార్య పురోహిత రాజ్యాంగ యంత్రం దోపిడీతత్వం, సుదాసుడికి అనుభవ పూర్వకంగా తెల్సింది. వ్యక్తి యెంత మంచివాడైనా, వ్యవస్థని మార్చగల స్థితి యేనాడూలేదు. ఇక నుంచీ అదింకా అసాధ్యమని గుర్తించి, తగు విధంగా - వున్నంతలో మంచిగా - ప్రవర్తిస్తున్నాడు. సుదాసు అంతర్యాన్ని

గ్రహించలేని ఆర్య పురోహితులు, సుదాసత్వాన్ని - బాగా దానం చేసే గుణాన్ని కీర్తించారు. ఈ స్తుతులే ఋగ్వేదంలో చోటు చేసుకున్నాయి.

సుదాసుడి అంతర్యంలో మాత్రం, మానవ సంబంధాల వుత్తమ ఔన్నత్య రూపానికి చెరిగిపోని గుర్తుగా, అతని కోసమే జీవితాంతం నిరీక్షించి మరణించిన "అపాల" చిరస్మరణీయమైన స్థానాన్ని పొందింది. ఇదే కాలంలో ఆర్య పురోహితుల సాయంతో, కురు పాంచాలు ఆర్య సామంతులు ప్రజల అధికారంపైన, అన్నిటికన్నా బలీయమైన ఆఖరి దెబ్బ కొట్టాడంటాడు రాహుల్జీ.

వేదకాలం నుంచి వుపనిషత్తుల కాలాని కొస్తూ, పైది కార్య పురోహిత సమాజం, బానిస వ్యవస్థగా రూపాంతరం చెందింది. దానిస వర్గం నుంచి, భౌతిక వాద తత్వ చింతన మొదలైంది. పాలకులైన పురోహిత వర్గం నుంచి — యజ్ఞ యాగాదుల పట్టు సడలి - బ్రహ్మవాదంగా మాయావాదం వేళ్ళూనింది.

బ్రహ్మవాదంలోని మాయ, రాజ పురోహితులకు భోగలాలస జీవితాన్నిచ్చే వ్యాపారమైంది. ఈ మిథ్యావాదాన్ని మొట్ట మొదటగా ప్రతిపాదించాడు "ప్రవాహణుడు." క్రీస్తు పూర్వం యేడు వందల సంవత్సరాలనాడు, యీ కథ జరిగింది. పురోహిత స్వార్థం బానిస వర్గంలోని దాస దాసీజనాల పీడన, ఇప్పటి కలా పతాక స్థాయికొచ్చాయో, యీ కథలో సూచించాడు రాహుల్జీ. బ్రహ్మవాదంలోని మాయని పూర్తిగా బయట పెట్టాడు.

బ్రహ్మవాదాన్ని చిన్నతనం నుంచి వ్యతిరేకిస్తున్న ప్రవాహణుని భార్య "లోప", అందులో వున్న మాయని స్వార్థాన్ని బయటపెడుతూ వుంటుంది. ప్రవాహణుడు ఆమె అంటున్నదాన్ని అంగీకరిస్తాడు. వశిష్ట విశ్వామిత్రుల నావలాగాక తన నావ రెండు వేల సంవత్సరాలకు మించి, రాజుల్ని సామంతుల్ని పరధన భోగుల్ని వుద్ధరిస్తుందంటాడు.

సాధన వల్ల వచ్చే సూక్ష్మేంద్రియాలకేగాని, బాహ్యేంద్రియాలకు "బ్రహ్మ" దర్శనం వల్లదన్నది, యీ వాదంలోని తొలి మాయాజాలం. పునర్జన్మ-చచ్చిన జీవి తిరిగి యీలోకానికే వస్తుందన్న-సిద్ధాంతం, ఇందులోని మహా మాయాజాలం. ప్రవాహణుడి మాటల్లో "నువ్వూ నేనూ వుండంకాని, యావత్తుదరిద్రప్రజా పునర్జన్మనే నమ్మకం చేత యావజ్జీవపు కఠినత్వాన్ని, కష్టాల్ని అన్యాయాల్ని సహించడానికి తయారవుతుంది." పాలక వర్గాల కింతకన్న "సేఫ్టీ వాల్వు" ఇంకేం కావాలి ?

దీన్ని విన్న లోప "స్వార్థం కోసం, ఇతరులను నాశనం చెయ్యడం" అంటుంది.

ఏవరేమన్నా, ప్రవాహణుడు వేసిన విత్తనం "యాజ్ఞవల్క్యుని" వంటి బ్రహ్మవాదుల చేతుల్లో పూడల మర్రిలా విస్తరించింది శతాయువుగా వున్న లోప, తాను

వ్యతిరేకిస్తున్న యీ మిథ్యావాద విస్తరణని కళ్ళారా చూసింది, వాదంలో గెలవలేక గార్గిని గద్దించాడని, ఆమె నోటనే విన్న లోప ప్రవాహణుని మిధ్యావాదాన్ని, యాజ్ఞవల్క్యుడు పూర్ణత్వానికి తీసుకెళ్ళాడని తెల్సుకోగల్గింది. "ప్రజలు స్వయంగా చైతన్యం పొందేంత వరకూ, వారి నీ వుచ్చు నుండి యెవడూ తప్పించలేడు. ప్రజలు చైతన్యం పొందడం, యీ స్వార్థపరులకు మనస్కరించదు" అని గార్గితో అంది. గార్గి "ఈ మోసాన్ని ద్వేషించడానికి, మానవ హృదయం మనకిక ప్రోత్సాహ మివ్వదా" అంటుంది. లోప "ఇస్తుందమ్మా! అదే నాకున్న ఆశల్లా" అని అంటుంది. లోప ఆశావాదం, రాహుల్‌జీ చారిత్రక ఆశావాదమే. కాని అప్పటికే పురోహిత వ్యవస్థ ఆధిపత్యం యెంత బలపడిందో, యీ బ్రాహ్మణాన్ని చూస్తే తెలుస్తుంది.

"దైవాధీనం జగత్సర్వం
మంత్రాధీనంతు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం
బ్రాహ్మణో మమదేవత"

క్రీస్తు పూర్వం నాలుగు వందల తొంభైనాటి సమాజాన్ని భావఘర్షణని చిత్రించింది "బంధుల మల్లు" కథ. దీనికిక్కావల్సిన సమాచారమంతా బౌద్ధ గ్రంథాల నుంచే గ్రహించడం జరిగింది. ఈ సమాచారం విస్తారంగా లభ్యం కావడంతో ఈ కాలపు స్థితిగతుల్ని చిత్రిస్తూ "సింహసేనాపతి" అన్న నవలని వేరే రాయడం జరిగింది.

ప్రవాహణుని కాలానికే - సెక్స్‌తో సహా - అన్ని ఆకళ్ళని అతి సులువుగా తీర్చే భౌతిక సంపదల మిగులు పెరిగింది. ఈ మిగులుని సొంతాస్థిగా మార్చుకుంటున్న వర్గం, ఆకలిని అప్రధానం చేసి-సాంఘిక అధికారాన్ని కొనసాగించగల బ్రహ్మ—మాయా—వాదాన్ని ముందుకు తెచ్చింది. బంధుల మల్లు కాలానికదిరంకా పెరిగింది.

అజితకేశ నుంచే ప్రతిఘటన పుడుతుంది.

బలపడుతున్న - వుద్దాలక- యాజ్ఞవల్క్యుల - బ్రహ్మ - మాయా - వాదాన్ని ప్రతిఘటిస్తూ, బానిస వర్గం నుంచి వచ్చిన అజిత కేశ కంబళ్ వంటి భౌతిక వాదుల చార్వాక మతం పుట్టింది. ఇది ఆత్మగాని, ఈశ్వర భక్తినిగాని, స్వర్గ నరక పునర్జన్మనుగాని అంగీకరించలేదు. వీటిని ప్రచారం చేస్తున్న భావవాదుల వెనకున్న వర్గ స్వార్థాన్ని, వారి బతుకు బండార్నాన్ని బయట పెట్టింది.

భావ భౌతిక వాదాలు సంఘర్షిస్తున్న యీకాలంలోనే, బ్రాహ్మణ క్షత్రియ సామంతులూ, కుబేరులైన వ్యాపారులూ. గౌతమబుద్ధుని అనాత్మవాదంవైపు ఆకర్షి

తులయ్యారు. ఇందుకు కారణం వుంది. చార్వాకుల భౌతిక వాదం యీ వున్నత వర్గాలికి మింగుడు పడలేదు. భావవాదంలోని బండారం బయట పడితోంది. ఈ రెండు మార్గాలకీ చెందని మధ్యే మార్గంగా బుద్ధుని మతం రూపొందింది.

గౌతమ బుద్ధుడు అనాత్మక వాదంలో-అంటే భౌతిక వాదంలో, కొన్ని సంగతులు చేర్చి దాని చెడుని తొలగించాడు. నిత్య ఆత్మనే దొకటి లేకపోయినా చేతనా ప్రవాహం, స్వర్గ నరక లోకాల్లోకి ఒక శరీరం నుండి మరో శరీరంలోకి మారుతుందన్నాడు. బుద్ధుని యీ అభిప్రాయం ప్రవాహంబడి "పునర్జన్మ" దగ్గర కొచ్చింది. ఈ భావ భౌతికవాద మిశ్రమమే డబ్బు సంచుల్తో మూలుగుతున్న వర్గాల్ని, బుద్ధుని పాదాల మీద పడేలా చేసింది.

బంధులమల్లు, మల్లికా యిలా బుద్ధుని మతానికి బద్ధులైన వారే. ఆ మతంలో నిమగ్నమై నియమాల్ని త్రికరణశుద్ధిగా పాటించే వాళ్ళలో వీళ్ళావొకళ్ళు. వీళ్ళ జీవితాన్ని ఆధారంగా చేసుకుని రాహుల్జీ, అప్పటి రాజాస్థానాలు మోసాలికీ, కుట్రలకీ, యెలా నిలయాలయ్యాయో, ప్రతి గ్రామం ఒక దాసత్వ నరకంగా వున్నా, పాలకుల కళ్ళు యెలా మూసుకు పోయాయో, వివరించారు.

నాగదత్తుడు కథ క్రీస్తు పూర్వం మూడువందల ముప్పయి అయిదు సంవత్సరాల క్రితం సమాజ స్థితి గతుల్ని సూచిస్తుంది. దీనికి కౌటిల్యుడి అర్థ శాస్త్రం, గ్రీకు యాత్రికుల గ్రంథాలూ ఆధారం. నాగదత్త, విష్ణుగుప్తులు తక్షశిల్లో విద్యాభ్యయనం పూర్తిచేశారు. పరస్పర విరుద్ధ జీవన వైఖరులున్న వారిద్దరూ, తక్షశిల స్వాతంత్ర్య రక్షణ గురించి చర్చిస్తారు.

నాగదత్తుడు బౌద్ధమతం నుంచి ప్రభావితుడైతే, విష్ణుగుప్త చాణక్యుడు వేదోపనిషత్ భావ - మాయా - వాదం నుంచి ప్రభావితమయ్యాడు. దాసత్వ నరకాలుగా మారిన గ్రామాల్లోని జీవితాల్ని, ప్రజాస్వామ్య భావజాలంతో ప్రభావితం చేసి, పటిష్టం చేయాలంటాడు నాగదత్తుడు. సామంత రాజుల్ని శాసించి అదుపు చేయగల సామ్రాజ్యాన్ని నిర్మించే చక్రవర్తిని సృష్టిస్తేనే, అది సాధ్యమంటాడు విష్ణుగుప్త చాణక్యుడు.

సమాంతర సాంస్కృతిక భావ జాలానికి ప్రతినిధులైన వారిద్దరూ, యెవరికి నచ్చిన దారిలో వారు "తక్షశిల" స్వాతంత్ర్య రక్షణకోసం బయలుదేరారు. చివరికి నాగదత్తుడు ఒక గ్రీకు బానిస - సోఫియాని విముక్తంచేసి, సహచరిని చేసుకుంటాడు. విష్ణుగుప్త చాణక్యుడు, చంద్రగుప్తుని మగధ చక్రవర్తిని చేసి, మౌర్య సామ్రాజ్యాన్ని బానిస సంఘాల సమాఖ్యగా మార్చాడు. అదే కాలంలో అరిస్టాటిల్ మార్గదర్శకత్వంలో, గ్రీకు చక్రవర్తయిన అలెగ్జాండర్, ప్రపంచ సామ్రాజ్యాధినేత కావాలని కలలుగన్నాడు.

ఈ యిద్దరు చక్రవర్తులూ, భారత భూమ్మీద కలుసుకున్నారు.

నా నోట్లోంచి "సామ్రాజ్యవాదం" అన్నమాట రాగానే, నామీద కస్సుమని లేచాడు ఓ బి. జె. పి. మిత్రుడు. ఆ మాట కేవలం నాబోటివాళ్ళ కన్పించిదన్నట్టు కసురుకున్నాడు. మూలంలోనే భేదం వుంది గనక, వాదం అనవసరమని అప్పుడు వదిలేశాను. ఆ తరువాత ఆలోచించగా, ఆలోచించగా తెల్సిన వివరమిది.

వ్యాపార విస్తరణ భావనే, సామ్రాజ్యవాదం మూలరూపం. వస్తూత్పత్తి కాలంనుంచి, అది మానవజాతుల ఐక్యతా ఘర్షణల అంతఃసూత్రంగా కొన సాగుతూ వస్తోంది. అదే అఖండ భారత భావనగా, ఆర్య చాణుక్యుని కాలానికి బయటపడింది. అదే కాలంలో, అలెగ్జాండర్ చక్రవర్తి ప్రపంచ సామ్రాజ్య భావనగా అభివృద్ధి చెందింది. అంచేత ఆర్యచాణుక్యుడో, అలెగ్జాండరో విజేతలైతే, ఆ విజయం వారిదికాదు. విస్తరిస్తున్న వ్యాపార వర్గభావనది. అంటే సామ్రాజ్య వాదానిది. అలాగే నాగదత్తుకు విజయం పొందలేదంటే, ఆ ఓటమి నాగదత్తుడిది కాదు. ఇరుసుకింద బలిపశువులయిపోతున్న స్త్రీ జాతిది, రైతాంగానిదీను, వ్యక్తుల్ని బానిసలుగా మార్చే అలెగ్జాండర్ ఆర్యచాణుక్యుల విజయంకన్న, ఒక్క వ్యక్తిని బానిసత్వంనుంచి విముక్తం చేసిన నాగదత్తుడి విజయం యెంతో విలువైనది.

సంస్కృతి స్థిర బిందువు కాదు. అంతః సింధువు. మానవజాతులు ఒకరి నుంచి మరొకరు యిచ్చిపుచ్చుకున్నదెంతో వుంది. ఇక మీదటా వుంటుంది. ఇక్కడ్నించి భారత గ్రీకు సంస్కృతుల సమ్మేళనం కొనసాగింది.

అలెగ్జాండర్ చక్రవర్తి కల — ప్రపంచ సామ్రాజ్య భావన - కలగా వుండగానే గ్రీకు సామ్రాజ్యం పతనమైంది. అలాగే యిక్కడ మౌర్య సామ్రాజ్యమూ పతనమైంది. కాని గ్రీకు సమాజాన్ని తనలో కలువుకున్న రోమన్ సామ్రాజ్యం - బానిస సంఘాల సమాఖ్య, ప్రజాతంత్రమనే మేలిముసుగులో, మధ్యయుగం వైపు కుందేలు పరుగు తీసింది. భారతీయ హైందవ సంస్కృతిలో అంతర్గతంగా వున్న సామ్రాజ్యవాదం - బానిస సంఘాల సమాఖ్య, మతాల మేలి ముసుగుల్లో మధ్య యుగం వైపు తాబేలు నడక నడిచింది.

పితృ స్వామ్య సమాజం ఆలోచనకి — దైవ సంకల్పమని- అధిక ప్రాధాన్య మిచ్చి, దానికి జన్మనిచ్చే "శ్రమ"ని ద్వితీయ శ్రేణికి తెచ్చినప్పుడే, స్త్రీ స్థానం తలకిందులైంది. అయినా స్త్రీ పురుషునితో సమానంగా అన్ని బాధ్యతల్ని యెలా నిర్వహించిందో, అమృతాశ్వని కథాకాలం నుంచి పురుభానుని కథాకాలం దాకా సూచితమైంది. ఆర్యాసుర జాతుల సమ్మేళనం తరువాత, శ్రమ స్థానంలోవున్న రైతాంగ స్త్రీ జాతుల పరిస్థితింకా అధ్వాన్నమైందం సూచితమైంది. అదేసమయంలో

ఆర్యగణ సంస్కృతి విలువల్ని నిలబెట్టాలనే చోట, రైతు స్త్రీ యెంత స్వేచ్ఛగా వున్నదీ "సుదాసుడు" కథలో వ్యక్తమైంది.

తొలితత్వ శాస్త్రాల - వుపనిషత్తుల - కాలానికి రూపొందిన జ్ఞాన సిద్ధాంతంలో, పురుషుడు తనని తాను వున్నతంగానూ, స్త్రీని ద్వితీయంగానూ పరిగణించడంతో, వెంటనే స్త్రీలలో ప్రతిఘటన తలెత్తింది. ఈ ప్రతిఘటనకి తొలి రూపాన్ని ప్రవాహణ లోపాముద్రల మధ్య వైరుధ్యంగా సూచించాడు రాహుల్జీ. మలిరూపం గార్గి యాజ్ఞవల్కులమధ్య వైరుధ్యంగా వ్యక్తం చేశాడు. అంతేకాదు. ఆ కాలంలో హెచ్చుతగ్గుల్లేని మానవ - స్త్రీ పురుష - సంబంధాలు బౌద్ధ మత సంస్కారంలోనే సాధ్యమన్న సూచన, బంధులమల్ల మల్లికల జీవిత చిత్రణలో నిరూపించాడు.

సామ్రాజ్యవాదం - వ్యాపార విస్తరణ - జాతుల స్వయం నిర్ణయాధికారాన్ని హరిస్తుంది. ఫలితంగా వ్యక్తుల స్వయం నిర్ణయాధికారమూ హరించబడుతుంది. వెరసి సంఘానికి ప్రధాన బాధ్యులైన ప్రజల్ని, బానిసలుగా చేసేస్తుంది. సుదాసుడు కాలానికే అధికారాన్ని కోల్పోయిన ప్రజలు, ఆర్యచాణుక్యుని కాలానికి పూర్తి బానిసలయ్యారని "నాగదత్తుడు" కథ సూచించింది.

బానిసలైన ప్రజల దుస్థితి గ్రీకు సమాజంలోనూ, అది పతనమయ్యాక రోమన్ సమాజంలోనూ, ప్రత్యక్షంగానే కనిపిస్తుంది. భారత సమాజంలో యీ దుస్థితి, చాపకింద నీరులా యెలా కొనసాగిందో, "ప్రభ" కథ, దాని తరువాతి కథలూ వ్యక్తం చేస్తాయి.

క్రీస్తు తరువాత ఏభైయేళ్ళనాటి సమాజ జీవితాన్ని, భావ సంఘర్షణని "ప్రభ" కథ చిత్రించింది. అశ్వఘోషుడి "బుద్ధ చరితం", "సౌందరనందం" కావ్యాలు, వింటర్నిజ్ "భారత సాహిత్య చరిత్ర", రీజ్‌డేవిడ్స్ "బౌద్ధ భారత్" మొదలైన గ్రంథాలు దీని కాధారాలు.

బ్రాహ్మణ సామంత వ్యాపార వర్గానికి వ్యతిరేకంగా, బౌద్ధమతం ప్రజల పక్షం వహించింది. కాని బౌద్ధం వెనక ప్రయాణానికి బీజాలు బుద్ధుని కాలంలో, బుద్ధుని చేతిమీదుగానే పడ్డాయి. అనాత్మవాదంలోకి వేరేరూపంలో, "పునర్జన్మ" ప్రవేశించడం యిందుకొక ఉదాహరణ. యజమానులు అనుమతిస్తే తప్ప, బౌద్ధ సంఘాల్లో బౌద్ధుల్ని చేర్చుకోకూడదన్న నిబంధన రావడం రెండో వుదాహరణ.

ఇలా బౌద్ధంలో యెన్నో అంతర్గత బలహీనతలు తలెత్తాయి. వీటికి ఆనాటి పరిస్థితులు, అగ్నికి వాయువులా తోడయ్యాయి. ఈ పరిస్థితుల్ని ఆసరా చేసుకుని బౌద్ధ మతానికి వుద్వాసన చెప్పాలన్న వైదికార్య పురోహిత ప్రయత్నాలు ఆర్య చాణుక్యుని కాలానికే అవుపిస్తాయి. మౌర్య సామ్రాజ్య పతనం తరువాత, శుంగ

వంశ పాలనా కాలంలో, అవి వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థని పటిష్ట పరుస్తూ కొనసాగాయి.

మౌఖిక కళారూపాల్లో ప్రచారమవుతూ వస్తున్న జాతుల సంఘర్షణల్ని, కుటుంబ కలహంగా మార్చి, "మహా భారతం" కావ్యంగా గ్రంథస్థమైంది. అదే విధంగా రుగ్వేద సుదాసుడి వుత్తమ వ్యక్తిత్వ రూపాన్ని, అగ్నిమిత్రుడికో, పుష్య మిత్రుడికో అన్వయించి కీర్తిస్తూ, వాల్మీకి శుంగ వంశ రాజుల మన్నన కోసం "రామాయణం" కావ్యంగా రచించడం జరిగింది.

ఇలా యిక్కట్టించి, వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థ పునాదిని చెక్కు చెదరకుండా నిలబెట్టే సాంస్కృతిక ప్రయత్నాలుగా - పురాణాలు యితిహాసాలు - యెన్నో గ్రంథస్థమౌతూ వచ్చాయి. ఇవన్నీ మౌలికంగా వేద ప్రమాణాన్ని గుర్తించి బ్రహ్మ - మాయా వాద భావ జాలాన్ని ప్రచారం చేసేవే.

అశ్వఘోషుడు వాల్మీకి కవిత్వ మాధుర్యాన్ని ఆస్వాదించినా, ఆయన సమర్థించిన వర్ణాశ్రమ వ్యవస్థ ప్రవాహ లక్షణాన్ని కోల్పోతోందని గుర్తించాడు. బ్రాహ్మాధికారం కింద చెలామణీ అవుతున్న దురాచార దుర్లక్షణాల్ని, తీవ్రంగా ప్రతిఘటిస్తూ వచ్చాడు. చివరికి తల్లిని, తండ్రిని, వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థని వ్యతిరేకించి గ్రీకు సుందరి "ప్రభ"ని ప్రేమించి వివాహం చేసుకున్నాడు.

మానవ ప్రేమకి సామాజిక - స్త్రీ పురుష - సంబంధాలకి చిరస్మరణీయమైన గుర్తులుగా, ప్రభా అశ్వఘోషులు నిలిచిపోయారు. ప్రభ ప్రణయ సాన్నిహిత్యమే అశ్వఘోషుణ్ణి బౌద్ధ మత జ్ఞాన చైతన్యానికీ, గ్రీకు సంస్కృతీ వికాసానికీ దగ్గర చేసింది. ప్రభా వియోగం తరువాత, అశ్వఘోషుడు తండ్రి-యజమాని-అనుమతితో బౌద్ధాన్ని స్వీకరించాడు.

బౌద్ధ గ్రీకు వేదాంత శాస్త్రాల్లో అసమాన పాండిత్యాన్ని ఆర్జించాడు.

ప్రభకి సన్నిహితమైన కొత్త రోజుల్లో, గ్రీకు నాటక వికాస పద్ధతుల్ని జీర్ణించుకుని, భారత - నాటక - సాహిత్యాన్ని సుసంపన్నం చేశాడు. శాక్య రాజగు కనిష్కునితో బౌద్ధ భిక్షువుగా పురుషపురం - పెషావర్ చేరాడు. శాక్య, గ్రీకు, టర్కీ, పెర్షియన్, భారత దేశాల సమ్మిళిత విజ్ఞాన కేంద్రం పెషావర్. అక్కడ గ్రీకు వేదాంతాన్ని శోధించి, దాన్ని భారతీయ వేదాంతంలో - బౌద్ధ మతంలో ప్రవేశపెట్టి, దాన్ని వికాసవంతం చేశాడు. విజ్ఞాన శాస్త్రం, గణితం, శరీర శాస్త్రం. తత్వ శాస్త్రం - యిలా యెన్నింటినో గ్రీకు శాస్త్రం నుంచి గ్రహించి, భారత జాతి కందించాడు.

క్రీస్తు తరువాత నాలుగు వందల యిరవై నాటిది "సుపర్ణ బౌధేయి" కథ. గుప్తుల కాలపు రికార్డు నుంచి కాళిదాసు రఘు వంశం, కుమార సంభవం, అభిజ్ఞాన

శాకుంతలం నుంచి పాణిని పాహియాన్ల గ్రంథాల్నించి కావల్సిన విషయాన్ని గ్రహించడం జరిగింది. గుప్తుల కాలాన్ని పురోహిత సంస్కృతి స్వర్ణ యుగంగా కీర్తించింది. దాని దృష్టికి అలా కనిపించడం సహజమే. ప్రజల దృష్టి నుంచి చూస్తే, అది చీకటి - మధ్య - యుగారంభమే.

వాల్మీకి వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థని నిలబెట్టడానికి, సాహిత్యంలో వేసిన విత్తనాల్నించి కాళిదాసు "రాజు రక్తం తప్పు చేయదు" అని నమ్మించే సాహిత్యాన్ని పంట పండించాడు కవి కుల గురువుగా భారతీయ సారస్వతంలో నిలిచి పోయాడు.

చిన్నతనం నుంచి వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థ చేత అవమానాలకు గురైన వాడు "సుపర్ణ యౌధేయుడు". అందుకు కారణాల్ని తాతగారి ద్వారా తెలుసుకున్నాడు. తరువాత తన నిరంతరాధ్యయనం ద్వారా, ఆనాటి సమాజాన్ని అర్థం చేసుకున్నాడు. కాళిదాసుకి బాగా సన్నిహితుడయ్యాడు. అపార జ్ఞాన విజ్ఞాన సాగరాలని కాళిదాసే ప్రస్తుతించిన, వసుబంధు, దింగ్ నాగుల పాండిత్యపు లోతుల్ని గ్రహించాడు. వీరితో వాదిస్తే బ్రాహ్మణ మిథ్యా వాదమంతా పేక మేడలా కూలిపోవడం చూశాడు.

సుపర్ణ యౌధేయుడు యెప్పుడూ అశ్వఘోషుడిలా ప్రజల పక్షం వహించమని కాళిదాసుతో వాదించేవాడు. సుఖ భోగ సంపదలకి ప్రాధాన్యమిచ్చి, రాబోయే కవులికి చెడు సాంప్రదాయాన్ని నేర్పుతున్నావని విమర్శించేవాడు. కాళిదాసు "మెత్తని వాణ్ణయిపోయాను" అని తనను తాను సమర్థించుకుని, సుపర్ణుణ్ణి తన దారికి తేవాలని ప్రయత్నించాడు.

సుపర్ణ యౌధేయుడు, "నేను నా శరీరాన్ని యెవరికీ అమ్ముకోను" అని ఖచ్చితంగా చెప్పాడు. చివరికి "నాశనం చెయ్యబడిన నా దేశానికి ప్రాణం పోస్తాను. లేకపోతే యిసక మీద పాద ముద్రలా మాయమై పోతాను." అని నిర్ణయించుకు ప్రయాణమై, యౌధేయకి వెళ్ళాడు.

గణతంత్రాల్లో వున్న ప్రజాస్వామిక విలువల్ని నిలబెట్టడానికి యౌధేయులు, చిట్ట చివరిగా ప్రయత్నించిన కాలమిది. కాని చంద్రగుప్త విక్రమాదిత్య చక్రవర్తి ప్రజాస్వామ్య అవశేషాల్ని కూడా మిగల్చకుండా రూపుమాపేశాడు. ఈ వివరాన్ని రాహుల్‌జీ "జయ యౌధేయ" నవలలో విపులంగా చర్చించాడు. మేనమామా - మేనల్లుళ్ళ — జయుడు చంద్రగుప్త విక్రమాదిత్యుల - త్యాగ భోగ వ్యక్తిత్వాల్ని సమాంతరంగా కళ్ళకి కట్టించాడు. ప్రజాస్వామికపు చివరి వెలుగు రేఖని, రాచరిక మనే రాహువు మింగి జీర్ణం చేసుకున్న వైనాన్ని సూచించాడు.

ఈ కాలాన్ని సమన్వయించుకుని చూస్తే, "బౌద్ధాన్ని కాదని భారత దేశం మత పరంగా ఆత్మహత్య చేసుకుంది" అన్న గురజాడ వాక్యం వెనకున్న వేదన అర్థమవుతుంది. ఈ ఆత్మహత్య గుప్తుల కాలంలో మొదలై - మను ధర్మ

సంస్కృతిగా - హర్షవర్ధనుని కాలం - క్రీ॥ శ॥ 630 - నాటికి పూర్తయింది. ఆత్మహత్య చేసుకున్న సమాజ స్థితి గతుల్ని, సూటిగా చిత్రించింది "దుర్ముఖుడు" కథ. హర్ష చరితం, కాదంబరి, హుయాన్‌సాంగ్, ఇత్సింగ్ యాత్రా వివరాలు ఈ కథకి ఆధారాలు.

హర్ష వర్ధనుని స్వగతం, బాణుని స్వగతం, దుర్ముఖుడి స్వగతం సమన్వయింపకుంటే చాలు, ఆనాటి సమాజం - అందులోని అన్ని మతాలూ, ఎలా కుళ్ళిపోయి, నైతికంగా పతనమైందీ కళ్ళకి కడుతుంది భారత సమాజ సాంస్కృతిక పతనాన్ని సూటిగా చూపించిన బాణం లాంటి యీ కథ "ఈ బ్రాహ్మణ మతం కారణంగానే, కామరూపరాజు మొదలగు సహృదయులు కూడా పిరికి వారయ్యారు. బ్రాహ్మణుల మూలాన్నే, యీ జాతులనేవి యేర్పడ్డాయి. ఐకమత్యం నశించింది. వీరి ధర్మ జ్ఞానాలు రాహు కేతువుల్లాంటివని" తేల్చి చెప్పింది.

ఇంచు మించు ఈ కాలంలోనే, మధ్య ఆసియాలో "మజ్దక్" మతం, రోమన్ సామ్రాజ్యంలో క్రైస్తవ మతం కొనసాగాయి. మజ్దక్ బుద్ధుడి లాగే ప్రజల పక్షాన నిల్చి ఐక్యతని ప్రబోధించాడు. మజ్దక్ మతం గురించి "మధుర స్వప్నం" నవల్లో వివరంగా చర్చించాడు రాహుల్జీ. ఆయన భిక్షుక వాదాన్ని వొప్పుకోలేదు. మానవ జీవితాన్ని ప్రేయసీ ప్రియులు పుత్ర పౌత్రులు జీవితంగా వొప్పుతున్నాడు. నేను నాదీ అనేవే అన్ని కష్టాలకు కారణమన్నాడు. కలిసి కష్టపడి సంపాదించి తిని కలిసి కట్టుగా జీవించాలన్నాడు. జీవహింస కూడదని ప్రేమకి స్వేచ్ఛ వుండాలనీ ప్రబోధించాడు. చివరికి మత బోధకులు రాజు సాయంతో అనుయాయులతో సహా "మజ్దక్"ని పూచకోత కోయించారు. మతాల వికృతత్వానికి వుదాహరణచాలు.

ఇదంతా చూసిన ఒక బౌద్ధ భిక్షువుకి, రాజులు వున్నంతకాలం దానధర్మాలు వుంటాయి. బ్రాహ్మణులుంటారు. వీళ్ళు వున్నంత కాలం పృథ్వీ స్వర్గంకాదు; భూతల స్వర్గం అవడానికి వీల్లేదు" అని అనిపించింది. ఇది నిజం. ఇక్కణ్ణించి భూమ్మీద జీవితం ముఖ్యంగా స్త్రీజాతికి, రైతాంగానికి—నరకంగా మారిపోయింది.

మత విస్తరణ వెనక రాజ్య విస్తరణ వుంటుంది. రాజ్య విస్తరణ వెనక వ్యాపార—మార్కెట్— విస్తరణ వుంటుంది. ఇందుకే మతానికి మినహాయింపు లేదు. రోమన్ సామ్రాజ్యంలో ప్రజలు బానిసలు కావడం, ప్రత్యక్షంగానే కనిపిస్తుంది. మధ్య ఆసియాలోనూ భారత సమాజంలోనూ వర్గ సంఘర్షణలన్నీ, మతాల రూపంలో కొనసాగుతూ వచ్చాయి. ముఖ్యంగా భారత సమాజంలో మాయావాదం ఆదిశంకరుని చేతిలో "అద్వైతం"గా వ్యవస్థీకృతమై, మన సంస్కృతిని మరింత మేకు బందీని చేస్తూ వచ్చింది. మతం మేలి ముసుగులో, దాసత్వ, నరకాలు కొనసాగాయి.

వైదిక ధర్మ పరిరక్షణ పేరున, ఆదిశంకరుడు అనేక పీఠాల్ని స్థాపించాడు మొదటిది ద్వారకా మఠం, రెండోది గోవర్ధన మఠం, మూడవది శారదా మఠం నాలుగోది శృంగేరీమఠం. గుజరాత్, రాజస్థాన్, పాకిస్థాన్‌లో సింధుప్రాంతం, బీహార్ మధ్యప్రదేశ్‌లలో కొంత భాగం ద్వారకామఠం పరిధిలో కొస్తాయి. ఈ మఠం ద్వారకలో వుంది. ఉత్తరప్రదేశ్ బీహార్‌లోని కొంత భాగం బంగ్లాదేశ్, బెంగాల్ అస్సాం, ఒరిస్సా, మధ్యప్రదేశ్‌లోని కొంత భాగం గోవర్ధన మఠం పరిధిలో కొస్తాయి. ఈ మఠం పూరీలో వుంది. కాశ్మీర్, ఢిల్లీ, పాకిస్తాన్, బీహార్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్‌లలోని కొంత భాగం నేపాల్ మొదలైన ప్రదేశాలు శారదామఠం పరిధిలోకొస్తాయి. ఈ మఠం కాశ్మీర్లోని హిమాలయాల్లో వుంది. ఆంధ్ర, తమిళ, కర్నాటక కేరళ, రాష్ట్రాలు శృంగేరీమఠం పరిధిలోకొస్తాయి. ఈ మఠం కర్నాటక రాష్ట్రంలోని శృంగేరీ వద్ద వుంది. అదిశంకరుడి యీ పీఠాల నిర్మాణ వ్యూహాన్ని చూస్తే అతకి మెత్తుగడలర్థమై పోతాయి. ఆ తరువాత విశిష్టాద్వైత మతాల్లాంటి వెన్ని వచ్చినా, అవి మౌలికంగా మాయావాద పరిధిని దాటకపోవడం గమనించాల్సిన విషయం.

ఐక్యతా లక్షణాన్ని, ప్రవాహ లక్షణాన్ని కోల్పోయిన సమాజం, దండెత్తి వచ్చిన ప్రతివాడికీ దాసోహ మనక తప్పదు. మాయావాదం మేలిముసుగులో వున్న పురోహితులు, మొదట్లో దాడి చేసిన వాడినల్లా సూర్యవంశ వారసుణ్ణో, చంద్రవంశ వారసుణ్ణో చేస్తూ వచ్చారు. అదీ సాగని కాలమొచ్చినపుడు, "సలామయా" అని మహమ్మదీయ రాజులికి కైవారాలు చేశారు. మహమ్మదీయులు రాకకి ముందు భారత సమాజం స్థితి గతులెలా వున్నాయో సూచిస్తుంది, "చక్రపాణి" కథ. క్రీస్తు శకం పన్నెండు వందలు కథాకాలం. ఈ కథకి ఆధారాలు "నైషధం" లోనూ, "ఖండన కావ్యం" లోనూ, అనేక శిలాశాసనాల్లోనూ, రికార్డుల్లోనూ దొరికాయి.

హర్షుని తరువాత భారతదేశంలో యెన్నో మార్పులొచ్చాయి. కాని మాయావాదం పుణ్యమాని భారతీయులు, నూతిలో కప్పల్లా స్వార్థ సంకుచిత బుద్ధితో యే అభివృద్ధి లేకుండా, బతుకుని కొనసాగించారు. హర్షవర్ధనుని కాలం నాటికే, అరేబియాలో "ఇస్లామ్" మతం స్థాపింపబడింది. ఒక శతాబ్దం లోపుగా ఆ మతం సింధు నుంచి స్పెయిన్‌దాకా, ప్రతి దేశంలోనూ వ్యాపించింది.

ఇస్లామ్ మతం అలా చొరుకుపోతూ వస్తున్న కాలం, మాయావాదం భారత సమాజాన్ని నిర్వీర్యం చేస్తున్న కాలం వొకటే. సాపేక్షికంగా పరిస్థితులు అనుకూలించి భారత సమాజాన్ని, పళ్లెంలో పెట్టిన ఫలహారంలా, మహమ్మదీయుల కందించాయి. ఈ క్రమానికి తొలి కబళం వీరోచితంగా పోరాడి మరణించిన పృథ్వీరాజ్

చౌహాన్. మరి కబళం సుఖభోగలాలసతతో, అనైక్యతతో, మహమ్మదీయ దండ యాత్రకు ముందు దోహదం చేసి. తరువాత బలి పశువైన జయచంద్రుడు.

ఈ రోజుల్లో ప్రతి రాజూ, బ్రహ్మ-మాయా-వాద సన్యాసి చేతుల్లోనో, బౌద్ధ వాద సన్యాసి చేతుల్లోనో కీలుబొమ్మ. తన మీద తమకి నమ్మకం నశించి, గురువుల మాయో దేవతల మాయో రక్షిస్తుందనే భ్రమల్లో బతుకుతున్నారు. ఈ అంటు రోగం రాజ్యాంగంలోని రాజోద్యోగులకూ పాకి, ఎక్కువమందిని పిరికివాళ్ళగా, భోగలాలసులుగా మార్చేసింది. రాజాస్థానాలన్నీ, అషాఢ భూతులకు నిలయా లయ్యాయి.

చక్రపాణి కథలో, జయచంద్రునికి, సన్యాసికీ జరిగిన సంభాషణ చిత్రిత మైన దృశ్యం, రాజుల భోగలాలస జీవితాన్ని, తురుష్కుల దండయాత్రలు తెస్తున్న విషాదచ్ఛాయల్ని, ఏక కాలంలో ఆవిష్కరించాయి. కవి హర్షుడుతో జయచంద్రుడు చేసిన సంభాషణ, హర్షుని పూసరవిల్లి తత్త్వాన్ని, అతని చేతిలో జయచంద్రుడు కీలుబొమ్మయిన వైనాన్నీ సూచించింది. అదే సమయంలో పృథ్వీరాజ్‌కి, జయ చంద్రుడి సహాయ నిరాకరణాన్నీ వ్యక్తం చేసింది.

చక్రపాణికి, జయచంద్రుడి కొడుకు హరిశ్చంద్రుడికి సాగిన సంభాషణ భావి తరం వృద్ధ తరాన్ని వ్యతిరేకించి, రాజ్యం మహమ్మదీయుల పాలుకాకుండా పోరాడి రక్షించాలని చూస్తోందని తెలియజేస్తుంది. యువతరం సానుభూతి, సమర్థన సంయుక్తా పృథ్వీరాజుల పైనేనని తేల్చింది. అంతేకాదు. కులస్త్రీలను చితుల నెక్కించడం, భోగ స్త్రీలను దాన విక్రయ సర్వాధికారాలతో దాన మివ్వడం, అమ్మడం కొనడం, అతి సామాన్య విషయమని తేల్చింది. రాజపుత్ర జాతిమీదే రక్షణ భారం వుంచి, జాతి మత, కుల విభేదాలతో, అనైక్యతతో శక్తిహీనమైన సమాజ స్థితిగతులన్నీ కళ్ళకి కట్టించింది. చివరికి చక్రపాణి నేతృత్వంలో రాజ్యం తురుష్కుల పాలు కాకుండా రక్షించాలనే విఫల ప్రయత్నాన్ని యువతరం చేస్తుంది. జయచంద్రుని చితినెక్కి రాజాంతఃపుర స్త్రీలు సహగమనం చేస్తారు.

ఇంతవరకూ రాజుల పేరిట రాజ్య విస్తరణ యుద్ధాలు జరిగాయి. ఇక నుంచి మతాల పేరిట రాజ్య విస్తరణ యుద్ధాలు మొదలయ్యాయి. ఆత్మరక్షణకు యేమీ అవకాశం యివ్వని విధంగా, శత్రువుని పూర్తిగా తుడిచిపెట్టేయడమే యీ మత యుద్ధ ధర్మాల ప్రత్యేకత. జయచంద్రుని మరణం తరువాత భారతభూమి మీద, అదే జరిగింది. భారత సమాజం మహమ్మదీయుల పాలనలో కొచ్చేసింది. వాళ్ళ పాలనలో సమాజ స్థితిగతుల్ని "బాబా నూర్‌దీన్", "సుమైయా" కథలు చిత్రించాయి. బాబా నూర్‌దీన్ కథాకాలం క్రీస్తుశకం పదమూడు వందలు, సుమైయా కథాకాలం క్రీస్తుశకం పదహారు వందలు.

బాబానూర్‌దీన్‌ కథలో, అతనికీ, అతని పరివారానికి జరిగిన సంభాషణ అన్ని మతాల్లో వున్నట్టే మహమ్మదీయ మతంలోనూ, మంచి చెడ్డలున్నాయనీ తెలియజేసింది. దోపిడీ, పీడనలున్నాయనీ తెలియజెప్పింది. అయితే గజనీ, గోరీల్లా కొల్లగొట్టి పంపదల్ని దోచుకుని పోవడంగాక, యిక్కడే స్థిరపడి పాటిం చాల్సిన అగత్యం నుంచి, సామరస్య, సహజీవనానికి అవసరమైన సంస్కరణలను అల్లావుద్దీన్‌ ఆరంభం చేశాడని సూచించింది. అవినీతికి దోపిడికి అలవాటయిన వుద్యోగ వ్యవస్థని అదుపు చెయ్యడం, గ్రామాల్లో రైతాంగానికి న్యాయం జరిగేలా పంచాయితీల్ని పునరుద్ధరించడం, సర్వమతాల్ని సమరస భావంతో చూసి, వాటిలో భాగంగా మహమ్మదీయ మత ప్రచారం చేసుకోవడం, అల్లావుద్దీన్‌ అమలు పరిచిన సంస్కరణల్లో ముఖ్యమైనవి. అల్లావుద్దీన్‌ మహమ్మదీయ మత ఛాందసుల్నించి వస్తున్న వ్యతిరేకతని తట్టుకుని, తన సంస్కరణల్ని ఆచరణకి తెచ్చాడు.

ఈ చిన్న మార్పు మాయావాదం మీద హాయిగా బతికేస్తున్న పురోహితులకు కంటక ప్రాయమైంది. హిందువుల్ని హింసిస్తున్నాడని, గౌరవ కుటుంబాన్ని నాశనం చేస్తున్నాడని పాడే పాటనే రైతుల దగ్గర పాడతాడో పురోహితుడు. దాంతో రైతుల "హిందువూ ముస్లిమూ అంటారు. ఆ పదవిలో కొచ్చాక అందరూ వొకటే" అని వాళ్ళ అనుభవాన్ని చెప్పారు. దాంతో పురోహితుడు రెచ్చిపోయి, "ముసల్మాను లను మన స్త్రీలని పాడుచేస్తున్నారని, అందుకునే పరదా కావల్సి వచ్చిందని, సుల్తాన్‌ సైన్యాధిపతి మాలిక్కాఫర్‌ గుళ్ళూ, గోపురాలు నాశనం చేసి, దేవతా విగ్రహాల్ని విరగ్గొట్టి, కాళ్ళతో తొక్కాడని" నరనరానా జీర్ణించిన హిందూమత ఛాందస వాణిని వినిపించాడు. అవన్నీ యెలా అబద్ధాలో, రైతులు తమ అనుభవించి వివరించి, సేట్‌ నిక్కామల్‌ గుడి కట్టిస్తున్నాడని సుల్తానేమీ అన్లేదని చెప్పారు. వెనకటి సుల్తాన్లు భోగలాలసులని, యీ సుల్తాన్‌ పేదలపాలిటి పెన్నిధనీ, అందేతనే ప్రజ లంతా సౌఖ్యంగా వున్నారని అనుకుంటారు.

బాబా నూర్‌దీన్‌ ఐదేళ్ళలో తన సంస్కరణలు తెచ్చిన మార్పుకి ఆనంద పడతాడు.

అంత మాత్రాన, రాజ్యం సుభిక్షమైందని అనుకోలేదు. పక్క నున్న బాబా జ్ఞాన దీన్‌తో, "బీదలు శ్రమిస్తే, ఆ ధనంతో ఆనందించే ధనికులున్నంత కాలం, సౌభ్రాతృత్వం యేర్పడదు. ఈ సుల్తానులు కూడా అంతే. వీళ్ళు మనలో మనకి విభేదాలు పెట్టి బలవంతు లవుతారు. కనక వీళ్ళు నశించాలి." అన్నాడు.

ఇది విన్న బాబా జ్ఞానదీన్‌, "ఆరోజులు కూడా వస్తాయి, సోదరా! ఈ విభేదా లన్నీ నశిస్తాయి. ప్రపంచంలో స్థిరంగా, ప్రేమరాజ్యం యేర్పడుతుంది" అన్న ఆశాభావాన్ని వ్యక్తం చేస్తాడు. రాహులీ యీ పాత్ర ద్వారా తన ఆశావాదాన్ని వినిపించాడు.

మత సామరస్యం వెనకున్న వాస్తవం, మహాసామ్రాజ్య నిర్మాణమే.

ప్రజలు ఆకలిని తీర్చి, దాన్ని అదుపులో వుంచగలిగినంత కాలం, పాలకుల రాజ్యాధికారానికే ముప్పురాదు. అందుకు పాలకుని స్వీయ క్రమశిక్షణ, పరిమిత జీవితమూ మొదటి షరతు. సర్వమత సామరస్యం రెండో షరతు. మొఘల్ సామ్రాజ్య నిర్మాణ క్రమంలో, అక్బర్ నాటికి సాధించబడిన సామాజిక స్థితిగతుల్ని సూచించింది సురైమా కథ.

అక్బర్‌కీ, అతని మిత్రులకీ జరిగిన సంభాషణలో, మత మార్పిడి మంచిది కాదని ప్రజల్ని, ఒక జాతిగా ఐక్య పరచాలని వ్యక్తమైంది. అందుకు హిందూ ముస్లిమ్ పండితులు ఏకీభవించడం లేదని తెల్సింది. దేశ కాల పరిస్థితిలో వచ్చిన మార్పువల్లే, అక్బర్ జోద్‌బాయి- వారి మత విశ్వాసాలను వారు వదులు కోకుండా- వివాహం సాధ్యమైందనీ బయట పడింది. అక్బర్ ప్రతి యింట్లోనూ, యిలాంటి వివాహాలు జరగాలని ఆశిస్తున్నాడని తేలింది. అంతేకాదు. అక్బర్ కాలానికి పాశ్చాత్య క్రైస్తవ-మత ప్రబోధకులు రావడం మొదలైందనీ తేలింది.

పాశ్చాత్య సంస్కృతీ సంపర్కంలో భాగంగా, తుపాకి వాడకంలో కొచ్చింది.

ఈ నలుగురు ముసలి వాళ్ళ ఆశలకు, ఆశయాలకు కార్యరూపమా అన్నట్టుగా అబుల్ ఫజల్ కూతురు సురైయా తోడర్‌మల్ కొడుకు కమల్ ప్రణయ దృశ్యాన్ని చూశారు. అక్బర్‌తో సహా అందరూ ఆనందించారు. అబుల్ ఫజల్ భార్య అంగీకరించినంత తొందరగా, సనాతనాలోచనలున్న తన భార్య అంగీకరించదేమోనని తోడర్‌మల్ అనుమానిస్తాడు. అది కేవలం అనుమానమేనని అతని భార్య రుజువు చేసింది. కమల్ సురైయాల కళ్యాణం జరిగింది. అయితే అది పురోహితుడి చేతి మీద జరగలేదు. ముల్లా చేతి మీదా జరగలేదు. దేశంలో కొత్త త్రివేణినీ కొత్త కోటనీ కడుతున్న మత ప్రవక్త, అక్బర్ చేతి మీదుగా జరిగింది. ఈ విధంగా యీ ప్రేమికులు, ముందు తరాలికి మార్గదర్శకులయ్యారు.

భారత దేశంలో ఐక్యత యేర్పడాలని ఆశించారు.

రేఖా భగత్ కథా కాలానికి- క్రీస్తుశకం పద్దెనిమిది వందల్నాటికి- కంపెనీ పాలన వచ్చేసింది. రేఖా భగత్ రైతుల సంభాషణలో, కంపెనీ పాలన తెచ్చిన జమిందారీ విధానం వల్ల, వారి పరిస్థితి యెంత దారుణ నరకంగా మారిపోయిందో వ్యక్తమైంది. వ్యవసాయం నాశనమైంది. చేతి పనులు నాశనమయ్యాయి. సాలీలు నాశనమయ్యారు. ఒకటేమిటి మొత్తం దేశం మూల్గుల్ని పీల్చేసే క్రమం మొదలైంది.

ఈ క్రమం, యీస్టిండియా కంపెనీల దోపిడీలో భాగంగా సాగిపోయింది. ఈ కంపెనీల్లో వచ్చిన వారు, పైనించి కింది దాకా సాధ్యమైనంత యెక్కువగా

ధనం సంపాదించి, సాధ్యమైనంత తొందరగా, తిరిగి పోవాలని ఆలోచించారు. క్లైవ్ చేసిందిదే. వారన్ హేస్టింగ్స్ చేతసింహాని, రాణుల్ని ఆకలితో మాడ్చి, అయోధ్యా నగంలను బికారుల్ని చేశాడు. కారన్ వాలీస్ పాత భూస్వాములను, ఒకొక్కర్ని ఏపై గ్రామాలకు అధికారుల్ని చేసి, రైతుల్ని మట్టిలో తొక్కేశారు

ఇలాంటి పరిస్థితిలోనే, ఫ్రాన్స్‌లో ప్రజా విప్లవం వచ్చింది. స్వతంత్రం, సమానత్వం సౌభ్రాతృత్వం అనే సిద్ధాంతాల్ని ప్రకటించింది. జమీందార్లని, జాగీర్దార్లని చంపి, జమీందారీ విధానాన్ని తొలగించింది. ఈ విప్లవం ఇంగ్లండ్లో కూడా వస్తుందేమోనని, అక్కడి జమీందార్లూ, జాగీర్దార్లూ వణికి పోయారు. వారిని వొకే వొక విషయం రక్షించింది. అది పారిశ్రామిక విప్లవం. ఇండియా వంటి వలసల్నించి ముడి పదార్థాల్ని తీసుకుపోయి, యంత్రాగారాల్లో వినియోగ వస్తువులుగా తయారు చేసి, మళ్ళీ యీ వలసల మార్కెట్లలోనే అమ్మేవారు. ఈ యంత్రాగారాలే లేక పోతే, ఇంగ్లండులోనూ విప్లవం వచ్చేది.

కారన్ వాలీస్‌చే యీ దేశంలో ఆధునీకరించబడిన భూస్వాములు, జమీందార్లు గ్రామ పంచాయితీల్ని అణిచేశారు. అప్పట్నించీ ప్రజల- ముఖ్యంగా స్త్రీజాతి, రైతాంగం— పరిస్థితి బాగా దారుణమౌతూ వచ్చింది. రేఖా భగత్, అతని భార్యల దుస్థితి అందుకో చిన్న మచ్చ మాత్రమే. సతీ సహగమన దురాచారాల్లాంటివి సరే సరి.

రేఖా భగత్ గడ్డు రోజుల్నించి, అతి కష్టం మీద గట్టెక్కుతున్నప్పుడు జమీందారైన భూస్వామి నుంచి అతని జనం నుంచి, అనేక రకాల దోపిడీ తీవ్ర మైంది. గత్యంతరం లేక, తిరగబడ్డారు. దాన్ని వాళ్ళ భూస్వామికి చెప్పారు. రేఖా భగత్, ప్రతిరోజూ రెండుశేర్ల పాలు గ్రామాధికారి కివ్వమని ఆజ్ఞాపించాడు. పాడి లేని రేఖా పాలెక్కణ్నించిస్తాడు? పాడి పశువులు లేకపోతే, వాడి భార్యనుంచే తియ్యండి పాలని మనుష్యుల్ని పంపాడు. వాళ్ళా పనిని రేఖా కళ్ళముందే చేశారు. ఈ అవమానానికి ప్రతీకారాన్ని తీర్చుకోవాలన్న నిర్ణయానికొచ్చాడు రేఖా భగత్. పెళ్ళాన్ని పుట్టింటికి పంపాడు. తన యిల్లు తగలబెట్టాడు. అందర్నీ తెగనరికాడు. ఈస్టిండియా కంపెనీ కాలు పెట్టింది మొదలు చెలరేగిన గిరిజన రైతాంగం తిరుగు బాట్లుకి, యింత కన్న సామాజిక పీడన యింకేం కావాలి? పీడన భరించలేని ప్రతి రైతూ, ఒక రేఖా భగత్తయ్యాడు.

సర్వ మతాలూ, భావవాదం- మాయావాదం- నుంచే వచ్చాయి. కాని అది శంకరుని మాయావాదం, మనుధర్మ-మృత-సంస్కృతిముళ్ళని కొనసాగించింది. జాతి, మత, కుల విభజనతో, సమాజాన్ని నిర్వీర్యం చేసింది. మత సంఘర్షణల్ని

కొనసాగిస్తూ, మాయావాద భావజాలాన్ని ప్రచారం చేసే బలీయమైన కోటల్ని, భారత వుపఖండంలో విర్మించుకుంది.

మహమ్మదీయ మత పాలకులు, కొద్ది మంది చేసిన కొన్ని సంస్కరణలు, కొంత కాలం ప్రజలకు సుఖాన్నిచ్చాయి. కాని జాతి, మత, కుల విభజన యింకా సంక్లిష్టమై, సమాజం మళ్ళీ నిర్వీర్యమైంది. చివరగా యీస్టిండియా కంపెనీలతో క్రైస్తవ మతం వచ్చింది. సామ్రాజ్యవాద- వ్యాపార విస్తరణ- తత్వాన్ని విజ్ఞాన శాస్త్ర పునరుజ్జీవనం, ఆధునికం చేసింది. ఫ్రాన్స్ విప్లవం, పారిశ్రామిక విప్లవం, దాని బండారాన్ని బయటపెట్టే చైతన్యాన్నందించాయి. భారత వుపఖండంలో కెన్ని మతాలొచ్చినా. కులవ్యవస్థ చెక్కుచెదరలేదు. ఆదిశంకరుని మాయావాదానికున్న ప్రత్యేకతిదే.

అన్ని కాలాల్లో సంక్షోభాలు సృష్టించిన, అనర్థాలికి అణిచివేతలకి గురైంది ప్రజలు. ఈ ప్రజల- స్త్రీల, కార్మిక కర్షకుల- పక్షం వహించి, వారి భవిష్యత్తుకు బాధ్యత వహిస్తూ, "మార్క్స్ వాదం" పంతొమ్మిదో శతాబ్దంలో వచ్చింది. దీనికి మానవుడు మానవుని అభివృద్ధి కేంద్రం.

ఈ లక్ష్యంతోనే యిది భావ, భౌతిక వాద, తాత్విక దర్శనాల్లోని గుణ దోషాల్ని చర్చించి, శాస్త్రీయంగా విశ్లేషించింది. హెగల్ అభివృద్ధి చేసిన గతి తార్కిక భావ వాదం నుంచి, గతి తర్కాన్ని స్వీకరించింది. భౌతిక వాదంలోకి అనివార్యంగా వచ్చిన యాంత్రికతని తొలగించింది. చివరికి "గతి తార్కిక భౌతిక వాదంగా" నిర్మాణమైంది. మానవ చరిత్రను, ఈ శాస్త్రీయ దృష్టితో పరిశీలించేదే చారిత్రక భౌతిక వాదం.

మార్క్స్ వాదం రూపొందుతున్న కాలంలోనే క్రీస్తు శకం 1850 లోనే- "మంగళ సింహుడు" కథ జరిగింది. వారన్ హేస్టింగ్ వేటు పడిన సంస్థానాధీశుల్లో చేతసింగ్ వొకడు. అతని మనవడే మంగళ సింహుడు. ఇతను పెరిగి గొప్పవాడై, తిరిగి సంస్థానాధికారాన్ని సాధించాలని, సాధిస్తాడని తల్లి ఆశ.

క్రైస్తవ ఫాదరీ దంపతుల పోషణలో పెరిగిన మంగళ సింహుడు, క్రైస్తవం తీసుకున్నాడు. వారి దోహదంతో కేంబ్రిడ్జి చదువుకి, ఇంగ్లండుకి వెళ్ళాడు. అక్కడ అతని కందిన యానీ రసల్ ప్రేమ, మార్క్స్- తాత్విక దర్శన-పరిచయం మరో ప్రపంచాన్ని చూపించాయి.

మంగళ సింహుడు క్రైస్తవ మతాన్ని- ఇంకా చెప్పాలంటే మత భావననే- వదిలేశాడు. వలస పాలన భారత దేశంలో సృష్టిస్తున్న బీభత్సాన్ని, ప్రియురాలికి వివరించాడు. వలస పాలకులు స్వార్థంతో చేస్తున్న పనులు, వారికే తెలీకుండా

దేశానికి చేస్తున్న మేలుని గుర్తించాడు. స్వదేశానికొచ్చి, స్వతంత్ర సంగ్రామంలో పాల్గొన్నాడు.

సిపాయిల తిరుగుబాటుకి- హిందూ మహమ్మదీయ- సంస్థానాధీశులు నాయకత్వం వహించారు. కొత్త మత పాలకుణ్ని తరిమేసి, తమ పాత అధికారాల్ని నిలుపుకోవాలన్నదే అక్కడ వారందరి లక్ష్యం. వారి వెనక చూపుని మంగళ సింహుడు వ్యతిరేకించాడు. ఇంగ్లీషు పాలకుల్ని తరిమేశాక, ప్రజల రాజ్యం నిర్మిస్తామన్న నమ్మకాన్ని, ప్రజలకు కల్గించాలన్నాడు. ప్రజల సమర్ధన లేకపోతే జయించలేం గనుక, రాబోయే ప్రజల రాజ్యం ఎలా వుంటుందో, ప్రచారం చెయ్యాలన్నాడు. మతాల్లో వున్న మాయా వాద భావజాలం మత్తులో వున్న నాయకత్వం, మంగళ సింహుని ముందు చూపుని గుర్తించ లేరు. మౌనం వహించింది.

నాయకత్వాని కున్న వెనక చూపు వల్లే, వలస ప్రభుత్వం సిపాయిల తిరుగుబాటుని తేలిగ్గా అణిచేయ గల్గింది. తిరుగుబాటు దార్లందరూ ఆంగ్లేయులికి లొంగి పోయారు. రుహేల్ ఖండ్‌లో వున్న మంగళ సింహుడు మాత్రం, ఓటమి నంగీకరించలేదు. జాతి. మత, కుల వివక్షత లేకుండా అతడు నిర్మించిన సైన్యం, అతనూ మరణించే దాకా పోరాడారు. ఇది చూసిన ఆంగ్లేయులు, భారతీయుల శౌర్య ధైర్య వీరత్వాల్ని శ్లాఘించారు.

జాతీయోద్యమ రాజకీయ పార్టీల-ట్రీ-నాయకత్వాల్లో యీ మాయా వాదపు వెనక చూపు, అనేక రూపాల్లో కనిపిస్తుంది. గాంధీ నాయకత్వం తెలివిగా గతం శిరస్సుని వుత్తరించి, వర్తమానం మొండానికి అతికించి, హాయావాదాన్ని ఆధునీకరించింది. ఆ నాటి రాజకీయ పార్టీలన్నిటి కన్నా, ప్రజల్ని సహకరించింది. క్రీస్తు శకం పంతొమ్మిది వందల ఇరవై రెండు నాటి స్థితి గతుల్ని, "సఫ్‌ధర్" కథ చిత్రించింది.

సఫ్‌ధర్ జంగ్ పాశ్చాత్య పద్ధతి జీవన విధానాన్ని అనుసరిస్తున్న ముస్లిం. ఆకుఫ్సర్డు యూనివర్సిటీలో బారెట్లా చదివిన అతను, భార్య సకేనా చేత గౌను తొడిగించాలని చూశాడు. అది తప్ప మిగిలిన పాశ్చాత్య అలంకరణకి ఆమె అలవాటు పడింది. ఆమెని నౌకర్లు "దొరసాని" అని పిలిచేవారు. సఫ్‌దర్ శంకర్ సింహ్ బాల్య మిత్రులు. వారి పూర్వుల రాజపుత్రులైన హిందువులే. కాని ఈనాడు వొకరు ముస్లిం, మరొకరు హిందువు. ఒకరోజు వారిద్దరూ, దేశ పరిస్థితిని గురించి లోతుగా చర్చించుకున్నారు.

ఆరోజు వాళ్ళిద్దరూ జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిణామాల్ని గురించి వివరంగా మాట్లాడుకున్నారు. వాటి సారాంశ మిది. ప్రపంచం, 1871 నుంచి పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద యుగంలోకి ప్రవేశించింది. సరిగ్గా ఆ యేడాదే-1871

ఏప్రిల్ 2 నుంచి మే 21 దాకా — పారిస్ కమ్యూన్ యేర్పడి, కూలీలు కూడా రాజ్యం చెయ్యొచ్చని రుజువు చేసింది. కమ్యూన్ పతనం నుంచి గుణ పాఠాన్ని తీసుకున్న కార్మిక వర్గ నాయకత్వంలో, మొదటి ప్రపంచ యుద్ధం కాలంలోనే, ప్రపంచ సామ్రాజ్య వాదాన్ని ప్రతిఘటించ గల శక్తిగా, సామ్యవాద శ్రేయోరాజ్యం రష్యాలో ఆవిర్భవించింది,

ఈ అంతర్జాతీయ నేపథ్యంలో, జాతీయ రాజకీయ పార్టీల చైతన్యం ప్రభావితమవుతోంది. సిపాయిల తిరుగుబాటు - 1857 - నాయకత్వం, దాని వెనకచూపు, బలహీనతల వల్ల పతనమైంది. అటు మీదట, జాతీయ కాంగ్రెస్ నాయకత్వంలోకి గాంధీ వచ్చాక, ప్రజలు చైతన్యంతో కదిలినంతగా మును పెప్పుడూ కదల్లేదు. అని వారు గాంధీ నాయకత్వాన్ని విప్లవాత్మకమైనదిగా భావించలేదు. గుణాన్ని గుర్తిస్తూ, దోషాన్ని వ్యతిరేకిస్తూ, ఆ వుద్యమంలో కొన సాగదల్చుకున్నారు. విప్లవాని కవసరమైన అంతర్జాతీయ పరిస్థితి సానుకూలంగా వుంది. కనుక వదులుకోవల్సినవి వదులుకుందుకి సిద్ధమై, విప్లవ పోరాటానికి రైతు, కూలీల్ని సమీకరించడానికి, వారి సహచరులతో ప్రజా వుద్యమంలోకి ప్రవేశించారు.

ప్రజా వుద్యమంలో ప్రతీ చోటా, గాంధీని గుడ్డిగా అనుసరిస్తున్న వారికీ, వీరకీ అభిప్రాయ భేదాలతో, వాగ్వివాదాలు జరిగేవి. చౌరా చౌరీలో వుత్తేజితులైన ప్రజలు పోలీసుల్ని చంపారనే వార్తతో,గాంధీ సత్యాగ్రహాన్ని ఆపేశాడు. ఇది చాలామందిని ఆలోచింపజేసింది. గాంధీ నాయకత్వంలో వున్న వెనకచూపు బలహీనతని గ్రహించిన కొంతమంది, సఫ్దర్ శంకరులతో యేకీభవించారు. వారితో కలిసి, "ప్రజలే విప్లవశక్తి" అని గుర్తించి పని చెయ్యసాగారు.

ఈ మాయావాదం, వెనక చూపు, బలహీనత, బూర్జువా పార్టీలకే పరిమితం కాదు. విప్లవ కమ్యూనిష్టు నాయకత్వాల్ని కూడా అది వదిలిపెట్టలేదు. అంటే బౌద్ధంలాంటి అభ్యుదయ మతాల్లోకి దూరి, వాటిని వెనక ప్రయాణం చేయించి నట్టుగా మార్క్సు వాదుల బుర్రల్లో దూరీ, వీలైనంతగా మార్క్సువా దాన్ని వెనక ప్రయాణం చేయించాలని, శాయశక్తులా ప్రయత్నించింది. ఇంకా ప్రయత్ని స్తోంది కూడా. ఇందు కో వుదాహరణని "ఓల్గా సే గంగా" అనువాదం నుంచే అర్థం చేసుకోవచ్చును.

అల్లూరి సత్యనారాయణ రాజు అనువాదం "సఫ్దర్" కథతో ఆపేశారు. చాగంటి తులసి అనువాదం వచ్చాక, "సుమేరుడు" అన్న మరో కథుందని హిందీరాని నాబోంట్లకి తెల్సింది. అల్లూరి సత్యనారాయణ రాజు, యీ కథని యెందుకు వదిలేశారు ? సుమేరుడు కథ చదివితే, మనకి సమాధానం దొరుకుతుంది.

క్రీస్తు శకం పదొమ్మిది వందల నలభై రెండు "సుమేరుడు" కథాకాలం. ఇతను దళిత కులాల్లో ఒకటైన మాదిగ కులంలో పుట్టాడు. జమిందారీ విధానం భూమిని మింగగా, వీధిన పడిన రైతు దంపతులకు పెట్టాడు. అతని తల్లి యిప్పటికీ వడ్లు దంచి, విసిరి, పొట్టపోసుకుంటోంది, సుమేరుడు మాత్రం సత్పురుషులు స్కాలర్ షిప్పులు సకాలాని కందించిన సహాయాల్ని సద్వినియోగం చేసుకొని, యం.యే. చదువుతున్నాడు.

వరదతో పురకలు వేస్తున్న గంగానది వడ్డున, గాంధీ శిష్యుడికీ సుమేరుడికి సంభాషణ జరిగింది. వేల సంవత్సరాలుగా అణిచివేతకు గురవుతున్న చరిత్ర చోదక శక్తుల్నించొచ్చిన సుమేరుడు, గాంధీ వాదాన్ని పోస్టుమార్టం చేశాడు. అనొక విధంగా ఆధునిక మవుతున్న మాయావాద శవ పరీక్ష, మరో విధంగా గాంధీ తత్వ వ్యక్తిత్వాల సమీక్ష.

సుమేరుడు, గాంధీ హరిజనోద్ధరణ గురించి మాట్లాడుతూ, దాని వెనకున్న రాజకీయోద్దేశాన్ని వివరిస్తూ "హిందువులి తరువాత, బహుశా మా పరమ శత్రువు "హరే" అవుతాడు. అలాంటి వారికి జనుడై వుండడం అంటే, మే మెందుకు యిష్టపడతామో మీరే చెప్పండి" అంటాడు వేల సంవత్సరాలుగా మా ధన మాన ప్రాణాల్ని హరిస్తున్నా, మేం దరిద్రంలో మాడి చస్తున్నా మాట్లాడని దేవుణ్ణి, మేం యెందుకు నమ్మాలంటాడు. అంబేద్కర్ స్వయంగా అన్ని కష్టాల్ని అనుభవించిన వాడైనా, అతని పద్ధతికి అస్పృశ్యతా నివారణకి పూనుకున్నా కాంగ్రెస్ నాయకుల పద్ధతికి తేడా లేనంటాడు. ఇంకా చెప్పాలంటే, యీ పద్ధతి గాంధీ–బిర్లా–బజాజ్‌ల పద్ధతితో వెళ్ళి కలుస్తదంటాడు అంటే, దాని వల్ల అస్పృశ్యుల్లో ఓ చిన్నతరహా సంపన్నవర్గం తయారవుతుందే తప్ప, కోటాను కోట్ల అస్పృశ్యుల స్థితి గతులు మారవంటాడు.

ఇలా సుమేరుడు మార్క్సు వాదం వెలుగులో, అన్ని మతాల్లో వున్న మాయావాదమే అధునికమై గాంధీ వాదమైందని వివరించాడు. అందులో హైందవ మత "మాయావాదం" మోతాదెక్కువని నిరూపించాడు. హైందవ మతాంతర్గత సామ్రాజ్యవాద - వ్యాపార - విస్తరణ, ప్రపంచ సామ్రాజ్య వాద - వ్యాపార - విస్తరణతో చేసుకుంటున్న లాలూచీని సూచించాడు. క్రైస్తవం, యిస్లాం వంటి విదేశీ మతాలూ, రైళ్ళూ, కార్లూ, కార్ఖానాలూ విదేశం కాని మాయావాదుల కళ్ళకి సామ్యవాదం మాత్రమే విదేశీయ మనిపిస్తుంది. మార్క్సు వాదం వెలుగులో మేలుకుని, ఐక్యమవుతున్న శ్రామికుల దృష్టిలో, అది స్వదేశీయ మవుతుంది. అవుతుందేమిటి, కథా కాలం నాటికే అదయి పోయింది. తొలి సామ్యవాద రాజ్యాన్ని మొగ్గలోనే తుంచేయాలని ప్రయత్నించిన ప్రపంచ సామ్రాజ్యవాదం

సృష్టించిన ఫాసిజంతో — రెండో ప్రపంచ యుద్ధంలో - పోరాడుతూ సుమేరుడు మరణించాడు.

ఇప్పుడు నిజమో, అబద్ధమో తేల్చలేం గాని, సుమేరుణ్ణి సాధనంగా చేసుకుని, రాహుల్జీ గాంధీ వాదంమీద చేసిన విమర్శ, అల్లూరి సత్యనారాయణ రాజుకి కాస్త కటువుగానూ, యింకాస్త యిబ్బందిగానూ వుండి వుండవచ్చును. అంచేతనే "ప్రజలే విప్లవ శక్తి" అని భావించసాగారు" అన్న మాటతో కథనీ, పుస్తకాన్నీ ముగించారు. అదే సఫ్దర్ కథ ముగింపులో, తులసి అనువాదమిలా వుంది:

"ప్రజలే విప్లవానికి శక్తిని యిస్తారు. గాంధీ మెదడు యివ్వాదు. ప్రజాశక్తి పట్ల గాంధీ తన అపనమ్మకాన్ని ప్రకటించి, తాను విప్లవ వ్యతిరేకినని, తనకి తాను రుజువు చేసుకున్నాడు".

రాహుల్జీ మూలభావం అనువాదంలో యింత వ్యత్యాసానికి యెందుకు లోనైంది? చాగంటి తులసి అనువాదం మూలానికి న్యాయం చేసేదిగా వున్నట్టనిపిస్తోంది. అయితే అల్లూరి సత్యనారాయణ రాజు తన అనువాదంలో, ఆ వాక్యాన్ని అంత ముక్తసరిగా యెందుకు ముగించినట్టు? అసలు పుస్తకాన్నే ఆ కథతో యెందుకు ఆపేసినట్టు? ఇలాంటి ప్రశ్నలకి అనువాదకునికి గాంధీ - మాయ- మీద వున్న ఆరాధనేనని సమాధానం వస్తోంది. ఆయన అనువాదం చేసిన రోజుల్లో విప్లవ కమ్యూనిస్టు. అధికార మార్పిడి తరువాత. తత్వం ఫిరాయించి, యీయన పార్టీని మార్చి. కాంగ్రెస్ తీర్థాన్ని పుచ్చుకోడం, నాబోటి వాళ్ళ వూహని ఖరారు చేస్తుంది.

కమ్యూనిస్టుల్లో తత్వాల్ని, పార్టీల్ని, ఫిరాయించింది ఆయ నొక్కడే కాదు. చాలామందున్నారు. అలాంటి వాళ్ళందర్నీ దృష్టిలో వుంచుకునే నల్ల రామ్మూర్తి తన తూర్పు సావిత్రి నాటకంలో "తొలుత కమ్యూనిస్టు. తరువాత సోషలిస్టు, కూటి కోసము కాంగ్రెస్సులో చేరిన కూళయిడుగా" అని అలిపించారు నిజానికి, భారత కమ్యూనిస్టుల మీద - గాంధీ - మాయ - ప్రభావ బలంగా వుంది. రాహుల్జీ లాగ గాంధీని, ఆయన వాదాన్నీ గుణ దోష విశ్లేషణ చేసుకుంటూ, కమ్యూనిస్టు వుద్యమ పురోగతికి నాయకత్వం వహించిన వారు కూడా, వారి చివరి దశలో వెనకకి ప్రయాణించడం కనిపిస్తుంది. అందుకు గాంధీ వ్యక్తిగత వ్యక్తిత్వం ప్రకోపించడమే ప్రధాన కారణం. ఇతరుల్ని విమర్శించడం తేలికే గాని, దాని భల్లూకపు పట్టునుంచి బయటపడ్డం మాత్రం చాలా కష్టం. కవి శివసాగర్ యిలా అన్నాడు.

"మాటల్లో మార్క్సిజం
చేతల్లో మను ధర్మం

చీలికల నాలికలవాడు
రెండు ముఖాలున్న వాడు"

మనిషిలో రెండు ముఖాలు, వర్గ సమాజారంభం నుంచీ వున్నాయి. ఈ శతాబ్దం పరిస్థితిని శివసాగర్ కవిత సూచిస్తోంది. రాసిన కవితో సహా, మనుష్యులెవరూ యిందుకు మినహాయింపు కాదు. ఇది అందరికీ అగ్ని పరీక్షే. ఎవరైతే ఆలోచనకి, మాటకి, చేతకి అనివార్యంగా వున్న వైరుధ్యాల్ని తొలగించుకుని, నమ్మిన దాని కోసం పనిచేస్తూ, మరణిస్తారో, వారే తమ నిజాయితీని నిరూపించుకోగల్గుతారు.

రాహుల్జీ వేల సంవత్సరాలుగా మాయావాదం సృష్టిస్తున్న సుడుల్నించి, ముందు తనని తాను బయటపడేసుకున్నారు. వేదోపనిషత్తుల్ని, కావ్యపురాణేతిహాసాల్ని తరచి చూశాకనే, ఆయన బౌద్ధానికి మారారు. బౌద్ధ గ్రంథాల్ని లోతుగా పరిశోధించి, "త్రిపీటికాధిప" అన్న బిరుదు పొందారు. అనంతర అధ్యయన అనుభవాల్నించి, మార్క్సు వాదం దగ్గర కొచ్చారు. దీన్ని కూడా ఆమూలాగ్రం పరిశీలించాకనే, దీనికి నిబద్ధమై జీవితాంతం పనిచేశారు.

మానవజాతి "మాయావాదం నుంచి, మార్క్సు వాదం దాకా" చేసిన నిరంతర ప్రయాణాన్ని, సాధించిన భావ వికాసాన్ని, నిరూపించే చారిత్రకాధారాల్ని సేకరించడానికే, ఆయన జీవితాంతం కృషిచేశారు. ఆ కృషి యొక్క సూక్ష్మ రూపమే, "ఓల్గాసే గంగ" కథలు. కొన్ని కథల విస్తృత రూపాలే నవలలు.

ఆయన చేసిన నిరంతర సాధన, ఆయన్ని "మాయావాదం" నుంచి విముక్తం చేసింది. మార్క్సు వాదానికి దగ్గర చేసింది. ఆయ నందించిన మార్గంలో యెందరో ప్రభావితులయ్యారు. ఇంకా అవుతున్నారు. అవుతూనే వుంటారు కూడా. సముద్రంలో నీటి బొట్టులా వాళ్ళల్లో నేనూ ఒకణ్ణి.

విషయం తెలియడం వేరు, తెలుసుకుని విముక్తం కావాల్సిన దాన్నించి విముక్తం కావడం వేరు. ఆలోచన రావడానికి, అది ఆచరణలో జోడించబడడానికి, యెంత దూరం వుంది. సాపేక్షికంగా ఇందుకు సహకరించవల్సిన జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులూ మారి పోయాయి. ఇంకా వేగంగా మారి పోతున్నాయి. ముఖ్యంగా చారిత్రకంగా, వాస్తవమైన సామ్యవాద శిబిరాల్లోకి చాప కింద నీరులా, సామ్రాజ్యవాద - వ్యాపార విస్తరణ మార్కెట్ల - మాయావాదం వెళ్ళి, దాని వారసుల్ని సృష్టించుకుంది. సామ్యవాదాన్ని రాజ్యాధికారం నుంచి తొలగిస్తోంది. మానసిక, శారీరక శ్రమం మధ్య అనివార్యంగా యేర్పడిన వైరుధ్యాన్ని తొలగించాలని సామ్యవాదం ప్రయత్నిస్తే, దాన్ని రాజ్యాధికారం నుంచి తొలగించి, ఆ వైరుధ్యాన్నింకా పెంచాలని సామ్రాజ్యవాదం ప్రయత్నిస్తోంది.

ఈ చారిత్రక నేపథ్యం మార్క్సు వాదాన్ని - బౌద్ధంలా - వెనక ప్రయాణం

చేయించాలని ప్రపంచ సామ్రాజ్యవాదం నిర్వ ప్రయత్నమే చేస్తోందని చెబుతోంది. ఈ ప్రయత్నంలో మాయావాదం శత సహస్రకోటి ముఖాలై విస్తరిస్తోంది.

ప్రపంచ మతాల్లో వున్న మాయావాదం ముఖాలు మనకి పరిచయమే. అనేక రకాల ఆశ్రమాలుగా పీఠాలుగా, మఠాలుగా విస్తరిస్తున్నాయి. చర్చిలూ, మసీదుల రూపంలో వున్న దాని ముఖాలూ తెల్సినవే. ఇవిగాక యింకా చాలా వున్నాయి. కష్ట జీవితో కల్సి పోరాడి చరిత్రని ముందుకు నడిపించాల్సిన మధ్యతరగతి, "న్యూట్రలైజ్" చేసి, విప్లవ పరిస్థితిని యెప్పటికప్పుడు నీరు గార్పించే "సేఫ్టీవాల్వు"లివి. వివిధరకాల తాత్విక చింతనా సంస్థల ట్రస్టులు, ఫౌండేషన్లు, క్లబ్బులు, విదేశీ మిషనరీ సేవా సంస్థలు, ఇలా యెన్నో జ్ఞాత, అజ్ఞాత రూపాల్లో పోల్చుకోలేని విధంగా, ఇవి విస్తరిస్తున్నాయి. పల్లెనుంచి ఢిల్లీ మీదుగా ఐక్యరాజ్య సమితితో లింకయి, యీసేఫ్టీ వాల్వులికి రక్షణ కల్పిస్తున్న రాజ్యాంగ యంత్రం సంగతి సరే సరి. మూడో ప్రపంచ దేశాల పరిస్థితి స్థూలంగా యిదే.

ఈ మార్కెట్ మాయావాద విష వాగురంలో చిక్కిన మానవజాతిని, చరిత్రని ముందుకు నడిపే శక్తి మార్క్సు వాదానికే వుంది. ప్రస్తుతం ఆరిపోయే ముందు దీపంలా మాయా వాదపు బహు ముఖాలు భగ్గు భగ్గున మండి ఓ వెలుగు వెలగచ్చును. అంతిమంగా మార్క్సువాదం వెలుగులో, కార్మిక వర్గం నాయకత్వం కింద ప్రపంచాన్ని ప్రజలు, జాతుల బృందావనంగా తీర్చి దిద్దు కుంటారు.

మానవ సమాజ పరివర్తనలో ప్రధాన పాత్రని నిర్వహించిన ఆకలి, అధికారాల్లో అధికారం మతాలుగా, మార్కెట్లుగా యెన్ని రూపాంతరాలు చెందునో, ఆ కలనే అణుబాంబు విస్ఫోటనమైనప్పుడు, ఆ అధికారపు కోటలు కూలి పోయాయి. ప్రపంచాన్ని వేలి మీద వెన్న ముద్దగా మార్చుకున్న సామ్రాజ్యవాదపు విశ్వప్రయత్నాలు, దాని ఆయువుని కొంచెం పెంచగల్గుతాయేగాని, మార్క్సు వాదం రాసిన "మరణ శాసనం" నుంచి, దాన్ని తప్పించలేవు.

అయితే చరిత్ర నిర్విరామంగా చేస్తున్న హెచ్చరిక వొకటుంది.

మార్క్సు వాదులు, వాడెంత వుద్దండ పండితులైనా, జీవిత మంతా శ్రమించి పార్టీల్ని, సంస్థల్ని నిర్మించి, వుద్యమాల్ని, నడిపించిన వారైనా, తామున్న సంఘం కన్న తమని యెక్కువగా యెప్పుడు భావించుకుంటారో అప్పట్నించి వారి వ్యక్తిత్వం విచ్ఛిన్నమై, సంక్లిష్టమైన చారిత్రక — ప్రగతి క్రమంలో పతనం కాక తప్పదు. ఇది కుటుంబాల నాయకత్వ స్థానంలో వున్నవారికీ వర్తిస్తుంది. ఈ యెరుకని రాహుల్జీ "ఓల్గా సే గంగ" నాకు చిన్నప్పుడే కల్గించింది. రాహుల్జీకి, ఆయన రచనల్నింకా అవగాహన చేసుకుందుకి దోహదం చేసిన నా జ్ఞాత, అజ్ఞాత గురుపరంపరకి - ముఖ్యంగా డా॥ రాజారావు, యస్. యన్. త్రిపాఠీలకి — ఈ సందర్భంగా నా

ఏప్రిల్ 93

రచయితలు, కవులు, విమర్శకులు, పరిశోధకులు కొందరు ప్రవాహంలో కలగలసి పోతుంటారు. ఇంకా కొందరు ప్రక్కకు జరిగినప్పటికి ప్రవాహంతోనే వెనుక వెనుక వెళ్తుతుంటారు. మరికొందరు కొత్త ఒరవడితో, పాత పంథాలో కాకుండా, నూతన మార్గంలో ప్రవాహానికి ఎదురీదుతుంటారు. అది కూడా ఎవ్వరూ పయనించని దారిలో వెళ్ళడానికి ప్రయత్నిస్తుంటారు. చాలామంది దానిని అంగీకరించినా ఆచరించడానికి గాని, దానికి మద్దతుగా నిలబడడానికి వెనుక ముందు ఆలోచిస్తుంటారు. తెలుగు సాహితీ రంగంలో అటువంటి రచయితల్లో అగ్రగణ్యుడు, ఒక్క మాటలో చెప్పాలంటే ఇప్పటికి ఒక్కడుగానే నిలిచినవాడు సాహు.

ఇటీవల హైదరాబాదులో జరిగిన దళిత రచయితల, కళాకారుల ఐక్య వేదిక రెండు రోజుల మహాసభల్లో సాహు తన సంక్షిప్త ప్రసంగంలో తన మార్గాన్ని గురించి మొత్తం పీడిత వర్గాల గురించి రాసే రచయితల మార్గాన్ని ఆవిష్కరింప జేశారు.

పీడిత ప్రజల జీవితాలను చదివి, వాటిని తమ రచనల్లో ప్రతిబింబింప చేసిన రచయితలను మాత్రమే ఇప్పటికి మనం చూశాం. దానినే మనం పీడిత ప్రజల సాహిత్యంగా చెప్పుకున్నాం. కానీ రాత రూపంలోకి రాకుండా ప్రజల ఎదలోయల్లో దాగిన సామాజిక, సాంస్కృతిక, చారిత్రక విషయాలను దాచుకున్న పాటలు, కథలు కూడ సాహిత్యంగా చూడాలి. వాటికి ఒక సాహిత్య రూపం ఇవ్వాలి. అందులోనే పీడిత ప్రజల జీవితం, చరిత్ర, సంస్కృతి ఇమిడి ఉన్నాయి" అని సాహు తన ప్రసంగంలోనే కాకుండా, మా చర్చల్లో అనేకసార్లు బయట పెట్టారు. దానికి ఆయన మాటలకు మాత్రమే పరిమితం కాకుండా, 'కొమురు భీం' నవల రచనతో ఆచరించి చూపారు. ఆ విధంగా తెలుగు యువ రచయితలో ఒక నూతన ఆచరణకు బాట వేశారు.

ఈ విషయంలో రాహుల్‌కు సాహుకు సారూప్యత ఉంది. కాగా సాహు తన లక్ష్యాన్ని పరిపూర్తి చేయకుండానే మనల్ని వదిలి వెళ్ళిపోయారు. దేశ సంచారం చేస్తూ, ఆయా ప్రాంతాల్లో లభించిన భౌతిక, చారిత్రక, ఆధారాలతో పాటు ప్రజల్లో ప్రచారంలో ఉన్న అనేక అంగాలను స్వీకరించి అనేక అంశాలపై రాహుల్ విలువైన గ్రంథాలను రచించారు. ఆయన రచనల్లో జీవం కనిపిస్తుంది. ఆయన నవలల్లో భౌతిక వాస్తవికత, చరిత్ర దర్శనమిస్తుంది. ఆ తర్వాత రాహుల్ మార్గాన్ని ఎన్నుకొని 'ఎవరిదీ అడవి', 'ఒక తల్లి' లాంటి నవలలు, మరెన్నో

చేయించాలని ప్రపంచ సామ్రాజ్యవాదం నిశ్వ ప్రయత్నమే చేస్తోందని చెబుతోంది. ఈ ప్రయత్నంలో మాయావాదం శత సహస్రకోటి ముఖాలై విస్తరిస్తోంది.

ప్రపంచ మతాల్లో వున్న మాయావాదం ముఖాలు మనకి పరిచయమే. అనేక రకాల ఆశ్రమాలుగా పీఠాలుగా, మఠాలుగా విస్తరిస్తున్నాయి. చర్చిలూ, మసీదుల రూపంలో వున్న దాని ముఖాలూ తెల్సినవే. ఇవి గాక యింకా చాలా వున్నాయి. కష్ట జీవితో కల్సి పోరాడి చరిత్రని ముందుకు నడిపించాల్సిన మధ్యతరగతి," "న్యూట్రలైజ్" చేసి, విప్లవ పరిస్థితిని యెప్పటికప్పుడు నీరు గార్పించే "సేఫ్టీవాల్వ్" లివి. వివిధరకాల తాత్విక చింతనా సంస్థల ట్రస్టులు, ఫౌండేషన్లు, క్లబ్బులు, విదేశీ మిషనరీ సేవా సంస్థలు, ఇలా యెన్నో జ్ఞాత, అజ్ఞాత రూపాల్లో పోల్చుకోలేని విధంగా, ఇవి విస్తరిస్తున్నాయి. పల్లెనుంచి ఢిల్లీ మీదుగా ఐక్యరాజ్య సమితితో లింకయి, యీ సేఫ్టీ వాల్వులికి రక్షణ కల్పిస్తున్న రాజ్యాంగ యంత్రం సంగతి సరే సరి. మూడో ప్రపంచ దేశాల పరిస్థితి స్థూలంగా యిదే.

ఈ మార్కెట్ మాయావాద విష వాగురంలో చిక్కిన మానవజాతిని, చరిత్రని ముందుకు నడిపే శక్తి మార్క్సు వాదానికే వుంది. ప్రస్తుతం ఆరిపోయే ముందు దీపంలా మాయా వాదపు బహు ముఖాలు భగ్గు భగ్గున మండి ఓ వెలుగు వెలగచ్చును. అంతిమంగా మార్క్సువాదం వెలుగులో, కార్మిక వర్గం నాయకత్వం కింద ప్రపంచాన్ని ప్రజలు, జాతుల బృందావనంగా తీర్చి దిద్దు కుంటారు.

మానవ సమాజ పరివర్తనలో ప్రధాన పాత్రని నిర్వహించిన ఆకలి, అధికారాల్లో అధికారం మతాలుగా, మార్కెట్లుగా యెన్ని రూపాంతరాలు చెందునో, ఆ కలనే అణుబాంబు విస్ఫోటనమైనప్పుడు, ఆ అధికారపు కోటలు కూలి పోయాయి. ప్రపంచాన్ని వేలి మీద వెన్న ముద్దగా మార్చుకున్న సామ్రాజ్యవాదపు విశ్వప్రయత్నాలు, దాని ఆయువుని కొంచెం పెంచగల్గుతాయేగాని, మార్క్సు వాదం రాసిన "మరణ శాసనం" నుంచి, దాన్ని తప్పించలేవు.

అయితే చరిత్ర నిర్విరామంగా చేస్తున్న హెచ్చరిక వొకటుంది.

మార్క్సు వాదులు, వారెంత వుద్దండ పండితులైనా, జీవిత మంతా శ్రమించి పార్టీల్ని, సంస్థల్ని నిర్మించి, వుద్యమాల్ని, నడిపించిన వారైనా, తామున్న సంఘం కన్న తమని యెక్కువగా యెప్పుడు భావించుకుంటారో అప్పట్నించి వారి వ్యక్తిత్వం విచ్ఛిన్నమై, సంక్లిష్టమైన చారిత్రక — ప్రగతి క్రమంలో పతనం కాక తప్పదు. ఇది కుటుంబాల నాయకత్వ స్థానంలో వున్నవారికీ వర్తిస్తుంది. ఈ యెరుకని రాహుల్జీ "ఓల్గా సే గంగ" నాకు చిన్నప్పుడే కల్గించింది. రాహుల్జీకి, ఆయన రచనల్నింకా అవగాహన చేసుకుందుకి దోహదం చేసిన నా జ్ఞాత, అజ్ఞాత గురుపరంపరకి - ముఖ్యండా డా॥ రాజారావు, యస్. యన్. త్రిపాఠీలకి — ఈ సందర్భంగా నా

→కథలు, సామెతలు, ఇవ్వన్నీ సాహిత్యంగానే చూడాలి. వాటిని సేకరించి, వాటికి ఒక రూపకల్పన చేసి అక్షర సాహిత్యంగా మలచాలి.

పల్లెల్లో, వెన్నెల రాత్రుల్లో అరుగులమీద, బజారు బండలమీద కూర్చొని చెప్పే కాకమ్మ కథలతో నృత్యాలను మలిచి, నాట్య చరిత్రలో ఒక నూతన అడుగులను వేస్తున్న మల్లికా సారాభాయి లాంటి నృత్యకారిణి కృషి కూడ మనం ఈ సందర్భంగా గుర్తుంచుకోవాలి. దోపిడి, బ్రాహ్మణ సాహిత్య పెత్తనానికి వ్యతిరేకంగా పోరాడాలని నిర్ణయించుకున్న ప్రతి ఒక్కరూ మౌఖిక ప్రజా సాహిత్యాన్ని అక్షర సాహిత్యంగా మలిచితే తప్ప విజయం సాధించలేరు. రాహుల్, మహాశ్వేతాదేవి బాటలో ముందుకు సాగిన సాహూ మనందరికి, యువ రచయితలకు ఆదర్శం కావాలి. అటువంటి ఏటికి ఎదురీదే ప్రవృత్తిని రచయితలు అలవరచుకొని నూతన కోణాలను ఆవిష్కరించాల్సిన అవసరముంది. రాహుల్—సాహూల్ మార్గమే పీడిత, దళితం, ప్రజా రచయితలకు ఆదర్శం.

---

(6 వ పేజీ తరువాయి)

ధైర్యంతో, లక్ష్యం పట్ల అచంచల విశ్వాసంతో ఎదుర్కొన్నారు. పీడిత ప్రజల హృదయాలలో చెరగని ముద్ర వేశారు. దీర్ఘకాలిక ఉద్యమానికి పునాదులు వేసుకున్నారు.

అదే....రాయలసీమ పెత్తందార్ల అధినాయకుడయిన కోట్ల విజయభాస్కర రెడ్డికి ఎక్కువ చికాకు కలిగించింది. శేషన్‌తో వచ్చిన వైరుధ్యం కూడా తోడు కాగా, గతంలో వలె భారీ రిగ్గింగు కాక, అడుగడుగునా జాగ్రత్తలు తీసుకోవలసి వచ్చింది. అందుకే ఈ ఎన్నికలు ఆయనకు తీవ్ర మనస్తాపం కలిగించాయి. కనుకనే పోలీసుల్తో సహా ప్రభుత్వ యంత్రాంగాన్ని 'భయప్రలోభా'లతో లొంగదీసుకున్నారు. కనీస ప్రజాస్వామిక సూత్రాలను కూడా గాలి కొదిలేసి 'దొంగ వోట్లు - దొంగ నోట్ల'తో జరిగిన పాణ్యం ఎన్నికలను రద్దు చేయాలని కోరటం సమంజసమూ, సమర్థనీయమూ !

తెలంగాణాలో పోలీసు పహరాలోనూ, కోస్తా జిల్లాల్లో డబ్బూ, కులము ఆధారంగానూ, రాయలసీమలో సాయుధ పెత్తందార్ల అగడాలతోనూ జరిగే ఎన్నికల ప్రహసనాన్ని ప్రజలు ఎంతగా అర్థం చేసుకుని అసహ్యించుకుంటారో, వాటిని తిప్పి కొడతారో అంతగా రాజకీయ ప్రజాస్వామ్య విలువలు నెలకొంటాయి. పాణ్యం ఎన్నికలు అందుకు ఎంతో ఒకింత దోహదపడ్డాయి.

(6-4-93)

## 'ఓల్గా నుంచి గంగకు' - ఒక పరిచయం

— కాత్యాయనీ విద్మహే,

'ఓల్గా నుంచి గంగకు' అనే పుస్తకం విడి విడి కథల రూపంలో వుండి ఆ కథలన్నింటికి మధ్య ఒక అంతర్గత అనుస్యూత సంబంధం వుండి వేల సంవత్సరాల మానవ చరిత్రను, సంబంధాలను నిరూపించిన ఇతిహాస స్వభావం గల రచన. ఈ కారణం వల్ల ఇది నవలను చదివిన అనుభూతి నిస్తుంది. సమాజ పరిణామ క్రమ చరిత్రను నిరూపించిన గ్రంథంగా ఒక చారిత్రక రచన అనిపిస్తుంది. ఈ పరిణామ క్రమంలో భాగంగా ఉత్పత్తి శక్తుల ఎదుగుదలను దానితో పాటు మారుతూ వచ్చిన ఉత్పత్తి సంబంధాలకు న్యాయ సంబద్ధతను చేకూర్చటానికి వచ్చిన రాజ్య స్వభావాన్ని నిరూపించిన గ్రంథంగా రాజకీయ అర్థశాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్న అనుభవాన్నిస్తుంది. ఇంత విస్తృతమైన పరిధి నుండి పరిణమించిన 'ఓల్గా నుంచి గంగకు' పుస్తకం ద్వారా రాహుల్ సాంకృత్యాయన్ రాజకీయార్థిక దృక్పథం నుండి ఉత్పత్తి సంబంధాలను, రాజ్య స్వభావాన్ని, మానవ సంబంధాలను అందులో భాగంగా స్త్రీ పురుష సంబంధాలను అధ్యయనం చేసే వాళ్ళకు దగ్గరివాడయ్యాడు. ఆయన జీవిత తాత్త్విక దృక్పథానికి ప్రతినిధి రచన అయిన 'ఓల్గా నుంచి గంగకు' పుస్తకాన్ని విశ్లేషించి అవగాహన చేసుకోవటం రాహుల్ సాంకృత్యాయన్ శతజయంతి సందర్భంగా మన బాధ్యత.

జాతీయోద్యమ కాలంలో జైలు జీవితాన్ని అనుభవిస్తూ 1941 లో రాహుల్ సాంకృత్యాయన్ ఈ పుస్తకాన్ని వ్రాశాడు. ప్రస్తుతం చాగంటి తులసి తెలుగులోకి అనువాదం చేసిన ఈ పుస్తకం విశాలాంధ్ర ప్రచురణగా (1986) తెలుగు వాళ్ళకు అందుబాటులో వుంది. ఇందులో ఇరవై కథలున్నాయి. క్రీ.పూ. 6,000 సంవత్సరాల నుండి క్రీ.శ 1942 వరకు దాదాపు ఎనిమిది వేల సంవత్సరాల మీద సాగిన మానవ కథా వికాసాన్ని సజీవ మానవ సంబంధాల నుండి రూపు కట్టించిన కథలివి.

మొదటి కథ నిశ. ఓల్గా తీరం ఎగువ భాగాన క్రీ.పూ. ఆరువేల సంవత్సరాల నాటి జీవితం ఇందులో వుంది. మాతృస్వామిక కుటుంబ పెద్ద నిశ. ఆమె నాయకత్వంతో గుంపు వేటాటి ఆహారాన్ని సంపాదించుకొంటుంది. బాణాలు, బల్లాలు వాళ్ళ ఆయుధాలు. సహజంగా ఏర్పడిన కొండ గుహలు వాళ్ళ ఆవాసాలు. అప్పటికే నిప్పు కనుగొన బడింది. కనుక పాక్షికంగా ఆహారాన్ని కాల్చుకొనే, ఉడకబెట్టుకొనో తినటం తెలుసుకొన్నారు. తల్లి యాజమాన్యం గల ఈ గుంపులో పెత్తనం కోసం స్త్రీల మధ్య పెనుగులాట మొదలైంది.

రెండవ కథ దివ. క్రీ.పూ. మూడువేల అయిదు వందల సంవత్సరాల క్రితం ఓల్గా తీర మధ్య భాగంలో జరిగింది. తల్లుల ప్రాధాన్యత కలిగిన సమూహాల సహజీవనంగా గుంపు జీవితం రూపొందింది. వేట క్షేత్రాల మీద అధిపత్యం కోసం గుంపుల మధ్య సంఘర్షణలు మొదలైనాయి. దివ సమూహం, ఉష సమూహంతో అలాంటి యుద్ధాలే చేసింది. అడవిలో జంతు సమూహాలు నిలిచి వుండటానికి వీలుగా వాటి ఆహారపు అవసరాలను తీర్చటానికి గాను గడ్డి విత్తనాలను తేమ నేలలో చల్లి గడ్డి పెంచటం రూపంలో తొలి వ్యవసాయం ప్రారంభమైంది. గుంపు యుద్ధాలలో ప్రాణాలు కోల్పోయిన వారి సంబంధీకులు యుద్ధం యొక్క అమానవీయ లక్షణాన్ని గుర్తించటం కూడా ఈ దశలోనే కనబడుతుంది. యుద్ధం చేయటానికి తగిన శక్తి సామర్థ్యాలు చాలని వాళ్ళు ఓల్గా తీర ప్రాంతాలను వదిల వలస పోవటం ప్రారంభమైంది.

మూడవ కథ అమృతాశ్వుడు. క్రీ.పూ. మూడువేల సంవత్సరాల క్రితం మధ్య ఏషియా ప్రాంతాలలో కురు సమూహాల జీవితాన్ని చిత్రించింది. పశు సంపద పోగుపడి ఆ సంపదను హరించటానికి గుంపుల మధ్య దాడులు, దోపిడీలు సాధారణమవుతున్న స్థితిలో స్త్రీలు కూడా పశువులతో పాటు హరించుకుపోయే వస్తువులయ్యారు. పశుసంపద మీద పురుషుడు యాజమాన్యాన్ని స్థిరీకరించుకొని స్త్రీని గృహపత్నిగా చేసిన చారిత్రక దుస్సంఘటన గురించి అమృతాంశుడు వేదన పడతాడు స్త్రీ పురుషులు స్వతంత్రులుగా, స్వచ్ఛందంగా కలిసి జీవించిన సామాజిక అవశేషాల గురించి కథలుగా చెప్పుకొంటున్నారు. ఆ సమూహాలలోని మంచిని నిలబెట్టుకొంటూ తన ప్రేయసి మధురతో సమాన సహచర స్వభావం కలిగిన జీవితాన్ని జీవించాలని ఆకాంక్షిస్తాడు. పశు సంపద అపహరణలో భాగంగా ప్రతిపక్షపు గుంపు జనాన్ని అందరిని చంపటమే ఆ నాటి ధర్మం. స్త్రీలను మాత్రం పట్టి తీసుకు వచ్చి తమ గుంపులోకి భార్యలుగా స్వీకరించటం జరిగింది. ఆ రకంగా బహు భార్యాత్వం మొదలైన దశలో ఈ కథ ముగుస్తుంది.

నాలుగవ కథ పురుహూతుడు. క్రీ.పూ. రెండువేల ఐదువందల సంవత్సరాల నాటి మధ్య సమూహాల జీవితాన్ని కేంద్రంగా చేసుకొని నడుస్తుంది. వ్యవసాయం, పశుపోషణ పక్క పక్కనే సాగుతున్నాయి. స్థిర నివాస గ్రామాల వల్ల, రాగి ఆయుధాల వల్ల పెరుగుతున్న స్వార్థం పట్ల, యుద్ధ క్రౌర్యం పట్ల పశు పోషకాశీమానుల వ్యతిరేకత ఇందులో కనబడుతుంది వ్యవసాయ సమాజంలో అభివృద్ధి చెందిన వస్తు వినిమయ పద్ధతి వ్యాపారం, అందులోను ఆహార వస్త్రాదులను ఇచ్చి రాగి పాత్రలు, వెండి, బంగారు ఆభరణాలు కొనుక్కునే పద్ధతి సమూహాన్ని ఆకట్టి

(తరువాయి వచ్చే సంచింలో)

(4 వ పేజీ తరువాయి)
పాఠ్గాని సంవత్సరాల తరబడి జైలు జీవితాన్ని గడపటానికి వెనుకాడని ఉద్యమ కార్యకర్త రాహుల్ సాంకృత్యాయన్.

దేశ దిమ్మరితనాన్ని గురించి ఆంగ్లకవి కీట్స్ చెప్పిన దాన్ని రాహుల్జీ అమలు పర్చాడా అన్నట్టుంటుంది ఆయన జీవితం.

విశేష ప్రశంసలనందుకున్న 'ఓల్గా నుంచి గంగాతీరం' ప్రథమ ముద్రణకు 23-6-42న పీఠిక రాస్తూ ఆయన యిలా అన్నారు:

"ప్రతి ఒక్క కాలానికి చెందిన భారతదేశ సాంఘికరూపాన్ని సత్యబద్ధంగా చిత్రించటానికి ప్రయత్నించాను. ఇటువంటి ప్రథమ ప్రయత్నంలో కొన్ని పొరపాట్లు దొర్లటానికి అవకాశం లేకపోలేదు. భావికాలానికి రచయితలు ఇంతకంటే సరియైన సత్య సమ్మతమైన భారత స్వరూపాన్ని చిత్రించగలిగితే అది నా అదృష్టంగా, నేనే సాధించిన విజయంగా భావిస్తాను."

సమస్త శాస్త్రాల కృషి, అధ్యయనమూ సత్యాన్వేషణ కొరకే! విశాల ప్రజారాశుల ప్రగతికి తోడ్పడనిదేదైనా నిరర్థకమే. సత్యాన్ని రాబట్టటానికి జరిగిన కృషిలో రాహుల్జీ ఒక మైలురాయి వంటివాడు. ఆయన మనకందించిన గీటురాళ్ళ కొన్ని అరిగిపోయి ఉండొచ్చు, మరికొన్ని కరిగిపోయి వుండొచ్చు. ఆయన కోరినట్టుగా చారిత్రక విశ్లేషణా పద్ధతుల్లో మరింత శాస్త్రీయతను — అభివృద్ధి చేసిన వారున్నారు గానీ ఆయనలాగా సామాన్య పాఠకులకు అర్థం అయ్యే విధంగా సాహిత్యరూపాన్ని అన్వయించినవారు మహాశ్వేతాదేవి లాంటివారు తప్ప దాదాపు లేకపోవటం — మినుకు మినుకు మంటూ వెలిగిన ఒక 'సాహు' కూడా యిటీవలే ఆరిపోవటం మన దురదృష్టం.

రాహుల్జీ కూడా వివాదాలకు అతీతుడుగా జీవించలేదు. భాషా విషయంలో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం కూడా విడిచిపెట్టాల్సివచ్చింది. చివరి క్షణంలో పార్టీ సభ్యుడు కాకుండా చనిపోతాననే ఆవేదన ఆయినకి తీవ్రంగా కలిగిందంటే - మార్క్సిజం పట్లా, కార్మిక - కర్షక పీడిత జనావళి పట్లా ఆయనకు గల విశ్వాసమే అందుకు కారణం.

"సంకుచితమైన జాతీయతని ప్రచారం చేసే మహానుభావులు ఆత్మవంచనా పరవంచనా చేస్తున్నారని" హిందూ మతోన్మాదుల్ని ఆయన నిశితంగా విమర్శించాడు. తన రచనల్లో సందర్భశుద్ధికి నష్టం కలుగకుండా....గతాన్ని గురించిన అపోహలను, అగ్రవర్ణ అభిజాత్య భావజాలాన్ని, రాచరిక ఫ్యూడల్ సంస్కృతిని, వర్ణ వివక్షతను, దోపిడీ పీడనల్ని అడుగడుగునా ఎండగడుతూ, వ్యతిరేకించాడు.

పీడిత ప్రజా దృక్పథంతో కూడిన చరిత్ర రచనకూ, ప్రజాస్వామిక సాంస్కృతిక భావజాల వ్యాప్తికీ పునాదులు వేసిన్న అవిశ్రాంత కలం యోధుని 'శత జయంతి సందర్భంగా రాహుల్జీకి ప్రజాసాహితి' నివాళు లర్పిస్తోంది. ఆయన స్ఫూర్తిని రచయితలు — కళాకారులు గైకొనాలని కోరుతోంది. (8-3-93)

పిల్లల ప్రపంచం

# రాహుల్ తాత - మనకో సంపద !

పిల్లలూ—

ఇదిగో ఈ సంచిక మీరందరూ జాగ్రత్తగా దాచి ఉంచుకొని, ఇంకా ఎదిగాక అప్పుడు తిరిగి చదువుకోండి. ఇందులో 'రాహుల్' తాతగారి గురించి, ఆయన రచనల గురించి అనేకమంది పెద్దల అభిప్రాయాలున్నాయి. అందరివీ చదవండి. తర్వాత మీ అనుభవాలతో వాటిని పోల్చుకోండి.

తాతగారి మొదటిపేరు కేదారనాథ్ పాండే ఆయన తన గ్రామాన్ని బాల్యంలోనే వదిలి వెళ్ళి యాభై సంవత్సరాల వయసు వచ్చేంతవరకూ తిరిగి అటు వెళ్ళలేదంట. ఆయన స్వేచ్ఛ కావాలని కోరుకున్నాడు. అందుకే తను ఒక్కొక్క విషయం అర్థం చేసుకుంటున్న కొద్దీ కొత్త కొత్త ఆలోచనలకు దగ్గరగా జరిగారు.

మనలో చాలామందికి తెలుగు వచ్చు. కొందరికి ఇంగ్లీష్, మరి కొందరికి హిందీ. రాహుల్ తాతగారిక్కి భారతీయ భాషలన్నింటితోనూ పరిచయం ఉంది. కొత్త భాష నేర్చుకోవటం అంటే ఆయనకు సరదానే కాదు. త్వరగా నేర్చుకోగల శక్తి ఉంది. టిబెటన్, చైనీస్, మంగోలియన్, ఫ్రెంచ్, జర్మన్ భాషలు కూడా ఆయనకు పరిచయం ఉంది. ఆయన పేరు రాహుల్ సాంకృత్యాయన్‌గా మారింది బౌద్ధమతంలో చేరాక.

'ఓల్గా నుండి గంగ వరకు' అనే పుస్తకం ఆయన రాశారు. ఇంకా చాలా రాశారు. ఆయన రష్యా వెళ్ళారు. అక్కడ ఓ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నారు. అలాగే చైనా వెళ్ళారు. ఏక్కడికి వెళ్ళినా ఆయన తిరిగి భారతదేశం వచ్చేవారు. ఆ దేశాల్లో ఆయనకు ఉండాలనిపించేది కాదంట. ఆయన ఏమన్నారంటే-

"ఏ దేశంలోనో భూలోక స్వర్గం ఉంటే లాభం ఏమిటి? అటువంటి భూలోక స్వర్గాన్ని స్వయంగా మనదేశంలో స్థాపించుకోవాలి. అందుకే భారతదేశం తిరిగి వచ్చాను".

ఆయన రచనలే కాదు. ఆయన జీవితమే ఓ నిధి. ఆయన ప్రతి అనుభవమూ ఓ సంపదే.

అందుకే 'రాహుల్' తాత గురించి మరింత ఎక్కువగా తెలుసుకోండి

నిరంతరం నేర్చుకోవటం, ప్రయాణం చేయటం, స్వేచ్ఛ కోసం ఆరాటం ప్రజలందరి క్షేమం తాతగారి ఆశయాలు.

అలాంటి గొప్పవారినుంచి మనం ఎప్పుడూ ప్రేరణను పొందాలి.

మీ

—మామయ్య.

## చైతన్య వాహిని

**అరుణోదయ, విజయవాడ బృందం :**

★ 5-2-1993 న. గుంటూరు జిల్లా పొన్నెకల్లులో జరిగిన సారా వ్యతిరేక బహిరంగ సభలో అనేక సారా వ్యతిరేక పాటలు పాడారు. 'శబ్దం' వీధి నాటకాన్ని ప్రదర్శించారు.

★ 14-2-1993న. విజయవాడలోని గిరిపురం స్క్యూకాలనీ ప్రజలూ, ప్రత్యేకంగా ఆహ్వానింపబడిన పత్రికా విలేకరులూ, కళాభిమానులూ 'శబ్దం' నాటకాన్ని చూశారు. 'సారాపై నిశ్శబ్ద యుద్ధం' 'సారా గుండెలపై సారించిన శబ్దం' అంటూ వివిధ పత్రికల సాంస్కృతిక విలేకరులు సమీక్షలు చేశారు.

**అరుణోదయ, మచిలీపట్టణం శాఖ**

★ 10-2-1993న. మచిలీపట్టణంలో జరిగిన బహిరంగ సభలో అరుణోదయ మచిలీపట్టణ కళాకారులు జనం పాటలు పాడారు. బాల కళాకారులు, 'నగారే హే సగా' నృత్యం, 'డప్పు కొట్టు సెంద్రన్నా' నృత్యం ప్రదర్శించారు. అనంతరం మచిలీపట్టణం అరుణోదయ కళాకారులు 'శబ్దం' నాటకాన్ని ప్రదర్శించారు.

**అరుణోదయ - నల్లగొండ జిల్లా**

★ 20-2-93 నుండి 25-2-93 వరకు ఆరు రోజుల పాటు నల్లగొండ జిల్లా నకిరేకల్లు తాలూకా కట్టంగూరులో అక్కడి గ్రామ సమస్యలపై అరుణోదయ, నల్గొండ జిల్లా కళాకారులు డప్పు నృత్యాలతో, విప్లవ గేయాలు పాడుతూ దాదాపు 10 గ్రామాల్లో విస్తృతంగా ప్రచారం చేశారు. కరువు, మంచినీటి సమస్య మొ॥ వాటిపై పాటలు రాసి పాడారు.

---

### వచ్చే సంచికల్లో...

— గద్ది (కథ) — బొమ్మిడి జగదీశ్వర రావు

— కల్లోల కలల మేఘం (సమీక్ష) — అద్దేపల్లి రామ్మోహనరావు

— గురజాడ కన్యాశుల్కాన్ని యిప్పుడెలా అర్థం చేసుకోవాలి? (సమీక్ష)

—రోడ్డుమీద గులాబీ (సమీక్ష) — సుకన్యామల.

— రాహుల్ తాత వ్యాసం — బాలచంద్రుడు

రాహుల్జీ పార్టీ సభ్యత్వ రద్దుకి దారితీసిన అధికార భాషా చర్చ—సుధీ ప్రధాన్.

---

Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.
Working Editor : NIRMALANANDA

## రాహుల్జీ

మనల్ని మన చుట్టూ తిప్పి
మన ముందు నిలబెట్టి
మనమేమిటో చెప్పింది నువ్వు కదూ!

నిరంతరం తన చుట్టూ తాను పరిభ్రమిస్తూ
భూమి- సూర్యుడి చుట్టూ తిరుగుతుంది
కదిలినట్లే అనిపించకుండా-

నీ చుట్టూ నువ్వే సుడిగాలై
మనుషుల చుట్టూ తిరిగి
మహాద్భుత ప్రపంచాన్ని చూపి
మౌనిలా కూర్చుంది నువ్వే కదూ!
రాహుల్జీ!

ఇపుడు మా చుట్టూ మేమై
నీ చుట్టూ, నీ ప్రేరణల చుట్టూ
నీ సార్వ్యాపతా సాలోచనల చుట్టూ
తిరిగే సాహస భూగోళాల మధ్యే నేపథ్యం
మేధో వీధులమై పిచే, భూమిక
నిస్పందేహంగా నువ్వే!

నిత్య చలన శీల విస్తృతార్థాల్ని
నెత్తికెత్తుకోవటం
మేము నీకు పడ్డా మొత్తం బాకీ-
వేడెక్కి వేగం నాడి పట్టుకుని
వేగాన్నందుకోవడం

జీవితాన్ని దీవించి నిర్వచించుకోటం
వేకువలవ్వటం వెలుగులవ్వటం
మా భ్రమణాన్ని పరిధి రేఖ.